జూన్, 1959

# జయంతి
# 8

సంపుటము 1 సంచిక 8

ఈ సంచికలో

నాయని సుబ్బారావు
చెరుకుపల్లి జమదగ్నిశర్మ
కావూరి పూర్ణచంద్రరావు
రమణారెడ్డి
అనుముల కృష్ణమూర్తి
సి. యస్. ఆర్. ఆంజనేయులు
కొండముది శ్రీరామచంద్రమూర్తి
కొర్లపాటి శ్రీరామమూర్తి
ధూళిపాళ శ్రీరామమూర్తి
విశ్వనాథ సత్యనారాయణ

[redacted]

ఆధునిక సాహిత్య గతిని సూచించే

*హిందీ మాసపత్రిక :*

# 'కల్పన'

నవ్య కవితా రీతులు

కథలు

సాహిత్య విమర్శలు

ఆధునిక సాహిత్య సమస్యలపై

విశేష చర్చలు.

కార్యాలయము :

౫౧౬, సుల్తాన్‌బజార్

హైదరాబాద్.

# జయంతి

## 8

జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః.



సంవత్సర చందా 8-0
విడిప్రతి 75 న. పై.

సంపాదకీయం 2

సాహిత్యధార 5

వేదనావాసుదేవము
నాయని సుబ్బారావు 8

నన్నయ్యగారి కథాశిల్పము
ధూళిపాళ శ్రీరామమూర్తి 10

అభిజ్ఞాన శాకుంతలము
విశ్వనాథ సత్యనారాయణ 21

పంకజాంకురము
వెలుకపల్లి జమదగ్నిశర్మ 25

వాసనాసామ్యము
అనుముల కృష్ణమూర్తి 25

బలిపీఠము
కొండముది శ్రీరామచంద్రమూర్తి 26

భార్గవీగీత
సి. ఎస్. ఆర్. ఆంజనేయులు 38

శ్రీనాథుడు - పల్నాటి వీరచరిత్ర
కార్లపాటి శ్రీరామమూర్తి 39

బాలచంద్రుడు
లాఓ షే 44

చర్చావేదిక
కాపూరి పూర్ణచంద్రరావు 59
కె. వి. రమణారెడ్డి
మోటూరి వెంకటరావు

పుస్తకసమీక్ష 65

# సంపాదకీయము

కవి, గద్యకవి, పదకవి, గేయకవి, ఈ మాటలు ప్రచారములో నున్నవి. వీని యన్నిటియందు[redacted] యన్న మాట కలదు. చివరి మాటలలో గద్య, పద, గేయ శబ్దములు కలిసియున్నవి. కవి యన్న శబ్దము సర్వథా ఈ యందరకు ప్రయోగింప దగిన దైనచో సోపపదముగా నెందుకు ప్రయోగింప వలయును? ఈ యుపపదము ఊరకే వక్తృవివక్షాధీనమైనదా, అధిక భేద నిరూపకమైనదా? అధిక భేద నిరూపకమైనచో నీ మాటలయందు కవి శబ్దము కంటె యుపపదమునకే ప్రాధాన్యము వచ్చును. ఇది వెండి అన్న వాక్యముగలదు. ఇది అన్న మాట విశేష్యము. వెండి అన్నమాట విశేషణము. అట్లే గద్యపదగేయములకు ప్రాధాన్య వివక్ష వచ్చి కవిశబ్దము గౌణార్థమందు ప్రయోగింప బడినట్లుగా లోకమునందు గ్రహింపదగును. అతడు నిజముగా కవియైనచో గేయకవి యని చెప్పుట యెందులకు? కవి యన్న శబ్దము ప్రధానముగా నెవనియందు వాడబడునో వాని విషయమున నుపపదము వాడవలసిన యవసరములేదు. కవి శబ్దము దాని యంతట నది ధర్మవాచి. సోపపదమైనప్పు డౌపచారికము. గేయ, పద, గద్య విషయములందు కవిశబ్దము వాడినచో నట్టివాడు నిజముగా కవి యన్న భావమున్నట్లు శబ్దప్రయోగ సామర్థ్యముచేత లేదు. మరి కవి యనగా నెవడు? పద్యము రచించినవాడే కవి. అంతమాత్రముచేత కవియా? ఇది స్థూలమైన లక్షణము. 'పెద్దనవలె కృతిసెప్పిన పెద్దనవలె నితర కవుల పెద్దనవలెనా' మొదలైన పద్యము కలదు. దీనిలో ఆయనవలె కృతి చెప్పగా వానిని పెద్ద యనవలయును. ఇతర కవులను పెద్ద యనవలయునా యని ప్రశ్న. తక్కిన వారి నేమనవలయునో తక్కిన పద్యములో నున్నది. కాని యితర కవులు అన్న మాటలో నున్న కవిశబ్దము కూడ నౌపచారికమే. వాడు కవి కాదని యర్థము. కాని వానిని [redacted] కవి యనియే వ్యవహరించు చున్నారు. వ్యవహరించుటను మన మేమియు చేయలేము. ఇది లోకము. లోకమునందు బహుశబ్దములు గౌణముగా, సౌపచారికముగా వాడబడును. తాత్పర్య మేమన ప్రయోగ రహస్యము వలన గేయ, పద, గద్య కవులు యథార్థముగా కవిశబ్ద వాచ్యులు కారు. కవుల లక్షణము కొంత వారి యందు కూడ నున్నది కనుక కవులని వాడబడు చున్నారు.

ఈనాడు గేయకవులసంఖ్య వృద్ధి పొందినది. అంతియేకాదు. వారి కొక విశిష్టమైన మర్యాద సంపాదింపబడుచున్నది. వారిలో వారు కవి యనగా గేయము వ్రాసినవాడే అని తీర్మానించు కొన్నట్లుగూడ కనిపించుచున్నది. ఒకానొకప్పుడు గద్యకవి వీరికన్నకూడ మించిపోయిన ట్లున్నది. ఈ మార్పెందుకు వచ్చినది? మార్పులు వచ్చును. కారణ సామగ్రి చిత్రముగా నుండును. ఒకొకప్పుడు కారణము కారణము కానట్లుగూడ కనిపించును.

మరియు మూలకారణములను వదలిపెట్టి సన్నిహిత కారణములనే పరిశీలింతము. పాశ్చాత్యులీదేశము లేల రాకముందు ఇచ్చటి సంఘమొక వ్యవస్థాశ్రయముగా నుండినది. వారు వచ్చిన తరువాత సర్వమును తారుమారైనది. జీవితసర్వశాఖల యందునను మారినది. అట్లే సారస్వతమునందును మారినది. పూర్వ మీ దేశమున రెండు విస్పష్టములైన కవితామార్గములు కలవు. ఒకటి మార్గ కవిత్వము. రెండవది దేశికవిత్వము. స్త్రీలపాటలు, మరాఠీకథలు, బొబ్బిలికథలు, భజనకీర్తనలు, ఏలపాటలు, సువ్విపాటలు మొదలైనవి కొన్ని వందల రకముల కవిత్వము దేశమునందుండెడిది. ఇది యంతయు దేశికవిత్వమని చెప్పవచ్చును. ఛందస్సు నాశ్రయించి, వ్యాకరణము నాశ్రయించి, శబ్దశక్తి

వాశ్రయించి, రసము నాశ్రయించి, గుణదోష ముల విచారించి, వృత్తిరీతి పాకాదులను నిరూపించి, యలంకార సంయోజనముచేసి, ధ్వనిని ప్రధాన ముగా చేసికొని వ్రాసిన కవిత్వమునకు మార్గ కవిత్వమనిపేరు. ఈ మార్గకవిత్వములోననే ఉత్తమ మధ్యమాధమములు కలవు. చిత్రకవిత్వమున్నది. చాటుకవిత్వమున్నది. బంధకవిత్వమున్నది. వీనికి వ్యంగ్యమర్యాద పాటించిన కవిత్వమున కున్న మర్యాదలేదు. కాని మొత్తముమీద ఇదియంతయు మార్గకవిత్వముగానే పరిగణింపబడినది. కాని దేశి కవిత్వమునకీ మర్యాదలేదు. ఎందుకు లేదు? ఎందుకులేదో తెలియుట కొక యుదాహరణ చూతము. కవిత్వములోవలెనే సంగీతములోనను, నాట్యములోనను మార్గ దేశి భేదములు కలవు. అన్నమాచార్యులు, త్యాగరాజు, దీక్షితులు మొదలైనవారి కృతులకు మార్గసంగీతమనిపేరు. అది శాస్త్రము ననుసరించి ప్రవర్తించిన సంగీతవిద్య. శాస్త్రమర్యాదలేక, శాస్త్రపరిజ్ఞానములేక, సహజముగా నేదియో పుట్టికొనివచ్చిన సంగీతమున్నది. దానిలోకూడ కొంత లయ, కొంత రాగచ్ఛాయలు కలవు. అందుచేతనే అదికూడ సంగీతమనిపించుకొనును. దానియంతట నది మొలిచి పెరిగిన చెట్ల సముదాయ మడవి. పెంచినదానిపేరు ఉద్యానవనము. అడవికి ఉద్యానవనమునకు భేదమేమి? అడవియందు మనము కూర్చుండుటకు శిలావితర్దికలు లేవు. ఏవైపుననుండి యెండపడునో, మనము వాంఛించినచోట నాయెండపడకుండ మలచిన పూవుతీగలులేవు. ఆ ఋతువునందు ఆ దిశనుండి వాయువు వచ్చును. ఆ వాయువు ననుభవించుటకు వీలుగా నేర్పరచిన పూవుటోవరులులేవు. ఉద్యానవనమునందు మనము సుఖమును బోదెలవెంట మలచికొన్నాము. అడవిలో అది ప్రాపించినచో ప్రాపించును. లేనిచో లేదు. ఒకడు నాకడవియే బాగుగా నున్నదనవచ్చును. అది వానికి వ్యక్తిగతమైన యభిప్రాయముగాని నాగరకత వృద్ధిపొందించుకొన్న యొకజాతియొక్క వివేక జనితమైనది, సుపరిశీలితమైనది, సునిర్మితమైనది, యైన సుఖభావము కాదు.

ఇది మార్గదేశి సంగీత భేదము. దేశి సంగీతము పలువిధములు నేడు చూడవచ్చును. ఒకటే రాగము నాటకము లాడువా రొక రీతిగా పాడుదురు. ప్రసిద్ధులైన నేటి రంగ గాయకులలో ప్రతి రాగము పైన నెత్తికొనుట; సర్వప్రస్తార మక్కడనే. ఆ రాగమునకు రెండే లక్షణములు. కొంత మేర గీత గీసినట్లు సాగును. మఱి కొంతమేర గిర గిర తిరుగును. ఇది నాటక సంగీతము. హరికథల సంగీతము వేరు. వీథినాటకములవారి సంగీతము వేరు. ఇప్పుడు వీథి నాటకములవారు కూడ రంగ సంగీతమే పాడుచున్నారు. తోలుబొమ్మలవారి సంగీతము వేరు. ఒకటే రాగమింతమంది భిన్న భిన్నముగా పాడుదురు. వేసెడు సంగతుల యొక్క విలక్షణత్వము చేత, పరిమితత్వము చేత, రాగములు మారిపోవుచున్నవి. ఒకొకప్పుడే రాగమో గుర్తే పట్టలేము. ఈ రాగములయొక్క శుద్ధమైన స్వరూపము, దాని అచ్చమైన ప్రస్తారము, దానియొక్క భావము, మార్గసంగీతమునందే కనిపించును. మార్గ దేశి పద్ధతుల యొక్క స్వరూపలక్షణ ప్రయోజనములు వీనినిబట్టి నిర్ణయించుకొనవచ్చును. దీనిని గురించి విస్తరించి యెంతయో వ్రాయవలయును. కాని సూచికగా వ్రాయబడినది.

ఈ భేదమే ఈ రెండు పద్ధతుల మధ్య కవితా విషయమున కూడ నున్నది. ఇది మన పూర్వుల యభిప్రాయము.

ఆంగ్లేయ పాలనములో పూర్వమైన సంఘ వ్యవస్థ తారుమారు చేయబడుటతో తద్వ్యవస్థాశ్రయమైన సర్వ విషయములతోపాటు సారస్వత భావముకూడ తారుమారు చేయబడినది. ఈ వ్యత్యయము నేటికి నూటికి తొంబదిపాళ్ళు పండినది. వీథినాటకమేలేదు. ఉన్నచో పరిహాసభాజన మగు

చున్నది. తోలుబొమ్మలు లేవు. పలు రకముల పాటలు పాడుచు భిచ్చమెత్తుకొనుట వృత్తిగా గల వారు లేరు. వారి మర్యాద పోయినది. భజనలు లేవు. ఎన్నియో దేశిమార్గములు నశించినవి.

ఈ సంఘవ్యత్యయ ప్రారంభ దినములలో మార్గ దేశి పద్ధతుల విభిన్నత యర్థము చేసికొను లక్షణము పోయినది. ఎవరో మీ గ్రంథములన్నియు నర్థముకావు, అవి జటిల సమాసపూరితములు, వాని యందు భావము తక్కువ. ప్రాచ్య శిల్పము నకు నగిషీ యం దెంత ప్రేమయో కావ్యధ్వని యం దంత ప్రేమలేదు— మొదలైన భావముల యొక్క సారాంశము చెప్పినట్లు చెప్పబడినది. అది తత్కాలికులకు నచ్చినది. విద్యావంతు లనగా వారైనారు. వారినే విద్యావంతులన్నది ఆ నాటి రాజ్యశక్తి. రాజానుమతో ధర్మః. కథ మారి పోయినది.

నేటికి నలుబది యేండ్ల క్రిందటి వరకు పింగళి సూరన కావ్యములు, మనుచరిత్రము, వసుచరిత్రముతో దీటైనవని యనుకొనెడువారు కారు. ఈ నలుబది యేండ్లనుండి వారికంటె ఈయనయే గొప్పవాడైనాడు. తత్పూర్వము వేమన్న కవి కాదు. వేమన్న వ్రాసిన పద్యములు కవిత్వముగా పరిగణింపబడలేదు. ఈ నలుబది యేండ్లలో నాయన మహాకవి యైనాడు. దృష్టిభేదమింత చేసినది. అవ్యవస్థితమైన మార్గమున వెలలు నిర్ణయించుట కష్టము.

ఇంతకు పూర్వమునందు యథార్థముగా కవి యనగా నెవడు? అని విచారించినచో వృత్తి రీతి పాకములుగలిగిన పద్యరచనచేసినవాడు మాత్రమే నాడు కవిశబ్దవాచ్యుడు. 'రీతి రాత్మా కావ్యస్య' అన్నది మూలసూత్రము. తరువాత ధ్వనివాదము వచ్చినను మూలభూతమైన రీతివృత్తులకు వ్యతిరేకముగా వారు చెప్పలేదు. ధ్వనివాదు లుదహరించిన సర్వపద్యములయందు వృత్తిరీతులు భాసించుచునే యున్నవి. అది యక్కఱలేదన్నట్లు వారు చెప్పలేదు.

ఇతడు మానవుడు అని చెప్పినంత మాత్రమున వానివట్టి శరీరాకృతినిగూర్చి చెప్పినట్లా? మానవత్వమును గూర్చి చెప్పినట్లుకాని. ఆ యాకృతి యుండవలయును. మానవాకృతి యున్నతరువాత మానవ లక్షణములు కలిగినచో వాడు మానవుడు. అట్లే వృత్తిరీతిపాకశయ్యాలంకారాదులుకలిగి, వ్యాకృతమైన శబ్దప్రయోగము కలిగిన, శిష్టమైన, పూర్వకవిప్రయుక్తమైన, ప్రసిద్ధమైనఛందస్సునాశ్రయించి వ్రాసినకవికే కవిశబ్దము ప్రయోగార్హమైనది. ధ్వన్యాదినిక్షేపముచేతను త్తమకవియైనాడు. అశిక్షితమైన సంగీతము నాటకములందువలె అశిక్షితమైన కవిత్వము గేయము మొదలైనవానియందుండును. కవితాగుణము నిస్సంశయముగానుండును. ఓరి కోతీ యని యొకనిని పిలిచితిమి. ఈ కోతియన్నశబ్దము గౌణముగా వాడబడినది. అది కవిత్వములో నొక భాగము. కాదనుటకువీలులేదు. ప్రయోగించినవాడు లోకమునుబట్టి ప్రయోగించినాడు కాని దానికా యర్థమున్నదని తెలిసి ప్రయోగించలేదు. తెలిసి ప్రయోగించకపోయినంతమాత్రమున నాయర్థము దానియందుండదాయని ప్రశ్నించవచ్చును. నిస్సందేహముగా నుండును. కాని కవి దానినట్లు ప్రయోగింపడు. మరి యెట్లు ప్రయోగించును? సందర్భౌచిత్యములు, కథయందు పొసగింపు మొదలైన వానితో కలిపి ప్రయోగించును. ఇదియే యొక శిల్పము. మొదటి ప్రయోగమునకు దీనికిని భేదమేమనగా తొలుతచెప్పిన అడవియు ఉద్యానవనమును. ఇది ఈ సర్వవిషయములు తెలిసి భావన చేసి తచ్చర్వణమువలన విశిష్టమైన యనుభూతి సంపాదించుకొనుట కేర్పడినది. అడవి యనుభూతి కాదు. ఉద్యానవనమునందలి నాగరకానుభూతి.

ఉత్తమకవిత నాగరకజాతిలక్షణము.

## సాహిత్యధార :

ఈ సాహిత్యధార నేను వ్యావహారిక భాషలో యెందుకు వ్రాయుటలేదని కొందరడుగుచున్నారు. నేను నివసించుచున్న ప్రాంతములోని శిష్టులు మాటాడుభాష వ్రాసినచో అది ఇతర ప్రాంతముల వారికి సుగమము కాదేమో అన్న భయము నాకున్నది. ఇతర ప్రాంతములోని శిష్ట జన వ్యవహారము నేనెందుకు వ్రాయవలయునో నాకు తోచదు. ప్రయత్నించి వ్రాసినను అది నా వ్రాతలో సహజముగానుండదు. మరియు ఆధునికుల వ్యావహారిక భాషోద్యమము అసాధు శబ్ద రూపములు ప్రయోగించుట మాత్రమే ప్రయోజనము కలదిగా పర్యవసించినది. వారు శబ్దమును జనులుచ్చరించునట్లు వ్రాయుట వ్యావహారిక భాష వ్రాయుట అనుకొనుచున్నారు. అనేక శబ్దముల చివరి 'ము' ప్రత్యయమును సున్నగా మార్చినంతనే గ్రాంధిక భాష వ్యావహారిక భాషయై పోయినదా? ఈ వ్యావహారిక భాషలో జటిల సమాసములున్నవి. చివరి ప్రత్యయము మాత్రము మారుచున్నది. 'కాదన కిట్టిపాటి యపకారము తక్షకుడేక విప్ర సంబోధనజేసి జేసె.' 'పై(?)వడి పోయెగాక ధృతరాష్ట్రుడు గన్నదియేమి యీ సభ కా దావలదన్న గీడుడుగదా?' 'హరిజాడ పుణ్యమయ్యెడి చెపుమా!' 'మీ పాదలమాటున లేడుగదమ్మ చెప్పరే!' 'ఇంతలు కన్నులుండ తెరువెవ్వరి వేడెదు' 'న్యాయము చెప్పవచ్చితిరయా పదునల్గురు గొప్పవీరులై' 'కొడుకుల్ కొమ్ములు లేరె భర్తయును నీకుకాలేదె?' మొదలైన పద్యపాదములలోనున్న శబ్దరూపములన్నియు గ్రాంధికములు. కాని భాష పరమ వ్యావహారికము. ఎందుకనగా తెలుగువాని నోట ఆ భావమున కభివ్యక్తి యట్లే జరుగును. వ్యావహారిక భాషకు ప్రాణభూతమైనది శబ్దరూపము కాదు. అభివ్యక్తీకరణ పద్ధతి; ఆ పద్ధతిని వదలి కేవలము జనులుచ్చరించినట్లుగా శబ్దరూపములు వ్రాసినందుచేత అది వ్యావహారికము కాదు. జనుల ఉచ్చారణలో శబ్దము తన సాధురూపమును గోల్పోవును. అంతే. జనుల వ్యవహారమునుండి గ్రహింపవలసినది వారి అభివ్యక్తీకరణపద్ధతి. వారి యుచ్చారణ కాదు. వారి అభివ్యక్తీకరణలో ప్రాణముండును. శక్తి యుండును. కవిత్వ ముండును. ఉచ్చారణ ప్రాంత ప్రాంతమునకు భిన్నము. దానిని ప్రాతిపదికగా గైకొన్నచో ఈ తెలుగుదేశములో పది పన్నెండు విధములైన భాషలు రూపొందును. ఒక ప్రాంతమువారి భాష ఇంకొక ప్రాంతము వారికి క్రొత్తగా నుండును. వింతగా నుండును. విడ్డూరముగా నుండును. తెలుగు దేశములోని భిన్నప్రాంతములవారు ఒకరిభాష నింకొకరు వెక్కిరించుకొనుట మనము చూచుచునే యున్నాము. వీరందరికిని సామాన్యమైన రచనా భాష ఒకటి ఉండవలయును. అది నేటి వ్యావహారిక భాష కానేరదు.

కాక, పై జెప్పిన అభివ్యక్తీకరణ దృష్ట్యా చూచినచో వ్యావహారిక భాష పూర్వ గ్రంథములలో నున్నది. అది సుసంస్కృతమైన భాష. కాని తన తెలుగు తనమును కోల్పోని భాష. నేటివ్యావహారిక భాషావాదులు వ్రాయుచున్నది అసంస్కృతమైన భాష. తెలుగుతనము కోల్పోయిన భాష. ఇందుకు వందలకొలది ఉదాహరణములీయవచ్చును.

జయంతి మే సంచికలో శ్రీ సోమసుందర్ గారి 'చైతన్యభారతి' ప్రకటింపబడినది. ఈ రచనలో ప్రశంసనీయమైనది కవి వాడిన ఛందస్సు. పట్టరాని యానందముచేత లోకులు గుంపులు గుంపులుగా నృత్యము చేసినట్లున్నదీ రచన. కాని యీ కవికి శబ్దముయొక్క ధ్వనియందున్న ప్రేమ శబ్దార్థము నందున్నట్లులేదు. ఒక ప్రత్యేక ధ్వనిగల శబ్దములను కూర్చి అనుకూల వాతావరణమును కల్పించుటలో కృతకృత్యుడైన కవి ఆ శబ్దముల ద్వారా తన యుద్దిష్టార్థమును సాధించుటలో సఫలుడు కాలేదు. కొన్నిచోట్ల శబ్దము దాని ధ్వని కోసమేగాని అర్థము కోసము వాడబడలేదు. శబ్దముయొక్క సరియైన అర్థమును తెలిసికొని

గాని, ఆలోచించిగాని దానిని ప్రయోగించినట్లు కనబడుటలేదు. కవియైనవాడు శబ్దమునందర్థమును వ్యభిచరింప నీయకూడదు. మరియు సమాసఘటనమునందు కవి జాగ్రత్త వహించినట్లులేదు. కొన్ని శబ్దములు ఒకచోట కూర్చినంత మాత్రముచేత సమాసము కుదురదు. అర్థవికృతిని గల్గించు శబ్దములను గూర్చి లాభములేదు. కేవల సమాస రచన తక్కువరకపు విద్యగా పరిగణింపబడుచున్న ఈ కాలములో సమాసమునందు వ్యామోహములేని కవులు మాత్రము కనబడుటలేదు. ఆ సమాసరచనకూడ ఎటువంటిది? త్రాగలేని పిల్లి బోర్లగిల పోసుకొన్నటువంటిది.

వచనరచనమును గురించి వ్రాసిన వ్యాసమునకు(జయంతి-7) శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి గారిని ప్రశంసింపక తప్పదు. వారి యుపపత్తులు బలమైనవి. కాని విషయ విమర్శనముతో బాటు ప్రతివాదిని దూషించుటకూడ వీరి రచనలో కనబడుచున్నది. సంపాదకులు కొంత బాధ్యతా రహితముగా ప్రవర్తించుచున్నారని చెప్పవలసి వచ్చుచున్నది. జయంతి సంపాదకులు ఈ దోషమున కిదివరకొకసారి పాల్పడినారు.(చూ. సాహిత్య మీమాంస - జయంతి - 6) 'మీకు తెలియదు. పరమేశ్వరుడే మిమ్ము రక్షింపవలయును.' ఇది తర్కముకాదు. పైగా ఇటువంటి వాక్యములు వాదించువాని దౌర్బల్యమును సూచించును. తమ వ్యాసకర్తలు ఎచ్చటను మర్యాదాతిక్రమణ దోషమునకు గురికాకుండచూచు బాధ్యత సంపాదకులపై నున్నది. వాదప్రతివాదములలో రచయితల కావేశములు పెరుగవచ్చును. తాము వ్రాయుచున్న వాక్యములలోని మంచిచెడ్డలను గుర్తించు సామర్థ్యము కూడ వారప్పు డప్పుడు కోలుపోవచ్చును. ఇది తెలుగుదేశము. వాదములో నెంతెంతదూరము పోవచ్చునో కొందరు పెద్దలు మనకు నేర్పిపోయినారు. దూషణవేరు, ఖండనవేరు. ఎదిరి యభిప్రాయమును ముక్కలు ముక్కలుగా ఖండింపవచ్చును. కాని ఖండనా వ్యాపారములో దూషణకు దిగువాడు వాదనకు యోగ్యుడు కాడని యర్థము.

ఈ రెండునెలలలో భారతి నిస్సందేహముగా కొంత ముందడుగు వేసినదని చెప్పక తప్పదు. చాలకాలముగా తన్నావరించిన నిద్రామాంద్యమును భారతి వదల్చుకొను ప్రయత్నము చేయుచున్నది. నన్నయ్యగారి కావ్యసిద్ధాంతము మమ్మట విశ్వనాథ, జగన్నాథ పండితుల కావ్య సిద్ధాంతముల యొక్క సమన్వయ స్వరూపముగా నిర్వచించిన శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తిగారిరచన (భారతి - మే) పేర్కొన దగినది. నన్నయకావ్యసిద్ధాంతమును గూర్చి ఈక్రొత్తమాట చెప్పిన గౌరవము శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తిగారి కేదక్కినది. 'యెంకిపాటల శిల్పవైఖరి' అన్న శ్రీ పిలకా గణపతి శాస్త్రిగారి వ్యాసము ఉదాహరణ వ్యాసము మాత్రమే యైనది. ఈ దోషమునుండి శ్రీ సాళువ కృష్ణమూర్తిగారు తప్పుకొనుటకు ప్రయత్నించినారు (విశ్వనాథవారి ప్రణయ దర్శనము). తామిచ్చిన యుదాహరణలను వ్యాఖ్యానముచేయు ప్రయత్నమిందు కొంత కనబడుచున్నది.

ఆంధ్రసచిత్ర వారపత్రికలో శరత్ చెప్పిన కథలు ప్రచురింపబడుచున్నవి. తెనిగింపు మరికొంత బిగువుగా నున్నచో ఈ కథల యొక్క ఆకర్షణ గాఢతరమగుననుటలో సందేహములేదు. భారతీయులకు శరత్‌కంటె దగ్గరవాడైన రచయిత ఇంకొకడు లేడేమో!

'స్రవంతి' మే సంచికలో శ్రీ మధునాపంతుల సూరయ్యశాస్త్రిగారి దేవీనవతిపై సమీక్ష ప్రచురింపబడినది. ఆ సమీక్ష అదివరకే అక్షరాక్షరము జయంతి ఏప్రిల్ సంచికలో ప్రకటింపబడినది. ఇదివరకొకచోట ప్రకటింపబడిన దానిని మరల ప్రకటించుట అటు సమీక్షకులకు, ఇటు సంపాదకులకు తగిన పనికాదు. తనపుస్తకముపై దేశములోని వివిధపత్రికలు ఎటువంటి యభిప్రాయము లిచ్చునో

చూడవలయునన్న ఆతురతతో రచయిత పుస్తకము సమీక్షకు పంపుకొనునుగాని అంద రొకచే పాట పాడవలయునని కాదు. ఇటువంటివి జరిగినప్పుడు రచయిత కాశాభంగము తప్పదు.

చాలకాలము తరువాత శ్రీ జమదగ్నిగారి కథ కనబడినది. (బొమ్మలపెళ్ళి—స్రవంతి, మే) ఈ కథ ఇదివరకే వాణిలో ప్రకటింపబడినట్లు జ్ఞాపకము. 'బొమ్మలెంతో మనమూ అంతే. కాకపోతే మనం కదిలేతోలుబొమ్మలం. పిల్లలు బొమ్మలతో ఆడుకొన్నట్టే మనతో దేవుడాడుకుంటాడు. ఆదేవుడు కూడా మంచిబొమ్మల్ని దాచుకొని ఇట్టే పగిలిపోయే పిచ్చిబొమ్మల్నే ఆడిస్తాడుకాబోలు' ఈ భావము నిట్లు కథగా వ్రాయుట సామాన్యమైన విషయము కాదు. లోపల పుట్టెడు వేదన ఉన్న వాడెవడో కాని ఈకథ నిట్లు వ్రాయలేడు. తెలుగు దేశములోని ఉత్తమకథకులలో నొకరైన జమదగ్నిగారు తరచుగా వ్రాయకపోవుట పాఠకుల దురదృష్టము.

ఇచ్చట అప్రస్తుతమైనను చెప్పవలసి వచ్చుచున్నది. జమదగ్నియన్న పేరుతో హైదరాబాదులో జరిగిన నాటకప్రదర్శనాలను గురించి ఒక వ్యాసము కొన్నాళ్ళక్రింద స్వతంత్రలో ప్రకటింపబడినది. ఈ నామసామ్యము చిక్కులకు దారితీయుచున్నది. తెలిసికొనగా లబ్ధప్రతిష్ఠులైన జమదగ్నిగారికీ ఈ స్వతంత్ర జమదగ్నికీ ఏమీ సంబంధములేదని తేలినది. రచయితలు ఈ లఘునామములు వదలి తమ పూర్తిపేరులు వ్రాసికొన్నచో ఈచిక్కులనుండి చాలవరకు తప్పుకొనవచ్చును.

ఈ పరిశోధకులు విచిత్రమైన ప్రాణులు. వారూహించుట మొదలుపెట్టినచో దానికిఅంతుపొంతు ఉండదు. వెనుక ఒక పేరుగాంచిన పరిశోధకుడు గోదావరి పేరునుగురించి మాట్లాడుచు 'ఇది మొట్టమొదట గోదాశబరియై యుండనోపును. రాను రాను వ్యవహారములో వర్ణలోప వర్ణభేదాదులచేత మొదట గోదాబరియై తరువాత గోదావరియై యుండవచ్చును' అన్నాడట. వినుచున్నవారిలో ఒకాయన 'అయ్యా! పోను పోను 'గోరి' కూడ కావచ్చును.' అన్నాడట. ఈ యన్నింటికంటె విచిత్రమైన పరిశోధనా వ్యాసము మే నెల స్రవంతి (నన్నయ్యకు ముందున్న తెలుగు కవులు—మల్లెల నారాయణ)లో ప్రచురింపబడినది. నన్నయ్యకు పూర్వము తెలుగుకవు లుండిరట. అందులోనొకడు 'విలట్టాశ్రిఖ్ణము' 'కవుకోక్కలిక' మొదలగు సంస్కృత భాషాగ్రంథములు తెలుగుభాషలోని కనువదించెనట. ఈ సంస్కృత భాషాగ్రంథముల పేర్లు మాత్రము సంస్కృతము వలె లేవు. మరి యా తెలుగెట్లుండినదో తెలియదు. నన్నయకు పూర్వ మున్నారని చెప్పబడుచున్న కొందరు తెలుగు కవులు వ్రాసిన పద్యముల ఉదాహరణములు కూడ ఇందున్నవి. ఇది చూడుడు.

ఎలు తత్రపర్జ ఘూర్జరుడు వివా హే
కలుసిత్ప ఘూర్జితుండై కదలెన్
కలికాత్రబంది కేశికంబున; వే
రలి వత్రుపల్లుండై సాతీక...రుగనీ.

ఇటువంటి కవిత్వము నన్నయ్యకు పూర్వమేయేమి, వాల్మీకికి పూర్వము కూడ నుండవచ్చును. నన్నయ్య తెలుగులో ఆది కవి యనగా తెలుగులో మొట్టమొదటి కావ్యము వ్రాసిన వాడనియర్థము.

ఇక ఈ వ్యాసములో వాడిన భాష నిజముగా విప్లవాత్మకమైనది. 'అక్షరపు వచన రచనా కుదింపు, పద్యబిగింపు, ... .... తాను రచనబూనిన పదసొంపు, భావనిగూఢార్థయింపు, రచనా మేళవింపు, కుదింపు, బిగింపు, బంపు.......'

మరల మరల విన్నవింప పలసి వచ్చుచున్నది. సంపాదకులు బాధ్యతా రహితముగా ప్రవర్తించుచున్నారని. ఇంకెన్నిసార్లు చెప్పవలసి వచ్చునో తెలియదు.

— సమవర్తి.

## నాయని సుబ్బారావు | వేదనావాసుదేవము

3

ఒక నిర్వేదపు వెల్లువన్ మునిగి ని న్నుద్వాసితుంజేసి భ
ల్లుకపుం బట్టుగ నాదుగుండె గుడి తల్పున్మూసి లోనన్ బిగిం
చు కొనంగాగడె, యేమి నా తెలివి మందున్ ! తల్పుపైనుండి పా
యక తీయంగల కుంచెకోల యది నీ హస్తార్పితమ్మై ప్రభూ !

నను నుద్వాసితుజేసె వీడని సదానంద ప్రసన్నాకృతీ !
కనలే పుట్టదు నీకు, తల్పు తెఱువంగా నీవు పొంచుండి మె
ల్పున సారించిన కుంచెకోల మొనత్రిప్పుల్ నాకు గిల్గింతలై !
తను వుద్యత్పులకాప్తి కోరకిత మందారద్రుసంకాశమై !

కుంచిక త్రిప్పులన్ విడియగొట్టిన లోగడె యా కవాట మిం
చించుక యోసరించి హసియింపుల లోల దృగంచలమ్ములన్
కొంచెము తొంగిచూతు, శతకోటి తటిల్లత లొక్కసారి చుం
బించిన యట్లులై వెలుగు వేలగ నాదు తమోంతరంగమున్.

నిను నిర్వాసితుజేయ నే నెవరు తండ్రీ ! చీమవై బ్రహ్మవై
అనిరుద్ధాకృతి విశ్వభూభువనముల్ వ్యాపించి నీ వుండగా
మినహాయింపగునేమి నాయెడద, స్వామీ ! తప్పు వచ్చెన్ బిగిం
చనులే త ల్పిక, సర్వజీవహృదయస్థా ! వాసుదేవప్రభూ !

నను నిర్వాసితుజేసి నేతుహిమవన్మధ్యస్థలిన్ దైన్య భా
జనతన్ త్రిప్పెదవయ్య ! చేతి కొక భిక్షపాత్ర సంధించి నీ.
పనుపేమో యెఱుగంగరాదిది మహాప్రస్థానమై పేర్చునో !
కమగంతల్గల గానుగెద్దు నడకల్గా నై సుడుల్ వోవునో !

ఓతప్రోతములైన మార్గముల చొ పృహింపరాదైన వీ
తాతంకమ్ముగ దృష్టిగోచరపథ వ్యామోహినై పోవుచో
శ్వేతద్వీపమువచ్చె నింకొకటి వచ్చెంగాక నాకేమి సం
గాతమ్మై వెనువెంట వత్తువనియుఁ నాకొక్కటే ధైర్యమై!

వెనుకంజేరియు తందనాల్ పలుకుటే వేడ్కైనచో నెట్లు, ముం
దునకుఁ వచ్చియు దారిజూపు మది కాదో మోయగా భారమై
చను నీ యక్షయపాత్ర నీవును ధరించఁ వచ్చుగా కొంత నే
పనిదంపూర్వ్వడ వేమి కాదుగద! నీ యాధిక్యముం జాటుకోన్.

ఇదియే మత్యయమయ్య! నా హృదయమందేమూలనో లీలగా
కదలుఁ నీపద బంధముల్ ప్రతి గృహాగ్రశ్రేణి నం చద్రసా
భ్యుదయ శ్రీకముగా సమర్పితములై, ఓ వేయినామాల దొ
ద్ద దొరా! ఒక్కడు చూడడుఁ వినదు మాటల్ రెండు మాట్లాడడుఁ!

వెనుకని ముంద అంచు నతివేలముగా వెతబెట్ట నెంతగా
చినిగితివయ్య! యింక దయసేయుము నా యెద పాన్పుమీది కే
యనువునసైన గేస్తు మరియాదకు లోపములేక యింత నీ
తినుటకు తెచ్చిపెట్టి దగదీర్తునులే! ప్రణతార్తి భంజనా!

ధూళిపాళ శ్రీరామమూర్తి

# నన్నయ్యగారి కథాశిల్పము

## ఉదంకుని కథ

మహాకవులు రెండువిధములు. ఒకడు ఋషి. రెండవవాడు ఋషికల్పుడు. ఆ ఋషియైనవాని కవిత్వము శరన్నదివలె అతి స్వచ్ఛముగా ప్రసన్నముగా ప్రవహించును. ఈ ఋషికల్పుని కవిత్వము వార్షుకనది. సుడిగుండములతో తరంగములతో ఒడ్డు నొరసికొని ప్రవహించునది. ఆ ఋషి రచనము నీటికొలది తామర. ఈ ఋషికల్పుని రచనము ఉత్తాలమైనది. తలయెత్తిచూచినగాని కన్పించనిది. ఆ ఋషికవిత్వము దిగినకొలదిగాని లోతు తెలియనిది. ఎప్పటికప్పుడు పాఠకుని ఊహకుపైన బెత్తెఁడుండునది. అది యెంతదూరము పోయినను అంతే. దానియొక్క తుదిమొదళ్లివి యని కొలిచి చూపుటకు వీలుకాదు. దాని సౌందర్యమునందు మగ్నమై తన్మయతభజించి ఆనందింపవలసినదేకాని మనసువల్ల తెలిసికొని వాక్కుతో చెప్పుటకు వీలైనది కాదు. ఈ ఋషికల్పుని రచనయన్న మనస్సు దాటినది కాదు. ఆ కవియొక్క యనుభావ సర్వస్వము అతని రచనకంటె ప్రధానమైవాని యందలి యుత్తాలత్వమును ప్రస్ఫుటముగా వ్యక్తముచేయుచుండును. దాని తుదిమొదళ్లివి యని కచ్చితముగా కొలిచి నిర్ణయించుకొనవచ్చును.

ఈ ద్వివిధకవులకు నన్నయ తిక్కనలు ఉదాహరణములు. నన్నయ్యగారు ఋషి. తిక్కనగారు ఋషికల్పుడు. అందుచేత నన్నయ్యగారి శిల్పము బాగుగా మరుగుపడి యుండునది. ఆయన మాటలను జాగ్రత్తగా నాలోచించినకొలది వ్యక్తమగునది. తిక్కనగారి శిల్పము ప్రథమ దర్శనమందే కొట్టవచ్చినట్లు కన్పించునది. నన్నయ్యగారు ఎంత తెలిసినవాని కంత యర్థమగును. తిక్కనగారు అర్థమైనవాని కగును, లేనివానికి లేదు.

ప్రధానముగా నన్నయ్యగారి శిల్పము కథాకలితమై యుండును. ఆయన కథను తేటమాటలతో చెప్పుకొనిపోవుచుండును. కథకు విఘాతము కల్పించి పాత్రలయొక్క మనఃప్రవృత్తులను, పరిస్థితులయొక్క వర్ణనమును, కథాంశములయొక్క విస్తృతియు వివరించి చేయడు. ఈ యన్నియు ఉన్నవా యన్నచో నున్నవి. ఎచ్చట నున్నవి? ఆయనమాటల మరుగున క్రోశక్రోశ దూరముల వెనుక నున్నవి. ఆయన కథాగమనము వేగమైనదగుటచే నిలిచి యీ యన్నిటి నాలోచింపనీయదు. అందుచేతనే 'ప్రసన్న కథా కలితార్థయుక్తిలో నారసి మేలునా' వ్రాయుదునన్నాడు. పట్టికథ మాత్రము చెప్పికొని పోవుచున్నట్లు పైకికన్పించి అంతరాంతరమందు సూక్ష్మ సూక్ష్మ తరములైన బహ్వర్థములను సంయోజించుట బహుజన్మ తపఃఫలముతప్ప వేరుకాదు. బహుపరిణత మనస్కుడైన మహాశిల్పి నన్నయ్యగారు.

నన్నయ్యగారి ఈ పరిణత శిల్పమును ఆయన వ్రాసిన భారతభాగమందలి ప్రతికథయు పట్టియిచ్చును. ఎట్లు పట్టియిచ్చునో బహుకథలను శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు వ్యాఖ్యానించి చూపిరి. వారు ముట్టుకొన కథలలో ఉదంకోపాఖ్యాన మొక్కటి. కథ మొదలుపెట్టుచునే ఉదంకుని గురించి రెండు కంద పద్యములు వ్రాసినాడు నన్నయ్యగారు. ఇవి ఉదంకుని యొక్క అనుభావమును గురించి చెప్పునవి. ఆ యుదంకుడు

బ్రహ్మతుల్యుడు. తపస్వి. భయము లేనివాడు. అతడు గురుశుశ్రూషచేసి జ్ఞానము పొందినాడు. అణిమాదికాష్టసిద్ధులు పొందినాడు. ఈ రెండు పద్యముల నిచ్చట వ్రాయకున్నను కథ మొదలు పెట్టి చెప్పవచ్చును. అసలీ పద్యము లిచ్చట వ్రాయుట యెందుకు? ఆయన కథ యెట్లునూ చెప్పుచుండెను కదా? ఆ కథయందే చెప్పబడిన యుదంకుని గుణము లెట్లును వ్యక్తమగును కదా? మరి వాని నిచ్చట చెప్పుటలో విశేష మేమున్నది? అను ప్రశ్నలను పుట్టించుకొని యాలో చింతము. కథ యదభిముఖముగ వ్రాయబడునో ఆ ప్రయోజనమునుబట్టి కథ చెప్పవలసిన పద్ధతి యుండవలెను. ఈ కథయం దుదంకుని మహా గుణములు, ఆయనశీలము, అనుభవము వ్యక్తము సేయుట ప్రధానమైనచో ఆయన యా గుణముల నిచ్చట చెప్పుట దోషమగును. ఏ యభిప్రాయమును వ్యక్తముసేయుటకు కథ చెప్పుచుంటిమో ఆ యభి ప్రాయము వాచ్యముగా చెప్పినపుడు కథ చెప్పుట యనవసరము గదా! అందుచేత ప్రధాన విషయము దీపింపచేయవలయునే కాని వాచ్యము చేయరాదు. నన్నయ్యగారి ఉదంకోపాఖ్యానమునందు ఈ యుదంకుని అనుభావ విశేషము వ్యక్తముసేయుట ప్రధానము కాదు. ఈ యుదంకుని కథ సర్ప యాగమున కంగము. సంస్కృత భారతమునందు ఈ సందర్భమున మూడు కథ లున్నవి. తక్కిన రెంటికిని భారతకథతో సంబంధము లేదు. భారతకథతో ముడివడియున్న దీ ఉదంకోపాఖ్యాన మే. అందుచేత తక్కిన రెంటిని వదలి తిమన్న రి యొక్క కథనే రచించెను. దాని ఉదంకున క రుగా చేసెను. మొత్తము ఉదంకుని న్యుడుగా కని 'మితహితసత్యవాక్య! జనమేజయ! ఉదంకు డాతనికి అకారణము నాకపకారము జేసె డతనిని సర్వకార్య వాక్యములో పర్యవసించు కావలయునో క ట్టినాడు. ఇట్టివానికి తక్షకు ముగా నేనుపోవు ) అందుచేత వాడు దండ్యుడు.

తక్షకుడు చేసిన అపకారాతిశయము, వాని దౌష్ట్యము, సర్పయాగము యొక్క యవసరము ప్రధానమై, ఇంతమహానుభావతకలవానికపకారము చేసిన తక్షకుని దుష్టత్వము ఆ సర్పకుల ప్రళయ మున కెట్లు హేతువైనదో దీపింపజేయుటయే ఈ కథ యొక్క తాత్పర్యము. కాబట్టి యుదంకుని స్వరూప స్వభావములు చెప్పియే తీరవలయును. ఉదంకునకు తక్షకు డపకారము చేయనేలేదు; సర్ప యాగము లేనేలేదు. ఆ తక్షకు డెట్టివాని కప కారము చేసెను? బ్రహ్మవంటివానికి. భయ మెరుగని మనస్సు కలవానికి. అఘపంకక్షాళన మహాతపస్సలిలునికి. ఈ మూడు విశేషణములను వేయుటవలన తక్షకుడు ఎంత ప్రమాదమైన యప కారము తన కులమునకు చేయుచున్నాడో ద్యోతకమగుచున్నది. ఆ కథయందలి ప్రధానమైన మహావిషయమగు సర్పకుల ప్రళయమును తద్ధేతు భూతుడైన ఉదంకుని వర్ణించుటవలన సూచించి నాడు నన్నయ్యగారు. ఈ సర్పకుల ప్రళయము నకు తాను హేతువగుటవలన తనకు పాపము రాదా యను ప్రశ్న పుట్టించుకొని అంతటి పాపమును తపస్సుచేసి నివారించుకొనగలడని 'అఘపంక క్షాళన మహా తపస్సలిలు'డని చెప్పినాడు. ఇది యుదంకుని యందలి యొక గుణము. తన కప కారము చేసిన వారి నాయన సైచడు. వారికి తిరిగి పదిరెట్లపకారము చేయును. దానివలన పాపము సంక్రమించిన తపస్సుచేత నివారించు కొనును. తనకు చేసిన యపకారమునకు సర్పకుల ప్రళయము చేయునట్టి స్వభావము కలవాడని సూచించుటకే 'అఘపంకక్షాళన మహాతపస్సలిలు' డను క్రమమున సమాస రచన చేసినాడు. లేదు. తపస్సుచేసి తన పాపములన్నియు పోగొట్టుకొన్న పవిత్రుడని చెప్పుటకైనచో తపస్సలిలక్షాళితాఘ పంకు డనుక్రమమున సమాస నిర్మాణము చేయ వలయును. 'అఘపంక క్షాళన మహాతపస్సలిలు' డనుట వలన అది యతని స్వభావమును వ్యక్తము

సేయుచున్నది. అందుచేత ఈ రెండు పద్యముల నిచ్చుట వ్రాయుట.

కథ ప్రారంభించుటలో 'అయ్యుదంకుండు' అనుటవలన వాని యప్రతిహతత్వమును సూచించుచున్నాడు. "అయ్యుదం కుండు *గురుహిత కార్య ధురంధరుండై గురుపత్నీ నియోగంబునన్* పౌష్యుం డను రాజు దేవి కుండ లంబులన్ ప్రతిగ్రహించి తేరంబూని వనంబులో *నొక్కరుండ* చనువా డెదుర నొక్క మహోక్షంబు నెక్కి చనుదెంచు వానినొక్క దివ్యపురుషుంగని వాని పన్నిన వృషభ గోమయ భక్షణంబుసేసి యమ్మహాత్ము ననుగ్రహంబు వడసి యతి త్వరిత గతిం జని పౌష్యమహారాజుం గాంచి దీవించి గృహీత సత్కారుండై యిట్లనియె". గురుహిత కార్య ధురంధరుడై గురుపత్నీ నియోగంబున పోవుటయేమి ? 'ఒక్కరుండ' యననేల ? 'పన్నిన' యనుట యెందులకు ? ఈ మాటలను పర్యాలోచించి చూచినచో వానివెనుక బహు కథాంశములు వివృతములై ప్రధాన కథయందు సంయోజితము లగుచున్నవి. యుదంకుడు గురువుగారి వద్దకు పోయి 'అయ్యా! మీకేమి కావలయునో చెప్పుడు. గురుదక్షిణగా తెచ్చి యిచ్చెదను' అని యడిగినాడు. ఆ గురువుగా రన్నాడు కదా! 'నాయనా నాకే కోరికయు లేదు. నాకు నీవు గురుదక్షిణ యిచ్చునదేమి ? వల'దన్నాడు. ఉదంకుడు మీకు కోరిక యుండకపోవచ్చును. నేను గురు ఋణము తీర్చుకొనవలయును గదా, అందు చేత సెలవిం డన్నాడు. గురువుగారికి తన భార్య కోరిక గుర్తువచ్చినది. నా భార్య కిట్టి కోరిక యున్నది తీర్పుమని తాను నోటితో చెప్పునా యుదంకునకు ? ఆమె కోర్కి తీర్చవలయునన్నచో తాను సమర్థుడు కాడా ? అందుచేత గురువుగారికి భార్య కోరిక తీర్చుటయందు నిష్ఠలేదు. ఆమె చాల కాలముగా అట్టి కోర్కెను సూచించుచు వచ్చినది. ఆయన యుపేక్షించుచు వచ్చినాడు. ఇప్పుడుకూడ ఉపేక్షాభావమే. ఆయన యుదాసీనుడు. ఏదో పిల్ల వాడుగురుదక్షిణయిచ్చుట కుబలాటపడుచున్నాడు. పోనీ! నాకా కుండలములు తెచ్చిపెట్టును లెండు అని భార్య యన్నది. అది 'గురుపత్నీనియోగ' మన్నాడు నన్నయగారు. 'గురుహితకార్యధురంధ రుండై గురుపత్నీనియోగ' మనుటలో ఈ సర్వము ను భాసించుచున్నది.

వనములో ఒక్కడే పోవుచున్నాడట. ఒకడే అనియేవకారార్థమునకుప్రయోజనమేమి?ఆగురువుగారు ఈ యడవిలో నీవొక్కడవు పోలేవన్నాడు. ఉదంకుడు 'అనాతంకమతి.'భయములేదు. నేనొక్కడనేపోగల్గుదు,నన్నాడు. గురువుగారు సరేనన్నాడు. కాని ఇంద్రుని వాని వెనుక కాపు బంపినాడు. మనపిల్లవాడున్నాడు. వాడు పొరుగూరు బయలు దేరినాడు. నాయనా నీవొక్కడవు పోలేవు. మన పాలెగాడు వచ్చును వానిని తోడు పంపుదును, అందాక నుండుమన్నచో వాడుండడు. యౌవన దర్పమున వాడు బయలుదేరి పోవును. తరువాత పాలెగాడు వచ్చును. 'పిల్లవాడొక్కడేపోయెను! వానికి తోడుగా నీవు పొమ్మని వానిని వెనుక బంపుదుము. ఈ 'యొక్కరుండ' అను యేవకారార్థము ఆ యీ పరిస్థితిని వ్యంగ్యము చేయుచున్నది. గురువుగారికి ఉదంకుడన్నచో మిక్కిలి ప్రేమ. తన శిష్యుడు సమర్థుడగునో కాదో పరీక్షింపవలయును. ఆ యా ఘట్టముల యందు వానికాపద గలిగి వాడు నిర్వహించుకోలేనప్పుడు వానికి సాయ పడవలెను. ఇట్లు శిష్యుని పరీక్షించుట, సహాయ పడుట కుండలములు తెచ్చుట కుదంకుడు బయలు దేరినప్పటినుండి తిరిగి నింటికి వచ్చువరకున్న పట్టి
చేసినాడు పైలముని. కుండలముల హుకథలను
తరువాత ఉదంకుని పైలుడు 'ఈ వ్యాఖ్యానించి
ప్రోలికి బోయి గడుం బెద్ద దవ్వు క్రో ఉదంకోపా
త్యాయత విమల తపోమహిమా ! ట్టుచువే ఉదంకుని
లేల మసలితి చెపుమా !' య ములు వ్రాసినాడు
ఇందు 'అత్యాయత విమల కుని యొక్క అను
యనుటలో ఆక్షేపమున్నది. ఆ యుదంకుడు

ఇక్కడనున్న పౌష్య పట్టణముపోయి ఇంతాల స్యము చేసితి వేమని. ఈ యాక్షేపమువలన ఉదంకుడు పడ్డ పాట్లన్నియు గురువుగారెరింగి నాడని మనకు తెలియుచున్నది. ఈ తెలియుట తరువాత ఉదంకు డడిగిన దివ్యపురుషుని యొక్కయు, నాగలోకము యొక్కయు వృత్తాంతములను గురువుగారు వ్యాఖ్యానించి చెప్పుటచేత బలపడుచున్నది. ఆ వ్యాఖ్యానానంతరము గురువు గారన్నాడుకదా 'అది నింద్రుగాంచి యమృతాశి వగుట నీ కభిమతార్థసిద్ధి యయ్యెనయ్య' యని. అందుచేత ఉదంకుడు చెప్పకపూర్వమే ఉందకుని పడ్డపాట్లు, కుండలములుతెచ్చిన వైఖరి యంతయు గురువుగారికి తెలిసియేయున్నది. ఎట్లు తెలిసినది? ఆయన యజ్వ. ఇంద్రుడు, పర్జన్యుడు, అగ్ని ఆయనకు సఖులు. వారి నాయన ఉదంకుని పరీక్షించుటయందును, రక్షించుటయందును నియోగించినాడు. ఆ పరీక్షణముగాని, రక్షణముగాని ఉదంకునికి తెలియునట్లు చేయరాదు. చేసినచో ఆ కుండలములు తానే తెచ్చిన సంతోషమును వా డనుభవింపలేడు. అందుచేత ఆ పురుషుడు దివ్యుడు. ఆ యైరావతము ఉక్షము ఆ అగ్ని తురంగము. ఇట్లు పూర్వాపరములను పర్యాలోచించుటవలన ఆ యీ పరిస్థితియంతయు వ్యక్తమై కథయందు సంయోజితమగుచున్నది. ఇంత గుర్వనుగ్రహము కలవాడగుటచేతనే 'జ్ఞానము వడసెను గురుదయ నణిమాదికాష్టగుణముల తోడన్.'

మరి 'పన్నిన' యన్నమాట యున్నది. ఇంత సాహసుడైన యుదంకుడు వృషభగోమయము తినుమన్న తినునా? తినునట్లు పన్నినాడట. ఉదంకున కా పురుషుడు కనిపించినాడు సామాన్యుడుగా కన్పించలేదు. దివ్యుడుగా కన్పించినాడు. ఉదంకు డాతనికి నమస్కరించినాడు ఆ దివ్యపురుషు డతనిని సర్వకార్యసిద్ధిర స్తని దీవించినాడు. నీకేమి కావలయునో కోరుకొమ్మన్నాడు. అప్రతిహతముగా నేనుపోవు కార్యము సిద్ధించవలె నన్నాడుదంకుడు. దివ్యపురుషుడు 'ఐనచో ఈ వృషభ గోమయ భక్షణము సేయుము' అన్నాడు. ఉదంకుడు సంకోచించినాడు. తినుటయా? తినక పోవుటయా? తన యెదుటనున్న పురుషుడు దివ్యుడే, సందేహములేదు. తన యంతరాత్మ దివ్యుడని చెప్పుచున్నది. మరి ఆతడాజ్ఞాపించినట్లు చేయకపోయినచో తన కార్యము విఘటితమగునేమో! ప్రథమముననే పూజ్య పూజావ్యతిక్రమ మేల చేయవలయును? ఈ గోమయము భక్షించుటవలన తనకేదైన పాపము వచ్చినచో తన తపస్సుచేత పరిహరించుకొనవచ్చును. అందుచేత కార్యమతియై వృషభగోమయ భక్షణము చేసినాడు. ఉదంకుని యొక్క కార్యదీక్ష యెట్టిదో పరీక్షించుట యొకటి, ఆతనికి తెలియకుండ యమృతము తినిపించుట యొకటి. ఇది వెనుకనుండి గురువుగారు చేయుచున్న పని. ఈ యంతయు 'పన్నిన' యనుటలో వ్యక్తమగుచున్నది.

ఉదంకుడు పౌష్యుని యొద్దకు పోయి కుండలములు కోరినాడు. గుర్వర్థమై వచ్చితినన్నాడు. అతడడుగగనే పౌష్యు డియ్యవలయునా? అత డీ కుండలములు తీసికొనుట కర్హుడో? కాదో? అందుచేత తా నతనిని పరీక్షింపవలయును. తా నాతనిని పరీక్షించుచున్న ట్లత డెరింగినచో శపించవచ్చును. మరి యదిగాక అతనిని చూడగనే పౌష్యుడు 'గుర్వర్థముువచ్చిన మహాత్ముడు ఇతనికీగాంచితి కృతార్థుడనైతి' నని మనంబున సంతసిల్లినాడు. మనంబున సంతసిల్లనేల? అతడు నిజముగా మహాత్ముడైనప్పుడే ఆ కుండలము లతడు పుచ్చుకొనగలడు. ఈతని మాహాత్మ్యము పరీక్షించి మహాత్ముడైనచో నే నా కుండలము లిచ్చుటవలన కృతార్థుడనగుదును అని మనస్సులో ననుకొన్నా డన్నమాట. ఆయన మాహాత్మ్యమునందు తనకు సందేహము లేనిచో పౌష్యుడు పైకే సంతోషించి యుండును. తానే కుండలములు తీసికొనివచ్చి

ఇచ్చియుండును. అందుచేతనన్నాడుకదా 'అయ్యా, మదీయ ధర్మపత్ని యక్కుండలంబులు తొడుగ నవసరంబై యున్నయది. మద్వచనంబున వాని నిప్పించుకొ' మ్మన్నాడు. ఇప్పించుకొమ్మనుటలో నున్నది సొగసు. ఇప్పించుకొనుట యనగా ఆమె యిచ్చునట్లు చేసికొనుట. ఆమె యిచ్చుటకుదంకుని యందర్హత్వమున్నప్పుడే యది పొసగును. ఉదంకుడు అంతఃపురములోనికి పోయి తిరిగివచ్చి ఆమె కన్పించలేదనిచెప్పినాడు. మరియిప్పుడు ఉదంకుడు అపవిత్రుడని తేలినది. కాని యిప్పటికిని నీవపవిత్రుడవని రాజునోటితో ననలేదు. నోటితోననకుండ నన్నాడు. ఆ యపవిత్రత శాశ్వతమో తాత్కాలికమో ఎట్లు తెలియును? అందుచేత ఏమయ్యా! నీవుచూడగా త్రిభువనపావనుని వలె కన్పించుచున్నావు. నిన్నశుచివని యెట్లందును? ఆమె యశుచులకు కన్పించదన్నాడు. ఇందుచేత పౌష్యుడుదంకుని యొక్క దానార్హతను పరీక్షించుటకే ఇట్లు చేసినాడని తెల్లమగుచున్నది. తరువాత యుదంకుడు వృషభగోమయ భక్షణంబున నైన యశుచి భావమును పరిహరించుకొని పౌష్యదేవి నుండి కుండలములు పుచ్చుకొన్నాడు. ఆమె ఉదంకునకు తక్షకుని గురించి చెప్పినది. వాడా కుండలము లపేక్షించుచునుండు, వాడభేద్యుడు, మాయాదకుడు, జాగ్రత్త, యని. అనిన యుదంకుడట్ల చేయుదు నన్నాడు. 'అట్లచేయుదు' ననుటలో ఉదంకుని యొక్క అజాగ్రత్త యంతయు లెక్కలేనితనమంతయు వ్యంజితమగుచున్నది. పౌష్యుడుదంకుని భోజనముచేసి పొమ్మన్నాడు. అన్నము కేశదుష్టంబైనది. ఉదంకుడలిగి 'ఇట్లపరీక్షితంబైన అశుద్ధాన్నంబు పెట్టినవాడవంధుండవగుమని శాపంబిచ్చెను.' అంధుండవగుమని శాపమిచ్చుటేల? అపరీక్షితమైన అన్నముపెట్టుట వలన. అపరీక్షితంబైన యనుమాటలో శాపమునకు కారణము సంగృహీతమైనది. ఆ యన్నమునందాదోషమున్నదని చూడనితప్పుకన్నది. అందుచేత అంధుడవగుమని శాపము. అశుద్ధాన్నము పెట్టుటలో కన్నంధముగా ప్రవర్తించినది కావున ఆ యంధత శాపమును పురస్కరించుకొని వ్యక్తమైనది. అపరీక్షితమైన మాటలో ఈ యర్థము నంతయు సంగ్రహించినాడు నన్నయ్యగారు. మరి పౌష్యుడు 'అల్పదోషంబున నాకు శాపంబిచ్చిన వాడవు నీవనపత్యుండ'వగుమని ప్రతిశాపంబిచ్చెను. పై అపరీక్షితమను మాట యెట్టిదో ఇచ్చట అల్పదోషంబనుమాట యట్టిది. పిల్లలుకలవాడు చిన్న తప్పును లక్ష్యపెట్టడుకదా? ఉదంకుడు తాననపత్యుడు కాలేడు. శాపము క్రమ్మరింపుమని పౌష్యునడిగినాడు. పౌష్యుడు తాను క్షత్రియుడు కావున శాపమును క్రమ్మరింపలే నన్నాడు. అతనిచే ప్రార్థితుడై ఉదంకుడతని శాపమును క్రమ్మరించి తిరిగి పోవుచు 'గురుపత్నికి కుండలంబు లీగంటిననిమనంబున సంతోషించి చనువాడు' ఒక చెరువువద్ద తన చేతనున్న కుండలంబులుపెట్టి ఆచమించుచుండగా తక్షకుడు వచ్చి ఆకుండలము లెత్తుకొని పోయెను.

పౌష్యదేవి తక్షకునిగురించి ఉదంకుని హెచ్చరించి యున్నదిగదా! ఉదంకుడాకుండలము లచ్చట పెట్టనేల? దానికి 'గురుపత్నికి కుండలంబులీగంటినని మనంబున సంతోషించువాడు' అనుటలో చమత్కారమైన సమాధానము నిమిడ్చినాడు నన్నయ్యగారు. కుండలములచేతగొని ఉదంకుడు వచ్చుచున్నాడు. ఆ కుండలములు తీసికొనిపోయి తన గురుపత్నికిచ్చినట్లే సంతోషించినాడు. 'ఈగంటి' ననగా ఇచ్చుట తనకు కలిగినది. తనజన్మ చరితార్థమైనదన్నమాట. ఆ సంతోష పారవశ్యమునందు తక్షకుని మాట మరచిపోయినాడని వ్యంగ్యము. తక్షకుడు వెనుకనే యున్నాడు. వాడు నగ్నవేషధరుడై ఆకుండలములనుగొని పారిపోయినాడు ఉదంకుడు వానిని వెనుదవిలి పట్టుకొన్నాడు. వాడు దిగంబర వేషము వదలి నిజరూపముతో నాగలోకమునకు పోయినాడు. ఉదంకుడు కూడ నాగలోకమునకు పోయినాడు.

అక్కడ నాగపతులనందరిని స్తుతించినాడు. నన్నయ్యగారి ఈ నాగస్తుతి పద్యములు ఆంధ్ర సాహిత్యము నందు మిక్కిలి ప్రసిద్ధము లైనవి. ఈపద్యముల యందున్న నన్నయ్యగారి పద్యరచనా శిల్పము, భాషాప్రభుత్వము జగన్నాథముగా నున్నవి. ఇచ్చట వ్యాఖ్యాతమగు నంశము వానికంటె వేరు. ఈ పద్యములందలి నన్నయగారి అనంతమైన లోకజ్ఞత వ్యాఖ్యానింపబడు చున్నది. ఉదంకుడు వరుసగా శేషుని, వాసుకిని, ఐరావతాదులను, తక్షకుని స్తుతించెను. ఈ స్తుతి పైకిస్తుతి. లోపల నింద. ఇట్టి నిందాగర్భమగు స్తుతి నాన్యతో దర్శనీయము. మొదటి పద్యము నందు 'దుష్కృతాంతకుడు' అన్నమాట, రెండవ పద్యమునందు 'అమరారుల బాధలు వొందకుండగా' 'భూషణం బయిన' అను రెండు మాటలు, మూడవ పద్యము నందు మొదటి మూడు చరణములు, నాల్గవపద్యము పద్యమంతయు క్రమముగా అధికనిందావ్యంజకములు. ఇచ్చటి పరిస్థితి యిట్టిది. ఒక యింటిలో పదిమంది యన్నదమ్ములున్నారు. పెద్దవాడూరికి పెత్తనదారు. రెండవవాడిల్లు దిద్దుకొనిపోవును. తక్కిన యెనమండుగురున్నారు. వారికేమియు పనిలేదు. వట్టి అగ్రహారపు బడితలు. అందులో నొకడు మన పిల్లవానిని కొట్టుటయో వానిచేతిలో తినుబండారము లాగికొని పోవుటయో చేసినాడు. ఆ యేడ్చుచున్న మన పిల్లవానిని వెంటబెట్టుకొని మనము పెద్దవాని దగ్గరకు పోయి ఏ మందుము ? ఏమయ్యా ! ఈ గ్రామ మంతయు నీవు మోయు చుంటివి. ఎవరైన ఏదైన తప్పు చేసినచో చెప్పగల వాడవు. మరి నీతమ్ముడేమి చేసెనో చూచితివా యందుము. అంతకంటె నెక్కువ యనము. దీనిలో వ్యంగ్యమేమి ? నీ పెత్తనము పేలాలు వేగిన ట్లున్నదితే యని. నన్నయ్యగారి మొదటి పద్యము నందలి దుష్కృతాంతక శబ్ద మట్టిది. నీతమ్ముడీ దుష్కృతము చేసినాడు. దానిని నీ వంతము చేయవలయును. లేనినాడు నీ ప్రతిష్ఠ యేమగునో చూచికొమ్ము అని బెదరింపు. ఇల్లుదిద్దికొనిపోవు రెండవ వాడున్నాడు. అతనితో నేమందుము ? ఆ యింటికి సంబంధించిన తత్పూర్వపు సంఘటన మేదియో ప్రస్తావించి ఫలానా వాడు మీవారి కపకారము చేసినప్పుడు నీవు వారిని రక్షించు కొనుట కెన్ని పాట్లు పడితివో గుర్తులేదా ? మరి మీ పిల్లలితరుల కపకారము చేయుచున్నప్పు డూరకుందు వేమి ? అందుము. ఈ యనుట లోకములో వ్యంగ్యముగా నన వచ్చును. వాచ్యముగా నన వచ్చును. కవిత్వమునందు మాత్రము వ్యంగ్యము గానే యన వలయును. అందుచేత 'అరిది తపో విభూతి నమరారుల బాధలు వొందకుండగా సురగుల నెల్ల కాచిన మహోరగ నాయకు' డన్నాడు. మీ వారిని బాధల నుండి కాపాడుకొంటివి. మీవారు కూడ బాధలు చేయకుండ చూచు బాధ్యత నీ యందున్నది అని వ్యంగ్యము. మరి నీ వెట్టివాడవు? 'అద్రి నందనేశ్వరునకు భూషణమ'వు. ఆ అద్రి నందనేశ్వరు డెట్టివాడు? 'అ నమత్సురాసుర మకుటాగ్ర రత్న రుచి శోభిత పాదుడు'. దేవరాక్షసుల శిరో భూషణము లాయనకు పాద భూషణము లైనను కావు. అట్టివానికి నీవు భూషణమవు. మీ తమ్ముడు భూషణ మపహరించుటయేమి? నీ కెంత యప్రతిష్ఠయో చూడుమని వ్యంగ్యము. ఇట్లు బాధ్యులైన యిద్దరన్నదమ్ముల యొద్ద వారి ప్రయోజకత్వమును పరామర్శించి వారి యింటి యం దెంత వ్యర్థుడు పుట్టెనో పరమ వ్యంగ్యముగా చెప్పినాడు నన్నయగారు. తరువాత పిల్లవానిని తీసికొని యింటికి వచ్చుచున్నాము. త్రోవలో వీథి మలుపు తిరిగినచోట అగ్రహారపు బడితలందరు కూర్చుని యున్నారు. కాని పిల్లవానిని కొట్టిన వాడచ్చట లేడు. ప్రసక్తానుప్రసక్తముగా వారితోకూడ చెప్పుదుము. నాయనా! మీరు చాల పరాక్రమవంతులు. బలశాలురు. మీకు కోపము వచ్చినచో ఫాలాక్షు డెదురలేడు. మీ

రంతా మహానుభావులురా! మేమేదో బక్క వారము. మా పిల్లవానివోలె మీవాని కెందుకురా అందుము. ఇచ్చట విపరీత లక్షణ. అనగా అన్న మాటలకు వ్యతిరేకార్థము భాసించుట. మొదటి మూడు చరణము లిట్టి విపరీత లక్షణ 'దేవ మనుష్య లోకముల త్రిమ్మరుచున్' — మీ కేమియు పనిలేదు. మీరు తిరుగని చోటులేదు. అని యర్థము. 'విపుల ప్రతాప సంభావిత శక్తి శౌర్యులు' ప్రతాపమనగా ఇతరులను నొప్పించుట యని యర్థము. అది విపులమైనది. బాగుగా మీరు ఇతరులకు చేయు నపకారము వలన మీ శక్తి శౌర్యములు తెలిసికొనవలయునుగాని ఉపకారము చేయుటవలనగాదు. 'అపార విషోత్కట కోప విస్ఫురత్పావక తాపితాఖిల విపక్షులునైన మహానుభావులు'. ఇచ్చట 'అపార...విపక్షులు', 'మహానుభావులు' రెండును సంస్కృత సమాసములే, మధ్య ఐన అని రెంటిని అతికినాడు. ఈ ఐన లేకుండ ఈ మహానుభావశబ్దమును విపక్షశబ్దముతో కలిపి ఏకసమాసము చేయవచ్చునుగదా!"...తాపితాఖిల విపక్షాస్తేచ మహానుభావాశ్చ తాపితాఖిల విపక్ష మహానుభావాః" అని ద్వంద్వము చేయ వచ్చును. ఇట్లు ద్వంద్వము చేయక ఈ రెండు సంస్కృత సమాసములను వ్యస్తముచేసి మధ్య 'ఐన' అను అవ్యయముతో అతుకుటలో నున్నది విశేషమంతయును. ఎందుచేతననగా మహానుభావ శబ్దమునకు సంస్కృతమునం దింత యాక్షేప వ్యంజకత లేదు. తెనుగునందు మాత్రము 'నీ వెక్కడలేరా! మహానుభావుడవు' అన్న ప్రయోగములందు మాత్రమే మహానుభావశబ్దమునకు ఆక్షేప వ్యంజకతయున్నది. తాదృశ వ్యంజకత్వము దాని యందు సంగ్రహించుటకు వ్యస్తముగా వాడినాడు నన్నయ్యగారు. 'ఐన' అను అవ్యయము యీ మహానుభావశబ్దమునం దున్న వ్యంజకతను తీక్ష్ణతరము చేయుచున్నది. మరియును ఐన అను అవ్యయములో పూర్వసమాసమంతయు అంగభూతమై పర్యవసించుచున్నది. వారి కోపము మండుచున్న అగ్ని. దానికితోడు వారి విషము. అట్టి కోపాగ్నిచేత శత్రువులందరు దహింపబడుచున్నారు. మరి మీ రటువంటి మహానుభావులు. అనగా అంత దుర్మార్గులు. మీరు నాకు ప్రసన్నులు కాక కోపగించినచో నేనాగగలనాఅని వ్యంగ్యము. ఈ సర్వమును ఐన యను అతుకుముక్కలో పెట్టినాడు. నాల్గవపద్య మంతయు బల్లెములతో క్రుమ్ముట.

'గోత్రమహామహీధర నికుంజములన్
విపినంబులన్ కురు
క్షేత్రమునన్ బ్రకామగతి
ఖేలననొప్పి సహాశ్వసేనులై
ధాత్రి పరిభ్రమించు బలదర్ప
పరాక్రమ దక్షు డీక్షణ
శ్రోత్ర విభుండు తక్షకుడు
శూరుడు మాకు బ్రసన్నుడయ్యెడున్.'

తక్షకుడు కులపర్వతము లందలి పొదలలో, అరణ్యములలో, కురుక్షేత్రములో తిరుగుచుండును. ఆ కురుక్షేత్రము పెద్ద యుద్ధభూమి. శ్మశానముగా మారినది. దొంగ లెచ్చట నుండు? కొండలలో. అడవులలో, శ్మశానములలో. 'ప్రకామగతి ఖేలననొప్పి'— వేషములు వేసికొని తిరుగుదురని. ఇదియు దొంగలక్షణమే 'సహాశ్వసేనులై'— నీకు తోడు నీ కొడుకును గూడ తయారు చేయుచుంటివి. 'ధాత్రి...దక్షుడు'— ఉన్నచోట ఉండవు నీ బలము నీ పరాక్రమము నీ దక్షత అడుగనా? 'శూరుడు'— నీ శౌర్యమేమని చెప్పుదును, పట్టుకొనగా పారిపోయివచ్చితివని. 'ఈక్షణశ్రోత్ర విభుండు'— ఆమె నాకు కుండలము లిచ్చుచుండగా, నిన్ను గురించి హెచ్చరించుచుండగా నీ వెప్పుడు చూచితివిరా? యని. ఈ సర్వార్థమును ప్రసన్నమయ్యెడున్ అని ప్రతి పద్యము నందున్న క్రియావాచకముచేత వ్యంగ్యమగుచున్నది. ప్రసన్నుడగుటయెందుకు? మనయం

దేదో వాని కాగ్రహము వచ్చినది. ఆ యాగ్రహ మునకు మనము కారణము కాదు. ఆ వెనుకటి పరిస్థితి యంతయు సువిచారితమై ఈ మాటచేత ఆ యా యర్థములు భాసించును. పరిస్థితిని బట్టి మాటల కర్థము మారుచుండును.

ఉదంకుని స్తుతికి వారెవ్వరును ప్రసన్నులు కాలేదు. ఉదంకుని కేమియుతోచలేదు. ఎట్లా యని విచారించుచు వీథులందు దిరుగుచున్నాడు. అచ్చట 'సితాసితతంతుసంతాన పటవయనము', 'ద్వాదశార చక్ర పరివర్తనము' చూచినాడు. అతిప్రమాణ తురగారూఢుడైన దివ్యపురుషుని చూచి ఆయనను స్తుతించినాడు. ఆ స్తుతి నాగపతులను చేసిన స్తుతి వంటిది కాదు. నాగపతులను చేసిన స్తుతియంతయు నిందయని సూచించుటకై స్తుతికి ముందు 'నిట్లని స్తుతియించె' అనియు, తరువాత 'అనియిట్లునాగ కులంబునెల్ల స్తుతియించి' యనియు వ్రాసినాడు నన్నయ్యగారు. మరి దివ్యపురుషుని 'అతిభక్తి యుక్తుండై' స్తుతియించినాడట. ఉద్దిష్టార్థమును సూచించుటకై అచ్చట నట్లును ఇచ్చట నిట్లును వ్రాయుట.

పర్జన్యుడు, అగ్ని దివ్యపురుష తురంగములై కన్పించుట వెనుకనుండి గురువుగారుచేసిన పనియే. అశ్వకర్ణరంధ్రధ్మానము సేయుమనుట వృషభ గోమయ భక్షణము సేయుమనుటవంటిదే. మరి 'పన్నిన' అని ఎందుకు వ్రాయలేదిచ్చట? ఇచ్చట నుదంకుడు ఆయనను స్తుతించుట, ఆయన కోరిక కోరుకొమ్మనుట, ఈ నాగకులమెల్ల నాకు వశము కావలయునని యుదంకుడు కోరుట వ్రాసియే తీరవలయును. ఆ పర్జన్యుడు ఇతనిచేత కోరించ లేదు. ఆ పరిస్థితియే ఉదంకు నట్లు చేసినది. కావున ఉదంకునకు పన్ననక్కరలేదు. ఈ పరీక్ష ఉదంకు నకు సహజముగా ప్రాప్తించినది. తరువాత అశ్వ కర్ణమునుండి అగ్నులు బయలుదేరుట, తక్షకుడు భయపడి కుండలము లర్పించుట జరిగినవి.

తరువాత దివ్యపురుషు డిచ్చిన తురంగము నెక్కి ఉదంకు డిల్లుచేరుకొన్నాడు. గురుపత్నికి కుండలము లిచ్చినాడు. గురువుగా రతనిని పరిహసించి ప్రశ్నించుకొని సమాధానమును చెప్పినాడు. 'అది నింద్రుగాంచి అమృతాశి వగుట నీ కభిమతార్థ సిద్ధియయ్యెనయ్య' అన్నాడు. దీనిలో తానుచేసిన సహాయము సూచించుట యున్నది, ఉదంకుడు దేవతా ప్రసాదము నందినట్టి భాగ్యవంతుడని చెప్పుట యున్నది. 'కర మిష్టము చేసితి మా కరి సూదన దీన నీకు నగు సత్ఫలముల్, గురుకార్య నిరతులగు సత్పురుషుల కగుటరుదె యధిక పుణ్య ఫలంబుల్?' అన్నాడు. కరమిష్టము సేయుట యేమి? తా నుదాసీనుడు గదా? తనకిష్టము సేయుట యనగా? దీనికి మొట్టమొదట 'గురు హిత కార్య ధురంధరుండై' అని ప్రారంభము నందు చెప్పి దానిని గురువుగారి నోటనే 'కర మిష్టము చేసితి' వని ఉపసంహారము చేసినాడు. తా నుదాసీనుడైనను గురువుగారికి ప్రీతికల్గించు టకై ఉదంకుడు బయలుదేరినాడు గదా! ఆ ప్రయత్నమునం దెన్నియో కష్టములు పడినాడు. గురువుగారు సంతసించిన దతని శ్రద్ధకు. 'నీవలన పరమ సంప్రీత హృదయుండనైతి' నన్నాడు. మరి 'అరిసూదన' అనికూడ సంబోధించినాడు. తక్షకుడు స్తుతికి లొంగలేదు. వానిని నెత్తినమొట్టి కుండలములు పుచ్చికొంటివని, మరియు రాబోవు సర్పయాగమున కుదంకుని ప్రేరేపించుటయొకటి ఈ సంబోధనమందున్నది.

'ఉదంకు డనేక కాలము తపస్సుచేసి తక్షకుడు చేసిన యపకారంబునకుం బ్రతీ కారంబు చేయ జింతించి యొక్కనాడు జనమేజయుపాలికిం బోయి యిట్లనియె'. తక్షకుడుచేసినయపకారమునకు ఇంత కాల మేల యుదంకు డూరుకొనవలయును? జనమే జయుపాలి కెందుకు పోవలయుననగా ఇంత కాలము వరకును తక్షకుని సాధించుట కనువైన యుపాయ ముదంకునకు దొరుకలేదు. చాలకాలము గడ.

చిన తరువాత తక్షకుడు పరీక్షిత్తును చంపుట జరిగినది. ఉదంకునకు తక్షకుని శిక్షించుట కిది మంచి యదను. అందుచేత జనమేజయునివద్దకు వెళ్ళినాడు. తానే వానికి ప్రత్యపకారము చేయరాదా యన్నచో దీనికి రెండుసమాధానములున్నవి. ఒకటి లోకమునం దెంత శత్రుత్వమున్నను ఏదియో నెపము దొరికినగాని వానిని సాధింప ప్రయత్నింపము. ఆ నెపముకొఱకై యుదంకు డింత కాలము వేచియుండెను. రెండవది తనంతట తాను దండించుట బ్రాహ్మణ ధర్మము కాదు. అపరాధిని దండించుట రాజధర్మము. తనకుచేసిన యపరాధమన్ననో అది మరణదండనము చేయదగినది కాదు. వానికు మరణదండనము చేయదగినంత అపరాధము చేసినప్పుడు తనకుచేసిన అపకారముకూడ దానికి తోడై వాని నధికశిక్షాపాత్రుని చేయవచ్చును. అందుచేత జనమేజయుని పాలికి ఉదంకుడేగినాడు.

తరువాత నాలుగు పద్యములలో ఉదంకుడు జనమేజయునకు సర్పయాగ బుద్ధి పుట్టించినాడు. ఉదంకుడు జనమేజయునితో నీ మాట్లాడు వైఖరి మిక్కిలి యపూర్వమైనది. బహువిషయ పరిజ్ఞానము, అనంతమైన లోకజ్ఞత, వచోదక్షత, సూక్ష్మసూక్ష్మతర మనఃపరివర్తనా పరిశీలన మున్నగాని అట్లు వ్రాయుట సంభవము కాదు. ఉదంకు డొక్కొక్క మాటయనును. అది జనమేజయునిమనస్సునందెట్టి ప్రభావము కలిగించెనో పరిశీలించును. దానిపైనవచ్చు ప్రశ్నలను పరామర్శించి సమాధానము చెప్పును. ఆ జనమేజయుడు రాజుగదా! ఆయన ఎదుటివాడు చెప్పునది ఊరక ఊకొట్టి విను నంతే. వ్యతిరేకముగా వాదించుట రాజమర్యాద కాదు. ఈసంగతి ఎరింగిన వా డుదంకుడు. అందుచేత తనమాటలపైన జనమేజయునకు కలిగెడు శంకలను పరామర్శించుచు జనమేజయునకు సర్పయాగమునందు నిశ్చయము పుట్టునట్లు మాట్లాడినా డుదంకుడు. 'మితహిత సత్యవాక్య! జనమేజయ! భూజనవంద్య!' అని సంబుద్ధి. నీవు మితముగా మాట్లాడెదవు. అనగా ఇప్పుడు నేను చెప్పిన పనిని చేయుదునని చెప్పుదువు అన్నమాట! ఊరక చెప్పుట కాదు, 'సత్యవాక్య' చేయుదువు కూడ. 'భూజనవంద్య!' సర్వజనులును నీధర్మపాలనమును మెచ్చుకొనుచున్నారని స్తుతి. నేను గురుదేవకార్యములు చేయుచుండగా ఈ తక్షకుడు 'అకారణమ నా కపకారము' సేసెను. అకారణముగా అపకారమెందుకు చేసెనని ప్రశ్న. అతికుటిల స్వభావుడని సమాధానము. 'పరాత్మ విశేష వివేక శూన్యుడై!' నేను తపోదాన యజనశీలుడను. నా తన యంతరము గమనించడు అన్నాడు. జనమేజయుడు మాటాడలేదు. జనమేజయునకు రావలసినంత కోపము రాలేదు. మరల ఉదంకు డనుచున్నాడు. నా కపకారము చేయుటయే కాదు. నీ తండ్రి పరీక్షిత్తును చంపినాడు. ఆయన యెట్టివాడు? నిరంతర దానయజనశీలుడు, కులదీపకుడు, ప్రజారంజకుడు, అర్జునునితోసమానుడు, అతిదాంతుడు మరి వాడో 'భుజగజాల్ముడు' వట్టి చెడుపురుగు అన్నమాట. పోనీ ఆచంపుట ఏమైన గౌరవముగా చంపినాడా? 'అసహ్య విషోగ్ర ధూమకేతన హేతిజేసి' 'కృతాంత నికేతనాతిథిని' చేసినాడు. విషాగ్నివల్ల చంపినాడు. విషదగ్ధుడగుటచేత నీతండ్రి కృతాంత నికేతనాతిథియైనాడు. అనగా నరకమునకు పోయినాడు. జనమేజయుని ముఖమున కోపము కన్పించినది. ఈ తక్షకుడు ఈ బ్రాహ్మణుని కపకారము చేసినాడు. మా తండ్రిని చంపినాడు. వీనివల్ల మా తండ్రి నరకమునకు పోయెను. నిజమే. వీడు చెడుపురుగే. కాని ఆ చంపుట వాడు తనంత చంపినాడా? ఎవడో యొక బ్రాహ్మణుని శాపమునకు వశుడై చంపినాడుగదా! ఈ భావము జనమేజయుని ముఖమునందు చదివినా డుదంకుడు. మరల ఉదంకు డనుచున్నాడు. అవునయ్యా! ఎవడో యొక బ్రాహ్మణుడు సంబోధించినంత మాత్రముచేత తాను కాదనకూడదా? ఇక్కడ

'కాదనక' అన్నదానికి అర్థమేమనగా ఆ బ్రాహ్మణ ప్రేరేపణమును తిరస్కరింపక, ఈ పని చేయకూడదని మనసులో విచారింపక అని యర్థము. ఆ బ్రాహ్మణుల పిల్లవాడేదో కోపముతో తిట్టినచో తాను పోయి కరువవలెనా? తనకు యుక్తాయుక్త విచారమక్కరలేదా యని. మరి వాడు ఒక్క బ్రాహ్మణుని పిలుపుచేత ఇంత యపకారమును చేసినాడు. గూఢముగా చేసినాడు అని 'యిట్టి పాటి యపకారము' అన్నాడు. వాడు భుజగజాల్ముడు. నీవో 'నృపపుంగవుడవు'. అనేక బ్రాహ్మణుల ముఖమున సర్పములను భస్మము సేయుము. వాడు విషాగ్నిచేత చంపినాడు. నీవు సర్పయాగము చేసి యాగాగ్నియందా సర్పములను భస్మముచేయుము. వాడు చంపిన పాప మా బ్రాహ్మణునిదైనచో ఈ సర్పములను భస్మము చేసిన పాపము కూడ బ్రాహ్మణులకే పోవును. నీకేమి? అందుచేత సర్పయాగము చేయుము. అన్నాడు. జనమేజయునకు తక్షకుని శిక్షింపవలయునని నిశ్చయము కలిగినది. వాడు బ్రాహ్మణుని పిలుపు నెపము వెట్టి యపకరించెను. మనము బ్రాహ్మణుల పిలుపునెపము వెట్టి శిక్షింపవచ్చును. కాని...అని మరల జనమేజయుని ముఖమున శంక ముడివడ్డది. ఏమయ్యా! ఈ యుదంకుడు తక్షకుని శిక్షించుమన్నచో బాగుండును వాడపరాధి యన్నది నిజమే. వాని మూలముగా సర్పకుల ప్రళయము సేయు మను నేమి? ఇదియేమి న్యాయము? అని. ఉదంకుడీ శంకను చదివి వెంటనే యన్నాడుకదా!

'ప్రల్లదుడైన యొక్క కులపాంసను చేసినదాన దత్కులంబెల్లను దూషితంబగుట యేమి యపూర్వము? గావునన్ మహీవల్లభ! తక్షకాధము నెపంబున సర్పములెల్ల నగ్నిలో వ్రేళ్ళగ సర్పయాగ మతిధీయుత! సేయుము విప్రసన్నిధిన్.' అన్నాడు. 'ప్రల్లదుడైన...యపూర్వము?' ఎవడో ఒక కులపాంసుడున్నాడు. వాడేదో మహాపరాధము చేసినాడు. వాని యపరాధమున వాని కులమంతయు నాశనమగుట యేమి క్రొత్తయా? క్రొత్తయా యనగా ఇది పూర్వము జరిగినదే. ఆలోచించుకొమ్మన్నమాట. ఆలోచించుకొన్నాడు జనమేజయుడు. ఆ ప్రల్లదుడైన కులపాంసను డెవడు? వాడేమి చేసినాడు? తెలిసినది. ఆ ప్రల్లదుడు ఆ కులపాంసనుడు దుర్యోధనుడు. వాడు ద్రౌపది నవమానించినాడు. ఆ యవమానమునకు వాని వంశము నాశనమైనది. ఆ నాశనముచేసిన దెవరు? తన ముత్తాత. ధర్మరాజు. అవునయ్యా! నీ ముత్తాత ధర్మరాజంతటివాడు తన భార్య నవమానింపగా ఆ దుర్యోధనుని కారణముగా వాని వంశమును నాశనముచేయలేదా? అన్న భావము 'ఏమి యపూర్వ' మనుటలో ప్రత్యాయిత మగుచున్నది. ఈ ప్రత్యాయితమైన భారతకథావృత్తాంతము తరువాతిపద్యమునందు కారణమగుచున్నది. 'కావునన్' అనగా ఒక్క దుర్యోధనుడుచేసిన ద్రౌపద్యవమానము వలన ధర్మరాజు వాని వంశమును నాశనము చేసినాడు కాబట్టి మహీవల్లభ! నీవు రాజవు, నీవుకూడ నీ కులధర్మము ననుసరించవలయునుసుమా! అందుచేత సర్పయాగము చేయుమన్నాడు. ఈ యర్థమును జనమేజయుని ముఖమునందు చూచినవాడు కావుననే 'అతిధీయుత' అని సంబోధించినాడు. మరి పైన సామాన్యాకారముగా కారణ సంగ్రహ మేలచేయవలయును? విశేషాకారముగా ధర్మరాజు దుర్యోధనుని కారణమున వాని కులమును నాశనముచేసినాడు గదా యని యెందుకు చెప్పరాదన్నచో జనమేజయుడు రాజు. ఆ రాజవంశపు స్త్రీకి జరిగిన యవమానమును పరామర్శించి వాచ్యముగా చెప్పుట ఉదంకున కుచితము గాదు. అది తెలియక జనమేజయునకు సర్పయాగము చేయవలయునను నిశ్చయము కలుగదు. అందుచేత దానిని జనమేజయుడు గ్రహించునట్లు చెప్పక చెప్పవలయును. దానిని స్ఫురింపజేయుట కితరమార్గము లవలంబించినచో ఆ స్ఫురణ యంత

స్పష్టముగా భాసించదు. అందుచేత అప్రస్తుత ప్రశంసాముఖమున పతదాకారక స్ఫురణము కలిగించుట పరమోత్తమమైనది. సాదృశ్యముఖమున ప్రస్తుతమును స్ఫురింపజేయుట కిచ్చట వీలు లేదు. ఎందుచేతననగా ఆ సాదృశ్యమునందుకూడ కారణత్వముచెందు బలమున్నదికాబట్టి. అందుచేత భారత వృత్తాంతమే స్ఫురింపవలయును. స్ఫురించిన గాని కార్యకారి కాదు. అందుచేత సామాన్యరూపమైన అప్రస్తుత ప్రశంసాముఖమున విశేషరూపమైన భారత వృత్తాంతమును ప్రత్యాయితమొనర్చి దానిని సర్పయాగ సమర్థమునకై వినియోగించినాడుదంకుడు. కాబట్టి కారణత్వము సంగృహీతమైనది. వాచ్యమైన సామాన్యమునందు కాదు. వ్యంగ్యమైన భారత వృత్తాంతమునందు. అప్రస్తుతాలంకారముఖమున కావ్యలింగాలంకారము ధ్వనించుచున్నది.

ఇచ్చట ఇంకొక విశేషమున్నది. సర్పయాగము ఆస్తీకునివలన మధ్యలో విఘటితమైనదిగదా! దానికి హేతువేమి? ఒక కార్యము సఫలమగుటయో విఫలమగుటయో దానిబీజమునందుండును. ఇచ్చట సర్పయాగ రూపకార్యమునకు జనమేజయగతమైన తద్బుద్ధి బీజము. సర్పయాగము విఘటితమగుటకు కారణసామగ్రి జనమేజయుని సంకల్పమునం దుండవలయు నన్నమాట. జనమేజయునకు భారతకథ సామాన్యాకారముగనే తెలియునుగాని విశేషాకారముగ తెలియదు. ఎప్పుడు అతని మనస్సునం దుదంకు డుదాహరించిన అప్రస్తుత వాక్యము వలన భారత కథ మెరసినదో అప్పుడాతనికి భారత కథా సర్వమును విశేషాకారముగ నెరుంగవలయునని కోర్కెగలిగినది. కాబట్టి ఉదంకుని యా వాక్యమేక కాలమున జనమేజయుని మనస్సునందు భారత కథా శ్రవణ బుద్ధి, సర్పయాగ బుద్ధి రెంటిని పుట్టించినది. సర్పయాగ బుద్ధికి భారత కథా శ్రవణ బుద్ధికంటు కట్టినా డుదంకుడు. ఇవి రెండును కలిసి కొంత వరకే యభివృద్ధి చెందును. తరుణము నందు దేనిదో యొకదాని తల నరుకవలయును. ఆస్తీకుడు వచ్చి సర్పయాగమును నరికెను. అంతవరకు నణగి పడియున్న భారత కథా శ్రవణబుద్ధి జనమేజయుని మనసునల్లు కొన్నది. వెంటనే భారతమును చెప్పుమని జనమేజయుడు వేదవ్యాసు నర్థించినాడు. జనమేజయుడు భారత మునే వినగోర నేల? మరియొక రామాయణమునో భాగవతమునో ఏల వినగోరలేదు? అను మాటకిది సమాధానము. ఇంత దూరదూరముగ మహార్థములను పట్టి కథా కథనము నందు నన్నయ్యగారు సంయోజించును. ఆ కథా కథనము మనను నిలువనీయదు. చెవులు పట్టికొని లాగికొనిపోవుచుండును. ఆ పట్టు విడిపించుకొని లోపలకు మునిగితిమా అన్నియును ముత్యములు, రత్నములు, ప్రోవులు ప్రోవులు పడియుండును. వానిని సంగ్రహించుకొనువారుండవలయు నంతే.

# అభిజ్ఞాన శాకుంతలము 8 | విశ్వనాథ సత్యనారాయణ

కథానాయకుడు సర్వసద్గుణ సంపన్నుడై యుండ వలయును. తరువాత కవి యేమి సేయవలయును? వానియం దేవో కొన్ని దోషము లున్నగదా కథకు దారితీయుట! పూర్వము చెప్పినట్లు అనుభావ వ్యభిచారాది భావములను పురస్కరించుకొని రసదృష్టితో కథను నిర్మించుకొనవలయును. కాక రసమును పెంపుచేసికొనవలయును. లేదా పలు సన్నివేశములు లోకమునందు జరుగుచునే యుండునుకదా. అట్టివేవో జరిగించవలయును. రామచంద్రుని భార్యను రావణు డెత్తికొని పోయినట్లు, సుగ్రీవాది సమాగమము జరిగినట్లు, దైవము సంఘటించి కీళ్లు మేళ్లు పురస్కరించుకొని కథ నడువవలయునుగాని పాశ్చాత్య మహా నాటకములయందువలె కథానాయకుని శీలమునందలి యొక దోషమో లోపమో కథకు హేతువు కాదు. నాయకు డుత్తముడు, సత్కులీనుడు, అవికత్థనుడు, శౌర్యవంతుడు, చలిచీమ నేనియు చాద్రొక్కజాలడు. ఆ నాయకు డెప్పుడు నట్లే. సర్వప్రాచ్య మహానాటకములందు నాయకుని శీలమునందు విశేషము పుట్టుటకు వీలులేదు.

కాళిదాసుని నాయకుడైన దుష్యంతుడుకూడ నట్టివాడేనా? అంతమాత్రముతో కాళిదా సూరకుండునా? రసము మాత్రము నిక్షేపించి యూరకయుండు కవులు సంతృప్తులు కావచ్చును. కాళిదా సంతకంటెనధికుడు. తన నాయకునిలో మరి యేదో గొప్పతనమును నిక్షేపించి తీరును. ఆ గొప్పతనమునకు కథాప్రాణమునకు లంకె పెట్టును. సత్కులీనతాది లక్షణములతో సంతృప్తిపడి యూరకుండడు.

అందుకనియే సృష్టిలో యే గ్రంథమునందు చూడరాని యొక కథానాయక లక్షణము దుష్యంతుని యందు నిక్షేపించినాడు. తొలుతనే 'సతాంహి సందేహ పదేషు వస్తుషు ప్రమాణమంతఃకరణ ప్రవృత్తయః' అని దుష్యంతుడు తన్నుగూర్చి తాను చెప్పికొనినాడు. ఆధునికులలో కొందఱు తామొక సూత్రమును పఠింతురు. బాలుర పుస్తకములలో కూడ వ్రాయుచున్నారు. ఆ సూత్ర మేమనగా ఎవడు తన్నుగూర్చి తాను గొప్పగా చెప్పుకొనునో వానిని మనము విశ్వసించరాదు. వాడు నిజముగా నంతవాడయినచో నట్లు చెప్పుకొనడు. ఇది యాధునికుల సిద్ధాంతము. ఈ సిద్ధాంతము ప్రకారము చూచినచో దుష్యంతుడు సత్పురుషుడుకాడు. మనము దానిని నమ్మకూడదు. కాని దుష్యంతు డాధునికుడు కాడుగదా! ఆయన గ్రంథ మాధునిక దృష్టితో చూచినచో సరిగా తెలియదనియే కదా ఇంత పరామర్శ. ఆయన తాను సత్పురుషుడ నని చెప్పికొనెను. చెప్పికొనిన దానికి దాఖలా కనిపించెను. దాఖలా కనిపించినపుడుకూడ విశ్వసించనిచో అది దుష్యంతుని తప్పుకాదు. ఆ దాఖలాకు మనము దుర్వ్యాఖ్యానము చేసినచో నదియు దుష్యంతుని తప్పుకాదు. దాఖలాలేకుండ దుష్యంతు డన్నచో అప్పుడు దుష్యంతుని దోషము. తన మనస్సు క్షత్రపరిగ్రహయోగ్య కాని స్త్రీ యందు ప్రవరించదు అని దుష్యంతుడు చెప్పినాడు. శకుంతల క్షత్రపరిగ్రహ యోగ్యయని నిర్ణయింపబడినది. అందు కనియే రాజు 'మానుషీషు కథంవా స్యాత్ అస్య రూపస్య సంభవః' అనియు 'లబ్ధావకాశో మే మనోరథః' అనియు 'భవహృదయ సాభిలాషం సంప్రతి సందేహ నిర్ణయో జాతః, ఆశంకసే యదగ్ని త దిదం స్పర్శక్షమం రత్నం' అనియు చెప్పినాడు. కనుక దుష్యంతుడు తాను సత్పురుషుడ నని చెప్పిన

మాట పొగడికోలు కాదు. వికత్థనత్వము కాదు. మరియు నాయకగత సచ్ఛీలత లోపించలేదు. ఆయన ధీరోదాత్తతకు భంగము కలుగలేదు.

మరియు సద్విషయమున చెప్పినమాట పొగడికోలు కాదు. పొగడికోలనునది యసద్విషయమున నుండును. నే నంత చేయుదును, ఇంత చేయుదును అన్న మాటలలో వికత్థనత్వ ముండును గాని నా యాంతర లక్షణ మిట్టి దిట్టిది అని సద్విషయమున చెప్పినప్పుడు దానిని పొగడికోలుతనమని చెప్పుటకు వీలులేదని యర్థము. ఇది వేరే విషయము. ప్రస్తుతము దుష్యంతుడు తాను సత్పురుషుడ నని చెప్పినాడు. ఆ సత్పురుషుని లక్షణ మెట్టిదనగా సందేహపదములైన వస్తువులందు వాని యంతఃకరణ మతనికి ప్రమాణభూతముగా నుండును.

ఈ నాటకముయొక్క యాయువుపట్టంతయు నీ వాక్యములో నున్నది. ఈ వాక్యములోని యర్థము నాటకముయొక్క కథను, సన్నివేశమును, రసమును పాలించుచున్నది. సన్నివేశమును, రసము నెట్లు పాలించుచున్నదో ముందు చెప్పబడును. కథను పాలించిన విషయము మున్నే ప్రస్తావించబడినది. ఇప్పుడు ఈ సత్ అన్న శబ్దముయొక్క విచారణ తొలుత జరుగవలయును.

సత్ అనగా ఉనికికలది అని యర్థము. సత్ చిత్ ఆ మాటలలోనిది. అది ఉన్నది. సత్పురుషు డనగా ఉన్నదని చెప్పదగినదానియందు ప్రవర్తించువాడు. ఏది ఉన్నది? బ్రహ్మపదార్థ మున్నది. తత్సాధకమైన ధర్మ మున్నది. సత్తు, అసత్తు అన్న రెండు మాటల యొక్క అర్థము లోకమునందు సర్వదా ప్రయోగింపబడుచునే యున్నది. అక్కడి యర్థము నిదియే. సత్పురుషు డనగా ధర్మమునందు ప్రవర్తించువాడు. ధర్మము నిత్యమైనది. దానికి భంగము లేదు. అదియే యున్నది. త దనుబంధి ప్రవర్తనకలవాడు సత్పురుషుడు. ఒకదృష్టితో స దసత్తు లనగా ధర్మాధర్మములని చెప్పవచ్చును.

సవర్ణవివాహము ధర్మ్యమైనది. ఇదిసద్విషయము. పెఱలు సద్విషయములు కావని యర్థము.

సత్పురుషునకు బుద్ధి ధర్మ్యమైన విషయమునందే ప్రవర్తించును. ఇదియే సత్పురుషశబ్దము. ధర్మ్యమైన దేదో వేదశాస్త్రములు నిరూపించి యిదివరకే చెప్పినవి.

పలుకావ్యములలోని కథానాయకులు సత్పురుషులే. అప్పుడు దుష్యంతుని విశేషమేమి? వారికి దుష్యంతునకు గల భేద మిది. వారు సత్పురుషులై కర్మమార్గమునందు సంచరింతురు. మేము కర్మమార్గమునందు సంచరించుచున్నామని వారు చెప్పగలరుగాని నేను చేయుచున్నదే ధర్మమని చెప్పలేరు ఇది ధర్మము, ఇదియధర్మమని నాయంతఃకరణము చెప్పుచున్నదని యనలేరు. ఇదియే దుష్యంతుని విశేషము. ఈ విశేష మేమనగా ఆయనయందు అంతఃకరణము జాగ్రదవస్థాగతమై యున్నది. ఇతర సజ్జనులయందు తాదృగ్జాగ్రదవస్థాగతమై యుండదు. శాస్త్రము లిట్లు చెప్పుచున్నవి గనుక నే నిట్లు చేయుచున్నాను అనెడువాడు శాస్త్రప్రమాణధిషణుడు. సత్పురుషుడు. నా యంతఃకరణ మిట్లు చెప్పుచున్నది, నేను సత్పురుషుడను, అందుచేత నా యంతఃకరణ మన్యథా చెప్పదు అనెడివాడు సత్పురుషులకంటె అతీతుడు. తనలోని యంతఃకరణమును తాను తెలిసికొన్నవాడు.

అంతఃకరణ మనగా నేమో, దాని స్వరూపమేమో పూర్వ వ్యాసములందు చెప్పబడినది. మరి కొంత యిది. అంతఃకరణము చతుర్ధావిభక్తమై యుండునని చెప్పినది దాని వృత్తి. ప్రధానమైన యంతఃకరణస్వరూపము కాదు. ప్రధానమైన యంతఃకరణ స్వరూప మేమనగా వృత్తి విరహితమై ఏ చైతన్యముచేత జీవభావము కలుగుచున్నదో, ఏ చైతన్యము జీవుడుగా చెప్పబడుచున్నాడో ఆ చైతన్యముయొక్క జీవలక్షణమైన స్వరూపము. ఆ జీవుడే అంతఃకరణము. సుంతభేదమున్నది. జీవుడు ప్రాగ్గత బహుసంస్కార సంపుటి. అంతఃకరణము తత్సంపుటిని, శరీరగతమైన జీవుని, ప్రకాశింపజేయగల లక్షణముగల చైతన్యముయొక్క వెలుగు. ఈ యంతః

కరణము శరీరగతజీవభావమును ప్రకాశింపజేయు
నదియు, వృత్తిగా ప్రసరించగలదియు నైన వెలుగు.
ఒక విద్యుత్కేంద్రమున్నది. అందున్న విద్యుచ్ఛక్తి
వెనుకనున్న కొన్ని యంత్రములనుండి సమావిర్భ
వింపజేయబడినది. ఈ శక్తినుండి విద్యుత్కుల్యలు
ప్రవహింపజేయబడును. ఆ విద్యుచ్ఛక్తి నిలువ
యున్నచో నెటువంటిదో ఈ యంతఃకరణ మట్టిదని
చెప్పవచ్చును. జీవగతమైన చైతన్యము వృత్త్య
పేక్షయా తన అచ్ఛమైన చైతన్యము నొకచోట
ఉంచుకొన్నది. అది యంతఃకరణము.

ఈ యంతఃకరణము సర్వ జీవరాసులయందు
గలదు. ఈ సర్వాంతఃకరణ సమాహారభూత మైన
వస్తువు కలదు. దానినే పరమశివుడుగా చెప్పుదురు.
అదియే లింగము.

సూతుడు రాజును 'మృగానుసారిణం సాక్షాత్పశ్యా
మీవ పినాకినమ్' అన్న మాటలోని దుష్యంతుడు
శివునితో పోల్చబడుటకు కారణము దుష్యంతుని
యంతఃకరణమునందు మేల్కొని యుండుటయే.
దుష్యంతుడు సాక్షాత్తు శివుడు. శివాంశ ప్రజ్వలితమైన
జీవుడు. కాని సర్వాంతఃకరణ సమాహారభూతమైన
వాడు కాడు. తత్సమాహారమునం దేకదేశమైనవాడు.
సముద్రములోనున్న నీటిబిందువు సముద్రములోనిది.
చెఱువులోని నీటిబిందువు చెఱువులోనిది. ఒక
చెంబుతో చెఱువులోని నీళ్ళు తెచ్చి ఇవి చెఱువు
నీళ్ళందుము. సముద్రపునీళ్ళు తెచ్చి ఇవి సముద్రపు
నీళ్ళందుము. ఆ రీతిగా దుష్యంతునిలోని యంతః
కరణము పరమశివ సమాహార భూతాంతఃకరణము
లోనిది. 'పశ్యామీవ పినాకినమ్' అన్నమాట కర్థమిది.

అనగా ఈ దుష్యంతుడు—అటు నిత్య జాగ్ర
దవస్థా భూతమైన యంతఃకరణమునందు మేల్కొని
యున్నాడు. ఇటు సర్వజీవులవలె సంసారమునం
దున్నాడు. వృత్తి సమృద్ధిగా నున్నది. సత్పురుషునకు
అసత్పురుషునకు భేదమిట్లుండును. వృత్తిచేత
యసత్పురుషుని అంతఃకరణ ప్రవృత్తి పిహితమై
పోవును. అది వ్యయముకాదు. వ్యయమగు లక్షణము
దానియందు లేదు. సత్పురుషునియందు తదంతః
కరణ ప్రవృత్తి పిహితముకాదు. అది వెలుగుగదా.
వెలుగు అన్న పదార్థమునకు తదితర పదార్థమునకు
భేదమున్నది. తదితరమైన యే పదార్థమైనను
వృత్తియందు తన మూర్తిని వ్యయపెట్టికొనును.
తానే అదిగా పరిణామము పొందును. వెలు గట్లు
కాదు. దాని ప్రసారమువలన నది వ్యయముకాదు.
తాను కొంతమేర వ్యాపించినచో యెచ్చటినుండి అది
వ్యాపించినదో అచ్చటి వస్తువునకు భంగము లేదు.
ఉదాహరణగా నొక దీపమును తీసికొందము. దాని
నుండి వెలుగు వచ్చుచున్నది. దీప మట్లే యున్నది.
తక్కిన పదార్థము లిట్లుగాదు. ఇంత మన్ను తీసి
కొంతమేర చల్లినచో ఆ మన్నక్కడ లేదు. ఇంత
వాయువును కొంతమేర విసరినచో అచట వాయువు
లేదు. ఇంత వెలుగును తీసి మరొకచోట చల్లుట
కాదు. ఆ వెలుగు ప్రసరించును, ప్రసరించదు.
తా నచ్చట నుండును. తోడ్తోన ప్రసరించును.

ఇది అంతఃకరణముయొక్క లక్షణము. దుష్యం
తునియం దిట్లున్నది. అతని యంతఃకరణ మున్నది.
వృత్తియు నున్నది. ఆ వృత్తి ధర్మానుబంధిగా
నుండుటచేత అంతఃకరణము పిహితము కాలేదు.
కాదు. దుష్యంతుడు శివైకదేశమని చెప్పిన తరువాత
యోగివంటివాడని చెప్ప నక్కరలేదు.

ఈ రెండు లక్షణములు దుష్యంతునియందు విడి
విడిగా ప్రవహించుచున్నవి. ఈ జంట ప్రవాహముల
మీద నాధారపెట్టి కాళిదాసు నాటకము వ్రాసెను.

ఈ ప్రవాహములకు చమత్కారముగా నొకొక్క
చోట సమైక్యము భాసించును. ఒకొక్కచోట
రెండును విస్పష్టముగా విడివిడిగా నడచును. మఱి
యొకచోట అదియే యిదియేమో యన్నట్లుండును.
ఇవి మూడు దశలు. అదియే యిదియేమో అన్న
దశకు నీ యుదాహరణము చూడుడు. 'అనుయాస్యన్
మునితనయాం, సహసా, వినయేన వారితప్రసరః,
స్థానా దనుచ్చలన్నపి గత్వేవ పునః ప్రతినివృత్తః
మునితనయ వెంట పోదమనుకొనుచు వినయము

చేత నర్ధగింపబడిన కదలిక గలవాడనై ఉన్న చోటునుంచి కదలకపోయినను, వెళ్ళి తిరిగి వచ్చి నట్లే యున్నది. ఇది దీని యర్థము. దీనికి సజాతి యైన యిట్టిదే యన్న భ్రాంతి కొలిపెడు ననుభూతి లేశము లోకమునందు పెక్కు రనుభవింతురు. 'ఆపని చేయకపోయినను చేసినట్లే యున్నదిరా!' అని లోకమునం దనుకొనుట కలదు. ఇట్లెందు ననుకొందురు? తత్కార్యమునందలి గాఢ భావనచేత ననుకొందురు. గాఢభావన యనగా నేమి? మనోవృత్తిగాని, చిత్తవృత్తి గాని యంతఃకరణము నకు తాకుట. అప్పుడే గాఢభావన యందురు. దానినే శ్రీ శంకర భగవత్పాదులు రూఢచింతన మన్నారు. దీనిని పాశ్చాత్యులు మానసికశాస్త్ర సంబంధమైన యొక లక్షణ మనవచ్చును.

తాత్పర్య మేమనగా దుష్యంతుడు శకుంతలాగత మైన భావన చేయుటలో నతని యంతఃకరణమును దానివృత్తియు రెండును కలిసిపోయినంత తీవ్రమైన యనుభూతి పొందినాడు. ఆయనుభూతి విశేషమును వృత్తిదశయందు గుర్తించి చెప్పినాడు. అనుభూతి యంతఃకరణమునం దున్నది. తదవగతి మనస్సునం దున్నది. ఈ రెంటియొక్క యానుషంగికత్వము విడివిడిగా, సమైక్యముగా, విస్పష్టముగా నా మహాను భావునికి గోచరించుచున్నది.

దుష్యంతు డిట్టివాడని దుష్యంతునకు మాత్రమే తెలియుటకాదు. ఇది చాలమందికి తెలియును. తెలిసిన వారిద్ద ఱీనాటకములో నున్నారు. 'పశ్యామీవ పినాకినమ్' అన్న సూతునకు తెలియును గదా. మరియు విదూషకునికిగూడ తెలియును. 'భోః కి మేతత్ అనుపపన్నం ఖల్వీదృశం త్వయి. కదాపి సత్పురుషాః శోకపాత్రాత్మానో న భవంతి. నను ప్రవాతే ఽపి నిష్కంపా గిరయః' ఇదేమిటయ్యా! నీవంటి వానియం దిట్లు కూడదు. సత్పురుషుడు శోకపాత్రాత్ములు కారు. ఎంత పెద్ద గాలికైనను కొండలు కదలునా. షష్ఠాంకములో రాజుయొక్క పరమవిరహ దైన్యమును చూచి విదూషకు డన్నమాట లివి. సత్పురుషులు దుఃఖమును పొందుదురా? అనుట లోకమునం దున్నదా? నీవన్నియు తెలిసినవాడవు. నీవు దుఃఖపడవచ్చునా అందురు. నీవంటివాడే దుఃఖ పడినచో తక్కిన వారేమి కావలయు ననవచ్చును. నీవు ధైర్యవంతుడవు. ఇట్లు కారాదు అనవచ్చును. నీవు సత్పురుషుడవు దుఃఖపడవచ్చునా అని యెవ రందురు? కనుక దుష్యంతుని ఈ శివైకదేశత్వము తెలిసినవారు కలరన్నమాట. సూతుడును విదూషకుడును కనిపించుచునే యున్నారు. ఇది దుష్యంతుని లక్షణము. ఇతర కావ్యనాయకులవంటివాడు కాడు. కాళిదాసుని గొప్పతన మెచ్చట నున్నదనగా దుష్యంతుని ఈ లక్షణములో నుండి కథానిర్మాణము చేయుట మీద నున్నది. ఈలక్షణమునుబట్టి రసభంగదోషము రాకుండ చేయుటలో నున్నది.

ఇంకొక్క చిన్న విషయ మిచ్చట చెప్పవలయును. 'అనుయాస్యన్మునితనయాం' అన్న శ్లోకములో మానవునియొక్క మానసిక ప్రవృత్తిని చెప్పుచున్నట్లు నటించి పరమమైన యంతఃకరణవిషయము చెప్పినాడు. అన్నియు నిట్లే కథాగత విషయములవలె కనుపించును. వెనుకనున్న జ్యోతి ధగధగ లాడుచుండును. ఇట్లే చెప్పబోవు విషయములుకూడ పరిశీలించవలయును. షష్ఠాంకమునందు ప్రతీహారి వచ్చి కొన్ని రాజకీయ విషయములు వ్రాసిన పత్రికను రాజున కిచ్చెను. ధనమిత్రుడను సముద్ర వ్యవహారియైన సార్థవాహుడు నౌవ్యసనమునందు విపన్నుడైనాడు. అత డనపత్యుడు. అతని యర్థ సంచయము రాజగామి యగును. ఈ సంగతిని చదివి రాజు పిత్రర్థము సంతానమునకు పోవును. ఆ ధనమిత్రునకు మరే కళత్రమునందైన సరే సంతానము కలిగినచో నతనికీధనము పొందించుమని చెప్పినాడు. ఇచట రాజు శకుంతలా ప్రత్యాఖ్యానముచేత తన యొక్క నిరపత్యత్వము భావించి చెప్పినట్లు కనిపించును. కాని దుష్యంతుడు సహజముగా పరమ సత్పురుషుడు. కాళిదాసు దానిని గోపనముచేసి రాజా సందర్భమునం దట్లు ప్రవర్తించుటకు ఆ సందర్భము యొక్క బలము హేతువన్నట్లుగా వ్రాయును. ఇది యొక విశిష్టమైన రచనాశక్తి. సత్ అను పదార్థ మెవని యంతరమునందుండదో వాడు సత్కార్యములు చేయనేలేదు. ఒత్తిడివలన చేసినచో నది బలవంతపు బ్రాహ్మణార్థముగ కనిపించుచునే యుండును. ఇచట దుష్యంతు డా సన్నివేశబలము చేత నట్లు చేసినాడనుకొనుట తప్పు. సన్నివేశ మట్లు కల్పించుట కవి నెరపిన శిల్పము, ఈ శిల్పము వెనుక దుష్యంతునియొక్క స్వచ్ఛమైన యంతఃకరణము భాసించుచునే యున్నది.

## పంకజాంకురము

ఇది యేమి జగము సామీ!
కదలిన ప్రత్యణువు ప్రళయ గంభీరంబై
కదలును; లేదా కదలదు
మొదలుఁ దుది లేని జలధి పోలిక నెపుడుఁ.

ఉదకము లుప్పులై బ్రదుకు
నూర్పు గ్రసింపగ మృత్తుకోసమై
వెదుకగ కానరాక; పృథు
వీచిక లూరక తారుమారుగా
కదలుప జీవితమ్ము కద
గండ్లయి యెట్టులో పాదుకొంటి; నా
బ్రదు కిది కందళించినది స్వామి!
భవత్కృపవల్ల నేటికిఁ.

అవునోయీ ప్రభు! నీ దయామధుర
వర్షాంబు ప్రసారమ్ముచే
నవకం బందిన యీ జగజ్జలధిలో
నానావిధాభీల జం
త్వవరోధ ప్రకరమ్ము నాగికొని
నిత్య ప్రస్ఫురన్మూర్తియౌ
నవతామంజుల పంకజాంకుర
మిదో నా స్వామి! రక్షింపవే.

లీలగ త్వత్కృపాకిరణలేశము
సాగుచునున్న జాలు నా
యీ లలితాంకురాన
ప్రభవించును వందలు వేలు పద్మముల్
చాలుగ తన్మరందములు
సాగి, జగజ్జలరాశి క్షారముఁ
దోలి, భవన్మహావిభవ
దోహదముం బొనరించునో ప్రభూ!

—వెలుకపల్లి జమదగ్నిశర్మ

## వాసనాసామ్యము

అనుదినానంత జీవయాత్రావసరము
నందు వెనుకాడి గమనించుచుందు ముందు
వంద పాయల కాలప్రవాహమందు
చిందరయి వందరయి గతించెడి జనమును.

నేనెరుంగుదు సామాన్య మానవాత్మ
లనుభవించెడి లక్షల యాతనలను
మీ రెరుంగరు జంతు సంసారధర్మ
మనుసరించెడి లౌక్యవర్తనులు గాన.

ఈ వసుంధరకును నాకదేమి పూర్వ
జన్మ జన్మల వాసనా సామ్యమింత
యున్నదో మహా సూక్ష్మము నూదుచుందు
అప్పు డప్పుడు తప్ప నా కెప్పుడేని.

—అనుముల కృష్ణమూర్తి

కొండముది శ్రీరామచంద్రమూర్తి | బలిపీఠము

పాత్రలు

| | | |
|---|---|---|
| అంకమ్మ | కుంటికోటప్ప | చలపతిరావు |
| మహేంద్రం | రఘుపతి | గంగరాజు |

సంధ్యాసమయం. వరండా అంతటా లేత ఎర్ర రంగు నిండివుంది. ఆ వరండాలోనుండి ఇంట్లోకి వెళ్ళడానికి వొకేవొక ద్వారం. ఆ ద్వారానికున్న పసుపుపచ్చని కర్టెను ఎర్రరంగులో కలిసిపోతూ, అదో వింతగా వుంది. ఆ కర్టెను గాలికి ప్రక్కకు తొలిగినప్పుడల్లా, చితికిపోతున్న మధ్యతరగతి హృదయంలాగా, చివికివున్న ఆ గృహాంతర్భాగం కూడా గంభీరంగా, విషాదంగా, చీకటిగా కన్పిస్తుంటుంది.

వరండాలో ద్వారానికి అటూయిటూ నాలు గైదు కొయ్యకుర్చీ లున్నాయి. వాటికి పైగా, గోడలకు, ఆ యింటిలోనివారు విడివిడిగానూ, సామూహికంగానూ, గత కాలంలో తీయించుకున్న ఫొటోలు వరుసగా తగిలించబడి వున్నాయి. వాటికి కొంచెం ప్రక్కగా, సరిగ్గా ద్వారానికి పైగా, వో రెండు దేశనాయకుల బొమ్మలున్న క్యాలెండర్లు.

తెర తొలగేసరికి రంగస్థలం నిర్జనంగా వుంది. కొద్దిసేపు నిశ్శబ్దం. ఇంతలో ఎడమవేపునుండి, అంకమ్మ మొహానికి పట్టిన చెమటను పైనున్న కండువాతో తుడుచుకుంటూ ప్రవేశిస్తాడు. మనిషి నల్లగా, సన్నగా, తెల్లని గడ్డంతో వున్నాడు. వార్ధక్యపు రేఖలు కన్పిస్తున్నాయి. ఓ చినిగిన ధోవతి కట్టుకున్నాడు.

అంకమ్మ: (ద్వారంవరకూవచ్చి) సిన్నదొరా !....
సిన్నదొరా ! (రఘుపతి లోపల్నుంచి బయటికి వస్తాడు. పాతికా-ఇరవై మధ్యనున్న వయసు. స్ఫురద్రూపి.)

రఘు : ఎవరది ? ఓ !— నువ్వా అంకమ్మా ? రారా. కూచో. మహేంద్రమేమో ననుకున్నాను.

అంక : ఆలాగా బాబు ? అవున్లెండి— కళ్లెల్లోకి కాళ్ళుజాపిన నేనెందుకు మీకు ? తియ్యనిమాట సెప్పినవోడే ఆప్తుడూ, భగమంతుడూ !!

రఘు : ఛా ! ఛా ! పొరపాటుపడ్డావు అంకమ్మా ! మహేంద్రం తవ్వి తలకెత్తిందీలేదు, నువ్వు వొరిగించందీ లేదు. ఇద్దరూ కౌలుదార్లే. అయితే, ఆ విషయానికొస్తే నువ్వే మాకు మరింత సన్నిహితుడివి. మా పొలం చేస్తున్నవాడివి. మహేంద్రము అంటావా ?... మా అన్నగారి పొలం చేస్తున్నవాడు. ఆ పొలంలో చేయించిన మరమ్మతు విషయాలు మాట్లాడడానికి ఈ పూట వస్తానన్నాడు.

అంక : నట్టింట బతుకుతున్నాడు. పాదాలకాడ వున్నవోడు. గుండెలకు నుంచుంటున్నాడు. తిన్న తిండి కండగా మారినప్పు డెందుకు రాడు బాబు ?

రఘు : అదేమిటి ?

అంక : మీకు తెలీదు బాబు. ఇప్పటికి అరవై వానలు సూసినాను. ఈ సేతుల్తో మిమ్మల్ని పెంచినాను. ఈ సంగతులు మీకు తెలీదు. అయ్యోర్నిట్టికి మీకు మయేంద్రం నమ్మినవోడై

నాడు. కుడుమును పుచ్చుకుని బియ్యాన్ని కొలుస్తున్నాడు.

రఘు : అంకమ్మా- నిన్ను కాదని పరాయివారిని నేను ఆదరిస్తా ననుకున్నావా? ఎంత పిచ్చి వాడివి! ఆ భయమేమీ నువు పెట్టుకోనక్కర్లేదు. చట్టం ఏమన్నా నువు చేసుకుంటున్న పొలం నీదే. నా మాట నమ్ము.

అంక : బగమంతుడా! నిన్ను నమ్మినవార్ని నట్టేట ముంచవు తండ్రీ! రగుపతి బాబు! మా దొర కన్నుమూసేనాటికి మీరు ఇంతవారు. ఈనాటికి, మీరూ పంచెకట్టి 'ఈ సేను నాది. ఈ బూమి నాది' అనగా సూసే అదృష్టం-ప్-మా దొరకు లేదు.

రఘు : నోచుకోనిదానికి ఎంత విచారించి మాత్రం ఏం లాభం? సరేకాని, ఇంట్లో ఏం కావాలో కనుక్కున్నావా ?

అంక ; ఆఁ! పొద్దున్నే సూసినాను బాబు. కాయగూరలు తెమ్మన్నారు పెద్దమ్మగారు, రెండు పొట్లకాయలూ, కసిన్ని దోసకాయలూ, దిబ్బమీదుంటే పట్టుగొచ్చినాను. ఇన్ని మజ్జిగ పోయించుకొచ్చినాను. కుండల్లో, గాబుల్లో, నీళ్ళుతోడి——

రఘు : సరే! సరే! ఇహ నువ్వెళ్ళి చేలో మెరకా, పల్లం సరిమాచుకో. పో. కత్తెర రాకముందే నయిమన్ను తోలి....

అంక : దేముడు వరమిచ్చినాక, బక్తు దూరకుంటాడా బాబూ? ఇయ్యాల మాపటికే మొదలెడతాను.

రఘు : గడ్డ విరవడం పూర్తయిందా ?

అంక ; లేదు బాబు. గడ్డ యిరవనికే యీల్లేదు. తూరుపున లంజపురీ, బర్రె బొందూ తెగబలిసి పోయినాయి. పెద్దొరగారి సేలో సేయించి నట్టే మన సేలోనూ కొంతపని సేయించవలె మీరు.

రఘు : ఆలోచిద్దాం.

అంక : సంగలు, గాబ మొల్సిందంటే మొదటికే సచ్చిపోతాం. దీపముండగనే గుడిసేసుకోవాలి. ఇప్పుడు డబ్బు కెనకాడితే, ఆనక డొక్క ఎనకాడుద్ది. ఆలోచించుకోండి బాబు- సిన్నవారు! పెద్ద సదువులు సదివినవోరు!

రఘు : నలుగురితోనూ సంప్రదించి, డబ్బువిషయం మాచుకొని, ఈ యేడో, వచ్చే యేడో చేయిద్దాములే మరమ్మతు. తాతకు దగ్గులు తల్పుకొన్నపుడల్లా వస్తే ఏలా చెప్పు.

అంక : ఏమో బాబు! నా మీద నెపం లేకుండా సెప్పినాను. ఇంటిలోకితొంగిసూసి, ఇంటిబయట మాట్టాడండి. (కొంచెం దూరం వెళ్ళి, ఆగి) మరొక్క ఇశేసం, సిన్నదొరా! నోటికి నియమంలేదు. ఎందరో, ఎన్ని యిదాలగానో తెలివి సూపిస్తారు. మనసులోనిమంచిసూడండి. మర్మం వుంచుకుని మహేంద్రంతో మాట్టాడండి. (వెళ్ళిపోతాడు)

(అంకమ్మ అటు వెళ్ళి వెళ్ళకముందే మహేంద్రం ప్రవేశిస్తాడు. మనిషిలో మంచి దేహదార్ఢ్యంవుంది. కొంచెం ధూర్త స్వభావం వున్నట్టుగా కన్పిస్తుంటాడు.)

మహేంద్రం : ఇన్నాను దొరా! అంతా యిన్నాను. ఆ గోడసాటున దాక్కుని, ఆ బోగంముండా కొడుకు సెప్పినమాటలన్నీ యిన్నాను. ఇంటో పెళ్ళానికి పైట వుంచలేడు, నీతులు సెపటాని కొచ్చినాడు. నీతులు !

రఘు : నా కర్థం గావడంలేదు.

మహే : అవున్దొరా! ఈ యీది, ఈదందరికీ అది అరచేతి సొర్గం.

రఘు : నీక్కూడానా ?

మహే : ధూత్ ! ఎంగిలికూడు. మా యీరాం కాలిగోటికి రాదు. పొద్దుగుంకింది మొదలు పొద్దు పొడిసేవరకు ఒకటే వ్యాపారం.

రఘు : ఎవరూ ? వీరామా ?

మహే : అదేంటి బాబు. అలాగంటారు? నా పెళ్లాన్ని బట్టుకుని ?

రఘు : ఏం అనకూడదూ ?

మహే : పెద్దవాళ్ళకు బుద్ధి సెప్పద్ది నా యీరాం. ఇప్పటికేదో పొరపాటుపడ్డారు. ఇహమీదనకండి బాబు.

రఘు : నేనూ అదే చెప్పబోతున్నాను, మహేంద్రం! ఒకరిని గురించి మనం చెడుగా చెప్పబోయే ముందు, మనను మనం ఆత్మపరిశీలన చేసుకోవాలి. తప్పులేని దెవ్వరిలో? ఇటువంటి మాటలు ఇహమీదట నాతో చెప్పబోకు.

మహే : ఈ మాటే అంకమ్మతో చెప్పలేక పోయారా ?

రఘు : నీ అంత తొందరపాటు అతనిదగ్గరలేదు, పెద్దవాడు. పెద్దతనంతోపాటుమంచిగా బ్రతకాలన్న కోర్కెగలవాడు. ఇంకా నీకు ఆ అనుభవమూలేదు. నీలో ఆ వోర్పూలేదు.

మహే : నిజమే బాబూ! అనుభవం లేనివోణ్ని. వోర్పులేనివోణ్ని. కల్లబొల్లి మాటలుసెప్పి కన్నీరు తుడవాలన్న కోర్కె లేనివోణ్ని. చమించండి. ఇంకెప్పుడూ మీతో నిజం సెప్పను. (కొంచెం మౌనం, నిశ్శబ్దం) సీకటిపడే యేలకు ఆ కుంటికోటప్పగాడొచ్చి పడ్తాడు. మానం నిలువనీడు. డబ్బు సంతన సేసుకోండి దొరా!

రఘు : అబద్ధమా ? నిజమా ? యిది.

మహే : తమాసాకాదు బాబు. ఆ కుంటి కోటప్ప సంగతి మీకు తెలియదు. షావుకారు, కాంతరావుగారే, అణ్ణి కళ్ళలో పెట్టుకుంటారు.

రఘు : మనం కాళ్ళక్రింద పెట్టుకుందాం.

మహే : దొమ్మరోళ్ళు బట్టకట్టినంతకాలం, అది మీసేతా, నాసేతా కాద్దొరా ?

రఘు : ఎందుకనో ?

మహే : ఆడిమాటక్రింద రెండొందలమంది కూలీలుండారు.

రఘు : అలాగా ? అంతమందినీ పెట్టి, మన చేలో పనిచేయించాడా ?

మహే : ఆఁ! దాదాపూ వో వందమందిని పెట్టాడు.

రఘు : ఎన్ని కుంటలు తీయించాడు ?

మహే : నాలుగు పట్టెలు పెట్టించాడు. పట్టెకు రెండొందల గజాలు.

రఘు : ధర ?

మహే : కుంటకు రూపాయి.

రఘు : వందమంది మనుషులు...... నాలుగు పట్టెలు...... ఎనిమిది వందలరూపాయలు.... భేషుగ్గా వుంది. మా అన్నగారికి చెప్పకుండా పెట్టకుండా, ఈ భారాన్ని నా నెత్తిన వేసుకున్నందుకు, నాలుగువంద లవుతుందనుకొన్నది ఎనిమిది వందలు దాటుతున్నది. రోటిలో తల దూర్చినందుకు మంచిపనే జరిగింది.

మహే : పెద్దొరగా రెప్పుడొత్తున్నారు సిన్నదొరా?

రఘు : రావచ్చు ఇవ్వాళో రేపో. సరే. నీ పని కానీ పో. ముందు చేను బాగుపడితే, తర్వాత సంగతులన్నీ అప్పుడే ఆలోచించుకోవచ్చు.

మహే : అలాగే దొరా! (వెళుతూ) ఆ కుంటి కోటప్ప సంగతి మర్చిపోయేరు!— కొంప దగలడుద్ది. (వెళ్ళిపోతాడు)

(వరండాలో రఘుపతి కొంచెంసేపు వంటరిగా వుంటాడు. అతనిలో గొప్పగా ఆలోచన. ఆలోచనలో పరధ్యానం. ఆ పరధ్యానంలో చలపతిరావుగారొచ్చింది గమనించడు. వచ్చిన ఆ ఆగంతుకుడు నలభై వసంతాలు పైబడినవాడు. బట్టతల. గుండ్రని, ఎఱ్ఱని మొహం. నొసటన కుంకుమ రేకలు. పైన ఉత్తరీయం మాత్రమే. చెంగావి రంగు ధోవతి కట్టుకున్నాడు. నోట్లో బారెడు చుట్ట)

చల : రఘూ! వురేయ్ రఘుపతీ! (రఘుపతి పలకలేదు. పెద్దగా) వురేయ్-పలకవేరా ? ఏమిట్రా ఆ ఆలోచన ?

రఘు : (ఉలిక్కిపడి) ఆఁ - ఎవరూ ? ఓ! నువ్వా! రా, మామయ్యా. కూచో. ఎంతసేపైంది వచ్చి ?

చల : ఏమిట్రా ఆ ఆలోచన ? ఎవర్ని గురించిరా? ఏమైనా... ప్రేమగాని... పెళ్ళిచూపులుగాని...

రఘు : అటువంటి వేమైనావుంటే నాకు తెలియక ముందే నీకుతెలుస్తాయి మామయ్యా ! అయినా ఈ వూళ్ళో ఏమూల ఏం జరిగినా, ముందు చలపతిరావు మామయ్య నోటీసులోకి రావలిసిందేగా !

చల : ఇప్పుడేముందిరా ? రెక్కలు తెగిన పక్షుల్లాగా, అధికారం పోయి, మర్యాద పోయి. రామాకృష్ణా అంటూ కాలక్షేపం చేస్తున్నాం. ఆరోజుల్లో చూడవలసింది. నువ్వు మరీ చిన్న పిల్లవాడివి. అసలు పుట్టావో, లేదో ! మీనాన్న ఊరంతటికీ ఏకైక ధన్వంతరి. మాటన్నాడంటే చాలు. వూరంతా ఓకాడికిందకు రావలసిందే.

రఘు : పోయినయ్ మామయ్యా ! అన్ని విలువలూ నశించిపోయినయ్.

చల: ఆ వీధి చివర కర్రపట్టుకు మా నాన్న నుంచునేవాడు. ఆజానుబాహువు. పిల్లలకు హడలు. ఆయన్నిచూస్తే. ఈ వీధిచివర అరుగు మీద మీ నాన్న కూచునేవాడు, చుట్టకాల్చుకుంటూ. అవతల వీధిలో ఇప్పుడు కాంతరావు గారు లేరూ, వాళ్ళ నాన్న. రంగారావుగారు, వో పెద్దపులిలా వుండేవారు. అంతే. ఆడవాళ్లు నీళ్ళు తెచ్చుకునేవారు కారు. మగవాళ్ళు తలెత్తి వీధిన నడిచేవారుకారు. ఊరువూరంతా ఒక మాటక్రింద, ఒక భయంతో, విశ్వాసంతో, గౌరవంతో, స్వాభిమానంతో బ్రతికేది. ఇప్పుడేముంది ? పూర్వ సువాసినీ మొహం ఇంకా అందంగా వుంటుంది, నేటి మన పల్లెటూరు కన్నా.

రఘు : నిజమే మామయ్యా ! నియంతృత్వంలోనే కొన్ని కొన్ని మనకార్యాలు సాధింపబడ్డాయి గతంలో. పదిమంది చెప్పినమాటా పల్లెకూనకు చేటేకాని మంచి కాదు.

చల : నిజమే. మనవూళ్ళోనే చూడు కాంతారావు గారి మాటంటే కుంటికోటప్పకే గౌరవంలేదు. పైగా కుక్కను చూసి దాక్కుంటున్నది సింహం. సరే. పెద్దవారిసంగతి మనకెందుకయ్యా అంటావా— నీమీద అభిమానం. మీ అన్నయ్యకులేదు. మీ అన్నయ్య ఎదుట నిలబడి, ధైర్యంగా 'ఇదీ నిజం' అని చెప్పలేవు నువ్వు !

రఘు : అవును. చిన్నప్పటినుంచీ అట్లా పెరిగాను. ఇంతవాణ్ణిగా వున్నప్పుడే మానాన్నను కోల్పోయాను. మా అమ్మగారు, నా కసలు జ్ఞాపకమే లేదు. అన్నింటికీ మా అన్నయ్యే అనుకున్నాడు. నన్ను పెంచి, చదువు చెప్పించి, బ్రతకడానికి వో ఆధారాన్నిచ్చి—

చల : నిజమేనయ్యా ! నేనేమీ కాదనడం లేదు. మీ అన్నయ్య చాలా మంచివాడు. మీ వదిన అంతకన్నా మంచిది. మరి అంత మంచివారు కదా—ఇంతవరకూ ఆస్తి పంపకం విషయం మాట్లాడరేమీ? అహ. ఊరికే అంటున్నాను. నిక్షేపంలాంటి ఇరవై ఎకరాల మాగాణి భూమి...అయిదు వందల గజాల ఇల్లు....

రఘు : (అందుకుంటూ) నోటి మాటగా ఎవరికి వారనుకున్నాం. కోట్లో పొలం, నే తీసుకునేటట్టూ, చెఱువులో పొలాన్ని మా అన్నయ్య అనుభవించేటట్లున్నూ.

చల : అద్దదీ అలా చెప్పు ! అక్కడే వుంది. అసలు కీలకమంతా. వానా వరదా వచ్చి కొట్టుకుపోయే పొలం నీదిన్నూ, ఇంటి దగ్గర కూచుని చేను వేపు చూసినా. ఎకరానికి ఇరవై బస్తాలకు తక్కువ పండని పొలం అతగాడిదీనా ? శ్రీమన్నారాయణ — నీ నాటకం అత్యద్భుతంరా ! ఏయే పాత్రల చేత ఎట్టెట్టి ఘన కార్యాలు చేయిస్తావో, ఆయా పాత్రధారులకే తెలియదు కదా !!

రఘు : చలపతి మామయ్యా ! నీ మాటలు చూస్తూంటే, మా అన్నయ్య నాకేదో అన్యాయం చేశాడన్నట్లుగా ధ్వనిస్తున్నాయి. ఆయన అలా చేయడు. ఒకవేళ చేసినా, అనిర్ణయానికి నేను అడ్డుచెప్పను. పెద్దవాడు. నా శ్రేయస్సు కోరేవాడు. ఆయనతప్ప నాకు ఎవరూలేరు. నన్నన్యాయంచేసి, ఆయన మూట గట్టుకొనేదేమీ లేదు.

చల : మంచిది రఘూ ! మీ అన్నగారిమీద అంత మాత్రం నమ్మకం వుండడం, నేనూ హృదయపూర్వకంగా ఆమోదిస్తున్నాను. కానీ ఒక్క విషయం జ్ఞాపకముంచుకో. అందరూ అన్నివేళలా ఒకేవిధంగా ప్రవర్తించరు. మంచివాడిలో చెడు ప్రవేశించవచ్చు. చెడ్డవాడే, తలవనితలంపుగా, ఒక మహోపకారం చేయవచ్చు. నన్నేచూడు. ఉన్నది ఒక్కత్తె ఆడపిల్ల. వున్నదీ మన్నదీ దానికేకదా! దానికీ పెళ్ళీడొచ్చింది. ఆవిషయం మాట్లాడదామనే నీదగ్గరకువచ్చాను.

రఘు : నాతోనా ?

చల : అవును. నీతోనే. కానీ అవమానింపబడి వెళ్తున్నాను.

రఘు : క్షమించండి మామయ్యా! పెద్దవారు,... మీరే అలా తొందరపడితే...

చల ; పెద్దవాణ్ణా ? దేంట్లో ? వయస్సుచేత వచ్చిన పెద్దతనమిది.

రఘు : కాదు. అన్ని విషయాల్లోనూ నాకన్న పెద్దవారే.

చల : ఇప్పుడేగా నువ్వన్నది, నేనేదో పొరపాటు పడ్డానని.

రఘు : మిమ్మల్ని బ్రతిమిలాడుకుంటున్నాను. దయచేసి, ఆవిషయాలు మరిచిపోదాం.

చల : సరే. మరిచిపోతానయ్యా ఆవిషయాన్ని, మరి నేనొచ్చినపని ?—మా అమ్మాయిని గురించిన ఆలోచన...

రఘు : ఆవిషయం మా అన్నగారితో మాట్లాడండి.

చల : నీ పెళ్ళిగురించి మీ అన్నగారితో మాట్లాడాలా ? .. నేను !!! ఏమిటి రఘుపతీ యిది? ఇదేమైనా బొమ్మలాటా?

రఘు : కాదు కాబట్టే నేనూ ఇల్లా మాట్లాడవలసి వస్తున్నది. మా అన్నగారి అనుమతి లేకుండా, మీకేమీ చెప్పలేను ఈవిషయంలో. నన్ను క్షమించండి.

చల : మంచిది నీ మనసు నెందుకు కష్ట పెట్టాలి ? మీ అన్నగార్నే రానీ. వారితో మాట్లాడే, వారి నొప్పించి నీతో సంబంధం కలుపుకుంటాను.

(బయట నుంచి గంగరాజు ప్రవేశం. ఏభైఫై దాటిన మనిషి. జరీ అంచు పట్టుకండువా, తెల్లని ఇస్త్రీ గుడ్డలు, కాళ్ళకు చెప్పులు. చేతిలో వంకి కఱ్ఱ, ఓ హ్యాండ్ బాగ్ ! ప్రయాణంలో నలిగివున్నా, మనిషి మంచి నిండుగా, హుందాగా కన్పిస్తుంటాడు)

రఘు : (ఒక్కసారిగా) అన్నయ్యా !! ఇదేనా అన్నయ్యారావడం ? ఎక్కణ్నుంచి ? హైద్రాబాదు నుంచేనా ? వదినా, పిల్లలూ ఏరీ ? వాళ్ళను తీసుకు రాలేదా? ఎందుకని అన్నయ్యా ఈ సారి ఇల్లా చేశావ్ ?

చల : కొంచెం ఆగు రఘపతీ ! మనిషిని లోపలకు రానీ ! గంగరాజూ కూచో. కూచుని, కొంచెం సేపు విశ్రాంతి తీసుకో. ఎప్పుడు బయల్దేరావో, ఏమో ?!

గంగ : రఘు ! ఈ బ్యాగ్ తీసుకుని లోపలకు వెళ్ళి, నర్సమ్మతో నేనొచ్చినట్లు చెప్పిరా. ఆమె కింకా కళ్ళు కనిపిస్తూనే వున్నాయా ? ఆమేనా వంట చేస్తున్నది ? (రఘు అవునన్నట్లుగా తలవూపి లోపలకు వెళతాడు) ఏం మామయ్యా — కులాసాయేనా ? చాలా రోజులైంది కాదూ నిన్ను చూసి ! కమలకు పెళ్ళి సంబంధం

కుదిరిందా ? (అప్పుడే రఘుపతి లోపల్నుంచి బయటకు వస్తాడు)

చల : ఇంకా లేదురా—ఆ ప్రయత్నంలోనే వున్నాను. ప్చ్. ఏమిటో ! అందని పండుకోసం ఆశపడతాం కాని, చేతిలో వున్నదాన్ని చూసుకోలేం కదా !

గంగ : ఏవిటి మామయ్యా—వేదాంతం మాట్లాడుతున్నావు ? ఎప్పట్నుంచి?

చల : ఆడపిల్లను కన్న తండ్రికి, వేదాంతమే బాబూ, చివరికి మిగిలేది. నీకేం ? బంగారు పిట్టవి ! అడిందల్లా ఆటగా సాగుతుంది. నీకే వో నలుగురు ఆడపిల్లలు పుట్టి...

గంగ : బాబ్బాబు ! నామీద నీకు కోపంవుంటే, ఇంకేవిధంగానైనా తీర్చుకోగాని, దేముణ్ణి మాత్రం ఈ కోరిక తీర్చమని అడగబోకు.

రఘు : అన్నయ్యా ! ఇంతకూ కాఫీ అయినా తాగావా ?

గంగ ; లేదురా. ప్యాసింజరు దిగీ దిగక ముందే, బస్సు సిద్ధంగా వుంది. అదిపోతే మళ్ళీ ఎప్పటి కొస్తుందో నని ఆ బస్సులోనే వచ్చేశాను.

రఘు : అయ్యోయ్యో! కాఫీ అయినా తాగకుండా వచ్చావా? ఉండు. ఇప్పుడే పోయి ఏహోటల్లో నన్నా, తీసుకువస్తాను.

గంగ : ఈ వూళ్ళో హోటళ్ళెక్కడివిరా ?

రఘు : మునుపటి పల్లెటూళ్ళా అన్నయ్యా ఇవి? మనసులు మారడంతోటే, మనుషుల పద్ధతులు కూడా మారుతుంటాయి. (వెళ్ళిపోతాడు)

గంగ : (ప్రేమగా) పిచ్చి వెధవ

చల: గంగరాజూ! పెద్దవాళ్ళం మనం మెచ్చుకో కూడదు కానీ, రఘుపతి మాట్లాడే మాటల్లో ఎంత నిజం వుంటుంటుందో తెలుసా ? వజ్రం కన్నా కఠినంగా, అది మన మనసును కోసేస్తుంటుంది.

గంగ; ఆఁ ! కుట్టుకుంక. వాడికేం తెల్సును ? నల్లనివన్నీ నీళ్ళూ, తెల్లనివన్నీ పాలూ అనుకొనే వయసు. ఏదో చిన్నతనంలోనే ఇంత చదువుకున్నాడు శ్రద్ధగా. ఉద్యోగం చేసుకుంటున్నాడు. అంతే.

చల: నిజమే గంగరాజూ ! నీ మాటల్లోనూ నిజం లేకపోలేదు. అయినా అటువంటి అమాయకుల్నే అందరూ మోసగిస్తుంటారు.

గంగ : ఏమిటి మామయ్యా— ప్రయివేటు చేసిన పూర్వపు బుద్ధి పోనిచ్చుకున్నావుగాదు ! మనుషులం.... ఎదురెదురుగా వున్నాం. నీ మనసులో వున్న అనుమానమేమిటో తీర్చుకోరాదు ?

చల : అనుమానమనికాదు. ఊరంతా చెప్పుకుంటేనే నాకూ తెలిసింది.

గంగ : ఏమని ?

చల : నువ్వు ఆస్తిని ఏలా విభాగించిందీనూ.

గంగ : చాలా ఆశ్చర్యంగా మాట్లాడుతున్నావు. నే నసలు ఆస్తిని విభాగించనేలేదు !

చల : పోనీలే. భాగాలు పంచుకోలేదు. ఊరికనే, సరదాకు, రఘుపతితోటి "ఒరేయ్-నువ్వు ఆ కోట్లో పొలంలో వచ్చే అయివేజు అనుభవించరా - నేను ఈ చెర్లో పొలంలో పండిందే తింటాను" అన్నావు అంతేకదూ ?

గంగ : అందుకు దాఖలా చూపించగలవా ?

చల: నన్ను బుకాయించడం మహామహా శిరస్తాదార్లకూ, జిల్లా జడ్జీలకే చాతకాలేదు. గంగరాజూ ! పిల్లి పాలుతాగుతూ లోకం తన్ను చూడలేదనుకొంటుందట. నిప్పులేకుండా పొగ రాదు.

గంగ : అన్నీ తెలిసినవాడివి. చిన్నప్పటినుంచీ మా కుటుంబంలో ఒకడుగా మెలిగిన వాడివి. అనుభవజ్ఞుడివి. అయినా మాటలు చాలా దూకుడుగా పోనిస్తున్నావు.

చల : అవును. నిజం ఎప్పుడూ నిష్ఠూరంగానే వుంటుంది.

గంగ : ఏమిటి ఆ నిజం ? ఎక్కడుంది ? (గద్గదికంగా) లోకమంటే ఏమిటో తెలియనినాడే తలిదండ్రులు పోయినా, ఎండకూ, వానకూ వోర్చి, నానా గడ్డీ కఱచి, వాడికి చదువు చెప్పించి, ఉద్యోగం ఇప్పించి, నా అంతవాణ్ణి చేసింది నిజంకాదు. ఎవరో, ఏమిటో చెప్పారని అన్నీ తెలిసిన నువ్వే, మా కుటుంబంలో ఒకడుగా కలిసిపోయిన నువ్వే నన్ను చులకనచేసి మాట్లాడుతున్నావు. అయినా ఈ సంగతి నీకు ఎవరు చెప్పారో కాని...

చల : ఎవరో చెబితే నేనూ నమ్మేవాణ్ణికాదు గంగరాజూ ! స్వయానా నీ తమ్ముడే, ఎవరు ? రఘుపతి— నాతో ఈ సంగతి చెప్పేడు.

గంగ : నిజం ?

చల : అబద్ధం చెప్పవలసిన అవసరం లేదు.

గంగ : నా తమ్ముడు, నీ...తో, ఈ సంగతి చెప్పాడా ? (బాగా తగ్గి) నిజమే ! రోజులు మారిపోతున్నాయి. అనుకోకుండానే రఘు నిజాన్ని చెప్పాడు.

చల : ఇప్పటికైనా మించిపోయింది లేదు. ఆస్తిని సమానంగా, న్యాయంగా ఇద్దరూ పంచుకోండి. కుటుంబగౌరవాన్ని నిలబెట్టుకోండి.

గంగ : మళ్ళీ తప్పుదారిన మాట్లాడుతున్నారు. అక్కడికి నేనన్యాయం చేసినట్టు—

చల : అని నేననడంలేదు. ఈసంగతి తెలిసిన ప్రతివాడూ....

గంగ : (కోపంలో) మంచిది. అందర్నీ కట్టకట్టుకు చావమనండి. (గద్గదికంగా) వాళ్ళకేం తెలుసు, వీడికోసం నేనెంత కష్టపడ్డానో?

చల : కష్టపడ్డందుకు ఇది లంచమా?

గంగ : మామయ్యా ! హద్దులు మీరి మాట్లాడుతున్నావ్ ?

చల : ఏమిటయ్యా హద్దులు? చిన్నవాణ్ని చేసి, అన్యాయం చెయ్యడం బావుందేం? అశుభం శుభం తెలియనివాడు రఘుపతి. నీమీద విశ్వాసం వుంచాడు. నిన్ను దేవుడని నమ్మాడు-నాశనమౌతున్నాడు.

గంగ : అని నీతో చెప్పాడా?

చల : చెప్పినట్లయితే ఎప్పుడో బాగుపడేవాడు.

గంగ : చెప్పకపోయినా, బాగుచేయటానికి వచ్చావుగా?

చల : అవును వచ్చాను; రఘుపతిని బాగుచేయటానికి. బాగుచేసి అల్లుణ్ని చేసుకోడానికి, అల్లుణ్ని చేసుకుని మీ అన్నదమ్ములిద్దర్నీ సరిదిద్దటానికి.

గంగ : ఏమిటి?! అల్లుణ్ని చేసుకుంటావా ? రఘుపతిని! నాకు తెలియకుండా? మీ లక్ష్మినిచ్చి!

చల : ఏమీ! లక్ష్మికేంలోపమైంది? బంగారపుబొమ్మ ఇదివరకు నువ్వే, మీ అమ్మకు, చనిపోయే సమయంలో వాగ్దానం చేశావుగా-మన రెండు కుటుంబాలకూ సంబంధం కలుపుతానని? అయినా, రఘుపతి వొప్పుకున్నతర్వాత......

గంగ : వొప్పుకున్నాడా ?

చల : ఆఁ! ఒప్పుకున్నాడు. ఒప్పుకుని, మంచివాడు కాబట్టి, నిన్నుకూడ ఏ టవరుసకు సంప్రదించమన్నాడు.

గంగ : ఇంకా నాప్రస్తావన యెందుకు? మీ ఇద్దరి మధ్యా అడ్డుగా నేనెందుకు ? ఎంత మంచివాడు రఘుపతి!! ఎట్లా మారిపోయాడు?

చల : రఘుపతి మారలేదు. మారలేదు. మారలేదు కాబట్టే, నీ నిర్ణయాన్ని శిరసా వహించాడు: నష్టానికి బాధ్యుడైనాడు.

గంగ : తిరిగి ఆప్రస్తావన తీసుకురాకు చలపతిరావు మామయ్యా. ఎవరిమంచి వారికుంది. ఎవరి బాగులు వారు చూసుకున్నారు.

చల : మంచిది తీసుకురాను మీఆస్తి విషయంలో, బాధ్యతనంతా నీకే వదలి పెడుతున్నాను. ఈ వివాహానికి వొప్పుకుంటావన్న ఆశతో; నాకూ; రఘుపతికి తృప్తిగా వారిని దీవించగలవన్న నమ్మకతో.

గంగ : తృప్తి! హు. ఇంకా నాదీవెన యెందుకు? బ్రతికినా. చచ్చిన వాళ్ళలోనే జమకట్టాడు రఘుపతి నన్ను.

చల : ఛా! ఛా! అంతమాట అనుకోబోకు గంగ రాజూ! ఇంటికి పెద్దవాడివి. అందరిబాధ్యతలూ, శుభాలూ నీవిగా చూసుకోవలసిన వాడివి.

(బయట్నుంచి కుంటి కోటప్ప ప్రవేశం. ఓ కాలు లేదు. మనిషి నల్లగా, మెళ్ళో తాయెత్తుతో మెలికలుబడ్డ మీసాలతో, కండలు తీరిన దండలతో వున్నాడు. బనీను, ధోవతి కట్టుకొన్నాడు)

కుంటి : దండాలు బాబూ !

గంగ : ఎవర్రా నువ్వు ?

కుంటి : కుంటి కోటప్పను.

గంగ : అంటే ?

కుంటి : (చలపతిరావుతో) ఎవరు బాబూ ఈరు ? ఇసిత్రంగా మాట్లాడ్తుండరు ? మన పేరు, తెలీనోరు మాగాణంలో ఉండారంటే, నాకే సిన్నతనంగా వుండది.

చల : లేదులే ; కోటప్పా ! వీరికి నువ్వు తెలీదు. మన రఘుపతి బాబుగారు లేరూ, వారి అన్నగారు వీరు. హైద్రాబాదులో వుద్యోగం చేస్తున్నారు.

కుంటి : అలా సెప్పండి బాబులు ! సూడగానె అనుకున్నా, పట్నందోర్లని. ఆ సూపూ, ఆ సుట్టా, ఓహ్ ! నా రంగసాని, బల్ నీటుగా వుండాది.

గంగ : వీడెవడు ? మర్యాద తెలియని మనిషిలా కన్పిస్తున్నాడు!

కుంటి : ఓ యబ్బో ! సూపు సూడగానే గుండె తిక్కు మంటాది: మరియాద మాకూ తెలుసులే బాబు! గుండెలోని మంచిని సూడవలె, మాటలోని మంచిని కాదు.

గంగ : మర్యాద మండినట్లే వుంది కాని, ఎందుకొచ్చావిక్కడకి ? ఏమిటి అవుసరం ?

చల : మీ చేలో మరమ్మతు చేయించింది వీడేనయ్యా !

గంగ : మా చేలో మరమ్మతా? చాలా ఆశ్చర్యంగా వుంది. ఎవరు చేయించారు ? ఎప్పుడూ ?

కుంటి : అవసరం నేక సీమైనా రాదు. మా డబ్బు మా కిప్పించండి, జే గెల్లిపోతాను.

గంగ : ఎవరియ్యాల్రా డబ్బునీకు ? తెలిసే మాట్లాడు తున్నావా ?

కుంటి : అరే, గిరే, అనకండి బాబులు. మీ మొకాని కందముంటె మీకే వుంటుంది. నా డబ్బునాకు జే గిప్పించండి. ఎల్లిపోతాను.

గంగ : ఏమిటి మామయ్యా ఇది ?

చల : రఘుపతి, నీ చేలో మెరకలు తీయించాడు ?

గంగ : నాకు చెప్పకుండా; పెట్టకుండానా ?

చల : ఏమీ, మీ ఇద్దరన్నదముల మధ్య వున్న సయోధ్య నాకేం తెలుసు ?

గంగ : ఎంతియ్యాల్రా నీకు ?

కుంటి : ఎనిమిదొందలు.

గంగ : ఎ. ని. మి. ది. పం. ద. లు !!!

(ఇదే సమయంలో రఘుపతి కాఫీగ్లాసు పట్టుకు బయట్నుంచి ప్రవేశిస్తాడు. కోటప్పను చూడడు)

రఘు : ఇదిగో నన్నయ్యా కాఫీ !

గంగ : ఏమిట్రా యిదీ ?

రఘు : ఏమిటన్నయ్యా ?

కుంటి : దండాలు దొరకు.

రఘు : ఎప్పుడొచ్చావు కోటప్పా ?

కుంటి : ఎప్పుడో అప్పు డొచ్చినాను. నా డబ్బు నా కిప్పించండి బాబులు. మరియాదలేని మనిసిని.

రఘు : ఆమాట ఎవరన్నారునిన్ను? రేపు ప్రొద్దున రా. పొలానికి వెళ్ళి, కొలతలూ అవీ వేసి, సరిచూసుకుని, నీ డబ్బు నీకు ముద్రశుద్ధిగా ఇచ్చేస్తాను.

కుంటి : అదేం కుదరదు బాబు. అల్లక్కడ యాగీ పెట్టుండరు. డబ్బు రావాల. గంజి తాగాల.

రఘు : అర్ధాంతరంగావచ్చి, డబ్బు తెమ్మంటే, ఇప్పటికిప్పు డెక్కణ్ణుంచి తెచ్చేది కోటప్పా? నువ్వూ మా పరిస్థితి అర్ధంచేసుకోవాలి !

చల : రేపు సరిచేస్తానంటున్నాడు కదూ కోటప్పా. ఇంకా ఎందుకు యాగీ చేస్తావు ? వెళ్ళిరా.

కుంటి : ఏంది బాబు? మీరు గూడ అలాగంటారు. మా పిల్లాజెల్లా బతకనవసరం నేదు ? రేపటి దాక ఏంతాగాల ? పోనీ కొంత అడవాన్సుగా ఇప్పించండి.

చల ; పోనీ అలా చెయ్ రఘుపతీ !

రఘు : (మెల్లగా) నా దగ్గర ప్రస్తుతానికేమీ లేదండి.(ప్రకాశముగా) రేపుపొద్దునరావయ్యా ఇచ్చేస్తాను. నువు మొండికెత్తినా ఇప్పుడేమీ లాభంలేదు.

గంగ : అసలు ముందూ వెనకా ఆలోచించకుండా ఎందుకీ పని చేయించావ్రా నువ్వు?

కుంటి : ఏంది సినబాబు, తెలిసినోరు, సదువు కున్నోరు, మీరూ అట్టానే మాట్టాడారు ?

రఘు : ఏం చెయ్యానుకోటప్పా-పరిస్థితిఅలావచ్చింది.

గంగ : ఆఁ! ఆఁ! వస్తుంటుంది. వస్తుంటుంది. ఎందుకురాదూ ? చేతులు కాల్చుకుని ఆకులు పట్టుకుంటుంటే ! (మహేంద్రం పరుగెత్తు కుంటూ వస్తాడు)

మహే : నూసారా సినదొరా-సెప్తే ఇన్నారు కాదు ! ఎంతగోరం, ఎంత అన్యాయం జరిగి పోతుందో ? రక్తం ఉడుకెత్తి పోద్ది.

రఘు : ఏమిటి ? ఏం జరిగింది ?

మహే : బోగం యెదవ నా పెళ్ళానికి కనుగీటి నాడంట.

(అంకమ్మ గూడా ఆదరా బాదరా వస్తాడు)

అంక : రగుపతి బాబు ! రగుపతిబాబు ! ఇన్నారా ఈ అన్యాయం ?.... ఇన్నారా ? దేముడు సమించడు. తేషుడికి కళ్ళుండాయి.

రఘు : ఏమిటి ? ఏమైంది ?

అంక : కాటిలో కాళ్ళు పెట్టినాను. కూసుంటే లేవలేను. నేను కనుగీటానంట. నన్ను తన్న డాని కొచ్చినోడు. ఎవడు సెబుతు ? నాయ మెక్కడ ?

మహే : దొంగనక్క ! వగలు పోతుండాడు ? కత్తికి కండేత్తాను.

రఘు : తొందరపడకు మహేంద్రం! ఎవరుచెప్పారు నీకీ సంగతి ?

మహే ; నా యీరాం.

రఘు : వీరాం ? అదే మీ యిద్దరి కుటుంబాల మధ్యా కలతలకు కారణమౌతున్నది. వీరాం లాంటి వాళ్ళు చాలా మంది వున్నారు ఈ పల్లెటూళ్ళలో. ఒక్క విషయం చూడు మహేంద్రం. నుంచుంటే లేవలేడు అంకమ్మ. కళ్ళు సరిగా కనపడవు. అటువంటివాడు ఇటు వంటి పని చేస్తాడంటే నమ్మగలమా మనం? ఏం కోటప్పా అంతేనంటావా ?

కుంటి : పోరా మయేంద్రం, పోయి, నీ ఆడదానికి బుద్ధిసెప్పుకో పో. ఈ ముసిలోడు అటువంటి పని సెయ్యడు.

రఘు : నువ్వూ వెళ్ళిరా; కోటప్పా, రేప్పొద్దున తప్పకుండా యిస్తాను. నామాటనమ్ము.

కుంటి : (కొంచెం ఆలోచించి) సదువుకున్నవోరని, సిన్నబుచ్చక ఎల్తుండాను. సూర్యుడు పొడిసే యేలకువొచ్చి కూసుంటాను. ఎవ్వారం సరి సేయండి బాబు. దండాలు. (వెళ్ళిపోతాడు)

రఘు : (గంగరాజు కాఫీ తాగకపోవడం చూచి) ఇంకా కాఫీతాగలేదా అన్నయ్యా, చల్లారి పోతున్నట్లుంది.

గంగ : కడుపు నిండిపోయింది, ఇంకా కాఫీకూడా యెందుకు?

రఘు : ఏమిటన్నయ్యా! నేనేం తప్పుపని చేశానూ!

గంగ : ఎవడో హీనుడికి ఎందుకురా లోకువ కావడం ? అసలు, ఈమరమ్మతు ఎవరు

చేయించమన్నారు? అందులో కాస్తా. కూస్తా కాదు. ఎనిమిదివందల రూపాయలు!! ఎవ రిస్తారు డబ్బు? చెట్టుకు కాస్తున్నదటరా?

రఘు : అదేమి టన్నయ్యా అలా మాట్లాడుతున్నావ్? ప్రతిసంవత్సరం, మరమ్మతు చేయించంది, చేలు ఏం బాగుపడుతాయి? మనకు అవేం పంటనిస్తాయి? ఈసంవత్సరం మీరు రావడం ఆలస్యమయిందాయె! ఋతువుకాని ఋతువులో చేలో పని చేయించడం అంతమంచికి కాదాయె!

గంగ : ఒహో! అలాగా? పెద్ద వ్యవహర్తవై, అన్నీ చూస్తున్నావన్నమాట!

రఘు : అని నే చెప్పలేదు.

గంగ : అందుకు తగిన ప్రతిఫలంకూడా నువ్వే అనుభవించు. నాపెద్దరికం ఏనాడు పోయిందో ఆనాడే, నాకు, బాధ్యతా తీరిపోయింది.

రఘు : నిన్ను కాదని నేనేం చేసానన్నయ్యా? ఎన్నడూ లేనిది, ఈనాడు ఇంత కఠినంగా మాట్లాడుతున్నావు?

గంగ ; అవును నేను కఠినంగా మాట్లాడుతున్నాను, హృదయంలో ఏమీ దాచుకోలేక. కానీ నువ్వు? హృదయంలో కపటముంచుకుని, పైకి తేనెలు కురిపిస్తున్నావు.

చల : గంగరాజూ! చిన్నవాణ్ని పట్టుకుని, అంత లేసి మాటలనడం, నీకు భావ్యం కాదు. జరిగిందేదో జరిగింది. ఇహ. ఎవరి బ్రతుకులు వారు బ్రతకండి.

రఘు : అర్థమైందన్నయ్యా. ఇదంత ఎవరిమూలాన జరిగిందో బాగా అర్థమైంది. ఏం చలపతిరావు మామయ్యా? నీప్రభావం మా మీదకూడా చూపించావా? ఈశల్య సారథ్యం, ఎప్పట్నుంచి?

గంగ : ఒరేయ్! చిన్నా పెద్దా తారతమ్యం తెలుసుకు మాట్లాడాల్రా?

చల : శల్య సారథ్యమా?

రఘు : ఆ. పూర్తిగా తెలుసుకునే, తెలివివుండే మాట్లాడుతున్నాను. క్షణం క్రితం వరకూ, నాతో నవ్వుతూ మాట్లాడిన మా అన్నయ్య ఇంతలోకి ఎందుకు ఇంతగా మారిపొయ్యాడు? ఎవరో, ఏమిటో చెప్పివుండాలి వారికి! ఎవరు చెప్పివుంటారు? ఏం చెప్పివుంటారు? ఎవరున్నారిక్కడ? నువుతప్ప!!

అంక : నిజమే బాబూ! నోరు మాట్టాడ్తుంటే, నొసలు ఎక్కిరిత్తుంటుందారికి.

మహే : నువ్వూరుకోరా. ముసలినక్కా! పెద్దోరి మద్దెన నీకెందుకు?

చల : అదేమిటి మహేంద్రం అలా అంటావూ? అతగాణ్ని మాట్లాడనీ. రఘుపతిబాబు కాప్తు డాయె! ఎక్కువపొలం చేస్తూ, తక్కువ మక్తా యిస్తున్నవాడాయె!

మహే : నిజం సెప్పినారు చలపతిరావు బాబుగోరు. దొంగనాయాలు! ఎకరానికి పన్నెండంకాల కౌలు కొలుత్తుండాడు!

గంగ : ఏమిటీ! పన్నెండంకాల కౌలా ఎకరానికి? నిజమేనా రఘూ?

రఘు : నిజమే నన్నయ్యా.

గంగ : ఎందుకని?

అంక : భూమంత మంచిదికాదు బాబు. కాలవ లేదు. బంగారమే త్తే; ఎండవుద్ది.

మహే : పోరా. బక్కసిక్కినాడివి అబద్దాలెందుకూ్కత్తావు? పెద్దోరా! ఎకరానికి ఇరవై బత్తాలు పండుతున్నాయాడికి.

చల : నిజమేనా?

గంగ : వీళ్ళు నిజం చెబుతారూ? అదేమిటంటే, గాదెకింది పందికొక్కు మరెక్కడ తింటుంది బాబూ అంటారు. వీళ్ళ రోగం ఇల్లాకాదు.

మహే : నేను ఎకరానికి పన్నెండు బత్తాలిత్తాను బాబు. నా కౌ్కలు రాయండి.

గంగ : ఒక షరతుమీద.

మహే : ఏంటి బాబు?

గంగ : పన్నెండు బస్తాలు కదూ కౌలు. బస్తా ఇరవై రూపాయల చొప్పున ఎకరానికి ఎంత ? రెండువందల నలభై రూపాయలు. అవునా ? పది ఎకరాలకు ? రెండువేల నాలుగువందలు. అయిందా ?—ఆ మొత్తం, నువ్వు మా దగ్గర బాకీగా పుచ్చుకున్నట్టు నోటు రాసివ్వాలి. నీ కిష్టమేనా ?

మహే : ఇదేంది బాబూ—సిత్రంగా వుందది !

గంగ : ఆఁ. ఆఁ. వుండదూ ? రేపు గవర్నమెంటు చట్టం పెట్టిందని. కౌలుదారుకు మూడు వొంతులూ, భూస్వామికి ఒక వంతూ రావా లంటూ, జబ్బలు చరుచు కొందురు గాని.

మహే : మా పేణం పోయినా అలా సేయంబాబు!

గంగ : ఏమీ ? మీ నిజాయితీ మీద మేము నమ్మక ముంచాలీ ? మా నిజాయితీ మీద మీరు నమ్మక ముంచరాదేం ? నీ కిష్టమైతే, ఆ కాడికి కౌలు రాసి, భూమి తీసుకో. లేకపోతే నీ దారిన నువ్వెళ్ళు.

అంక : దయిర్యం సేయరా. బాబుల మాటమీద నమ్మకముంచు.

మహే : పోరా. ముసిలోడ! నోటు రాసి, బిచ్చ మెత్తుకోనంట! ఊరి, భూమి లేకపోతేమానె—కూలిసేసుక బతుకుతాను. దండం బాబులు మీకూ, మీ బూమికీ వో దండం. రఘుపతి బాబు— ఆ కోటప్పగాడికి తప్పక సర్దండి రేపుప్రొద్దున మానం నిలువనీడు. దండంబాబులు (వెళ్ళిపోతాడు)

చల : ఏం అంకమ్మా— నువ్వు ?

అంక : ఆయాల్నుంచీ ఈ బాబుల్నే నమ్మినాను, నమ్మినోడికి సెరుపులేదు. నా కిట్టమే బాబు.

రఘు : అంకమ్మా !

అంక : పెద్దొరగారి ఇష్టంపెకారమే పోదాం సిన దొరా. పొంగినసేనే పండుద్ది !!

గంగ : సరే. అయితే వెళ్ళి సాహుల్ని పిల్చుకురా. పని పూర్తి చేసుకుందాం.

అంక : అట్టాగే బాబూ! (వెళ్ళిపోతాడు)

మహే : ఏమిటన్నయ్యా ఇది?

గంగ : వ్యవహారంలో మనుషుల నిజాయితీమీద ఎప్పుడూ నమ్మకముంచకూడదు. అన్నివిధాలా వాడి ఆయువు మన గుప్పిట్లో వుండాలి.

రఘు : కానీ, నాకిది యిష్టంలేదు.

గంగ : ఇష్టమున్నా లేకపోయినా, నే చెప్పినట్లు చేయడం నీకు మంచిది. ఆతర్వాత నీయిష్టం.

చల : పెద్దవాళ్ళ మాటలు విను రఘుపతీ!

రఘు : పెద్దవాళ్ళు! హు! డబ్బుదగ్గర అందరూ చిన్నవాళ్ళే !!

గంగ : అనరా. ఇంకా ఎన్నిమాటలైనా అను. నీ అవసరం తీరిందిగా. పెద్దవాన్ని, ఉన్నా లేకుండానే చేసుకున్నావు. నీ ఇష్టమొచ్చినట్లు ప్రవర్తిస్తున్నావు. చలపతిరావు మామయ్యా పద. మీ యింటికే పోదాం పద. వాడు నన్ను కాదని ఎంతదూరం పోయినా, నాకు వాడు తమ్ముడు వాడి శుభాన్నే నేను కోరేది.

రఘు : అక్కడికెందు కన్నయ్యా ?

గంగ : పెళ్ళికిరా ! పెళ్ళికి !

రఘు : చివరకు నువుకూడా నన్ను అర్థం చేసుకోకుండా వున్నావా అన్నయ్యా! చలపతిరావు మామయ్య పన్నిన వలలో నువ్వూ పడ్డావా!

చల : పద గంగరాజూ! వాడు చిన్నవాడు ఉడుకు రక్తం తప్ప ఆలోచన లేదు పద. (రఘుపతితో) రఘూ! ఇప్పుడు నేనేంచేసినా, నీదృష్టిలో మరింత చెడ్డవాన్ని కావడం తప్ప మరేమీలేదు. కానీ ఒకనాటికైనా తెలుసుకోకపోవు; ఇలా ఎందుకు ప్రవర్తించానో ఆలోచించు. ఆలోచించి ఒక నిర్ణయానికి రా. జీవితమనేది ఒక రంగుల పడవవంటిది. గుర్తుంచుకో. పద గంగ రాజూ!

రఘు : (అవనత వదనుడై) అన్నయ్యా! నా మాట విను అన్నయ్యా! నాకీపెళ్ళి యిష్టం లేదు.

గంగ : మాట అని తప్పడం మనవంశంలో లేదు రఘూ ! పద మామయ్యా !

చల : పద రాజూ !

రఘు : అన్నయ్యా !

(గంగరాజు, చలపతిరావు యిన్పించుకోకుండా వెళ్ళిపోతారు. రఘుపతి వంటరిగా నిలబడి వాళ్ళ కేసి చూస్తుంటాడు. అంకమ్మ త్వరత్వరగా వస్తూ)

అంక : సిన్నదొరా ! పెద్దదొరగారేరీ ?

రఘు : అరుగో ! చలపతిరావు గారింటికి వెళ్తున్నారు.

అంక : అలాగా ! వత్తానుబాబు. కౌలు రాయించుకుని తిరిగొత్తాను. మీరూరండి బాబు అక్కడికి. (వెళ్ళిపోతాడు)

రఘు : ఎంతగా మారిపోయింది లోకం ! చివరకు నువ్వూ అక్కడికే వెళ్తున్నావా అంకమ్మా ? మంచిది వెళ్లు. ఆ సాలెగూటిలోనే చిక్కుకో. పాపమూ, మోసమూ, దౌష్ట్యమూ, అన్యాయమూ, ఆకర్షవంతంగా కనిపించినంతకాలం అక్కడే వుండు. నువ్వూ, నేనూ అందరమూ నాశనమౌతున్న విలువలకు బానిసలమేలే, వెళ్ళు. అక్కడికే వెళ్ళు...

(తెర)

సి. ఎస్. ఆర్. ఆంజనేయులు

# భార్గవీగీత

శ్రీ భృగువాస రావసర చిన్మయదీప మహో మరీచికా
వైభవ బంధు మిత్రజన బంధుర మందిర హాస వీచికా
శోభితవర్ణసంగ్రథిత సుందరపుష్ప సుగంధి మాలికా
ప్రాభవ పూర్ణతా ప్రథిత రమ్య సమున్నత హర్మ్యదోలికా.

ఫుల్లనవోత్పలాంబురుహ పూర్ణసరోవర సీమలందు, చం
చ ల్లలితామ్ర నింబ తరుషండ వనాంతర భూములందు సం
పల్లవ కింశుకాగురు సుమార్గములందు, సుగంధి పుష్ప సం
వేల్లిత మల్లికా వకుళవీధుల రావె వసంత లక్ష్మివై.

స్ఫుర దురు చంద్రకాంత పరిశుభ్ర విచిత్ర మహాభ్రచుంబి గో
పురయుత దేవతాయతన భూమి, మదీయ హృదంతరమ్ములో
స్థిర జపనిష్ఠతోడుత ప్రతిష్ఠ బొనర్తునుగాక; రావె ల
క్ష్మి! రుచిర కల్పనోజ్జ్వల సమీకృత శిల్పకళా శిలాకృతీ!

చలువల జాలి చల్లి, యెదచాలుల మంచితలంపు విత్తులన్
పలుచగ నారుచల్లి నవపంకజ చంపక మల్లికా సుమ
మ్ములు సురభించిపోవ కనుముక్కు సొబంగులమోము ము త్తెము
ల్జలజలరాల్చి, మా పెరటిచాయల హాయివెలార్చి నవ్వవే.

కలధౌతాచల ధౌత భద్రగజయుగ్మ ప్రౌఢ శుండాగతో
జ్జ్వల సౌవర్ణక పూర్ణకుంభములు స్వచ్ఛ స్వర్గ సింధూదక
మ్ములతో ధారలు కట్టెలే! సుకవితా పూరమ్ములట్టె; సరో
లలితా! రావె మదేభయాన! ద్యుతివై, ప్రాభాతికస్నాతవై.

# శ్రీనాథుడు - పల్నాటి వీరచరిత్ర

కొర్లపాటి శ్రీరామమూర్తి

ఆంధ్రపత్రిక ఆదివారం (మార్చి 1' 59) సంచికలో "తెలుగు జానపదగేయసాహిత్యం" అనే ఒక సమీక్షా వ్యాసం వెలువడింది.

(1) "పలనాటి వీరచరిత్రము శ్రీనాథుడు ప్రజాముఖమున వినియుండి తన చరమదశయం దీ వీరచరిత్రమును గేయకావ్యముగా వ్రాసియుండెనని భావించవచ్చును" అని డాక్టర్ బి. రామరాజుగారి ప్రతిపాదన. దానికి సమీక్షకుల ఆక్షేపణ ఇది. "శ్రీనాథుని చరమదశలో ఇది రచితమైతే తక్కిన రచనలలోని ప్రౌఢిమ ఏదీ" అని.

మరి, శ్రీనాథుడు శృంగారనైషధం తరువాత హరవిలాసం వ్రాశాడని కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సిద్ధాంతీకరించారు గదా! శృంగార నైషధంలోని ప్రౌఢిమ హరవిలాసంలో ఏదీ? అదలావుంచి శ్రీనాథుని శివరాత్రి మాహాత్మ్యం శాసనప్రమాణంచేత శ్రీనాథుని చరమదశలోని గ్రంథమని స్పష్టం. నైషధ, భీమఖండ, కాశీఖండాలలోని ప్రౌఢిమ శివరాత్రిమాహాత్మ్యంలో ఏదీ?

కాక నైషధాదులు ప్రౌఢ కావ్యప్రబంధాలు. పల్నాటి వీరచరిత్ర జానపద ద్విపదకావ్యం. ప్రౌఢ ప్రబంధాల్లోని ప్రౌఢిమ ద్విపదకావ్యంలో ఎలా వుంటుందీ? పల్నాటి వీరచరిత్ర "ద్విపదప్రబంధం" అని వుందిగనుక అది ప్రౌఢప్రబంధం కావాలని సమీక్షకుల అభిప్రాయం కాబోలు. ఆనాడు ప్రబంధమంటే ఈనాడు అనుకొనే ప్రబంధం కాదు. ఈనాటి ప్రబంధశబ్దం ప్రక్రియావాచి. ఆనాటి ప్రబంధశబ్దం గ్రంథసామాన్యవాచి. అంటే నేటి ప్రబంధశబ్దం విశేషవాచి. నాటిప్రబంధం సామాన్యవాచి. ఇందుకు శాసనప్రమాణం, శాస్త్రప్రమాణం అలావుంచి శ్రీనాథుని ప్రమాణమే పుష్కలంగా వుంది. కావ్యమైన నైషధాన్ని ప్రబంధమన్నాడు. పురాణమైన పద్మపురాణాన్ని, భీమేశ్వర పురాణాన్ని, 'స్కాందపురాణాంతర్గత' కాశీఖండాన్ని ప్రబంధమన్నాడు. (శృం. నై. ప్ర. ఆ. 8.9.15.45. భీమఖండము ప్ర. ఆ. 10. 30. 44. 87. కాశీఖండము ప్ర. ఆ. 9. 13. 16. 18.) కనుక ప్రబంధకావ్యశబ్దాలు సామాన్యవాచులుగ స్పష్టం. ద్విపద ప్రబంధమంటే ద్విపదకావ్యమని, ద్విపద గ్రంథమని స్పష్టం. ద్విపదగ్రంథాల్లో ప్రౌఢిమ ప్రకృతి విరుద్ధం.

(2) 'ఇంతకూ ఈ శ్రీనాథుడు వైష్ణవుడు' అని సమీక్షకుల అపూర్వసిద్ధాంతం. పల్నాటివీరచరిత్ర వ్రాసిన శ్రీనాథుడు వైష్ణవుడా? అలాగని ఏతాళపత్రగ్రంథంలో వుంది? అచ్చుపడిన పల్నాటి వీరచరిత్రలోని శ్రీనాథుడు

"భారద్వాజ వంశవర్ధనుడ
కవిసార్వభౌముడ ఘనతగన్నట్టి
శ్రీనాథుడనువాడ శివభక్తిపరుడ."

అన్నమాటలు అది ప్రకటించిన ఉమాకాంత పండితులు సృష్టించారనా? పల్నాటి వీరచరిత్ర వ్రాసిన శ్రీనాథుడు శివభక్తిపరు డన్నది స్పష్టం. ఇంతకూ పల్నాటి వీరచరిత్రలో వైష్ణవసంబంధి వ్యాపారంవుంది గనక పల్నాటి వీరచరిత్రవ్రాసిన శ్రీనాథుడు వైష్ణవుడు అని సమీక్షకుల అభిప్రాయం కాబోలు. అయితే భీమఖండం వ్రాసిన శ్రీనాథుడూ వైష్ణవుడే. శ్రీనాథుడు భీమఖండం ఇష్టదేవతా స్తుతిలో రాధామాధవ స్తవం చేశాడు. కాశీఖండంలోని తృతీయాశ్వాసంలోని ఇరవై

రెండవ పద్యంలో శ్రీనాథుడు విష్ణువును వర్ణిం చాడు. అందుచేత ఈ పద్యకర్తయైన శ్రీనాథుడు కూడా వైష్ణవుడేకదా. పల్నాటి వీరచరిత్ర వ్రాసిన శ్రీనాథుడే వైష్ణవుడనే ప్రతిపాదన ఏల? అసలు శ్రీనాథుడే వైష్ణవుడనవచ్చును. ఇంతకూ శ్రీనాథుడు 'ఈశ్వరార్చనకళాశీలి', 'శివభక్తి పరుడు' అంతేకాని వీరశైవుడు కాదు. వీరవైష్ణవుడూ కాదు. శివపరమైన కావ్యాల్లో వైష్ణవ ప్రశంస చేశాడు. 'శంభుదాస లక్షణాభిధేయం' కల ఎఱ్ఱాప్రెగడ హరివంశ నృసింహ పురాణాదులు వ్రాయలేదూ? అట్లే శ్రీనాథుడు పల్నాటి వీర చరిత్ర వ్రాస్తాడు. అందుకు శ్రీనాథుడు వైష్ణవుడు కానక్కరలేదు.

శ్రీనాథుడు మరే పుస్తకమైనా విష్ణువు కిచ్చాడా? అని సమీక్షకుల అవాంతరప్రశ్న.

శ్రీనాథుడు అసలే పుస్తకమైనా శివుని కిచ్చాడా? ఆ ప్రశ్న కిది సముచితమైన ఎదురుప్రశ్న.

శ్రీనాథుని ఉపలబ్ధగ్రంథాలన్నీ మనుష్యుల కివ్వబడినవే. శివుడికి ఇవ్వలేదు. చివరిరోజుల్లో విష్ణువుకి ఇచ్చాడు. ఇవ్వడంతప్పా? విష్ణువుకి ఒగ్రంథం ఇచ్చిందిచాలక మరోగ్రంథం ఎందుకు? అసలే గ్రంథం శివుడికి ఇవ్వలేదుకదా! కనుక సమీక్షకుల ప్రశ్న వ్యర్థప్రశ్న.

(3) "క్రీడాభిరామం వల్లభరాయడు వ్రాసిం దనుకొన్నా వల్లభరాయనికాలం 1380-1480. శ్రీనాథుడు 1365-1445 లో ఉన్నాడంటారు."

'వల్లభరాయడు వ్రాసిందనుకొన్నా' ఏమిటి? వల్లభరాయడు వ్రాసిందే. వేటూరి ప్రభాకరశాస్త్రి గారి స్వయంపాకం లేకపోతే. వల్లభరాయని కాలమూ '1380-1480' కాదు.

చారిత్రకదృష్టితో పరిశీలిస్తే వల్లభరాయడు 1480 లో పుట్టడమే అసంభవం. శ్రీనాథుడు ఉన్న కాలం 1360-1448 ప్రాంతం, ఇది సర్వపూర్వవాద సమ్యక్పరిశీలనాధిక నూతన విశేష సమన్వయ ఫల స్వామ్యం. కనుక సమీక్షకుల కాలనిర్ణయం సరి కాదు. అసలు వల్లభామాత్యుడు 1480 నాటికి పుట్టడమే అసంభవం గనక శ్రీనాథుని పల్నాటి వీరచరిత్ర ప్రసక్తి క్రీడాభిరామంలో కాహాటంగా వుండడం సుసంభవం. అందువలన పల్నాటి వీర చరిత్రగురించి రామరాజుగారిప్రతిపాదన సమంజసం.

(4) త్రిపురాంతకునికాలం 1295-13251

ఇది మరి ఇతః పూర్వనిర్ణయమేకాని ఇతోధికంగా అవిచారితము. త్రిపురాంతకునికాలం 1295-1325 అనడానికికల ఆధారమల్లా ప్రతాపచరిత్ర-ప్రతాప చరిత్ర కట్టుకథలపుట్ట. అంతేకాదు. పరమా ర్వాచీనగ్రంథం అని పరిశీలిస్తే స్వయంవేద్యమానం. అయినా "ప్రతాపచరిత్ర" ఎఱ్ఱాప్రెగ్గడ యుగానికి సంబంధించినది" అని ఆంధ్రవచన వాఙ్మయం అను గ్రంథరాజంలో నిడుదవోలు వేంకటరావుగారి నిర్ణయం.

ఎఱ్ఱాప్రెగ్గడ యుగానికి సంబంధించినది అని నిడుదవోలువారు నిర్ణయించిన ప్రతాపచరిత్రలో రామాయణం వ్రాసిన మొల్లప్రసక్తి ఉంది. విజయనగర సామ్రాజ్యానికి సంబంధించిన వీర నరసింహరాయలూ ఉన్నాడు. మొల్ల రామా యణం పూర్వకవి స్తుతిలో శ్రీనాథుడు ప్రత్య క్షంగా ఉన్నాడు. 'చెప్పుమని రామచంద్రుడు' అనే పద్యంలో పోతన పరోక్షంగా ఉన్నాడు. మటి మొల్ల ప్రసంగంవున్న ప్రతాపచరిత్ర ఎఱ్ఱాప్రెగ్గడ యుగానికి సంబంధించింది ఎలా అవుతుంది? పరమార్వాచీనకాలికమూ, పరమాద్భుత కథా రమణీయమూ అయిన ప్రతాప చరిత్రనుబట్టి త్రిపు రాంతకుని కాలనిర్ణయం అప్రామాణికం. కాక చారిత్రక విషయంకల చాటువునుబట్టి త్రిపురాంత కుడు 1380 ప్రాంతమని మల్లంపల్లి సోమశేఖర శర్మగారు ఎప్పుడో నిర్ణయం చేశారు.

5. "ద్విపద సోమనాథోపజ్ఞం"

కాదు.బుద్ధారెడ్డ్యుపజ్ఞం. కారణంవక్ష్యమాణం. "అతనికాలం 1160-1250 అని నమ్మాను"

ఎలా నమ్మారు? పాల్కురికి సోమనాథుడు మొదటి ప్రతాపరుద్రుని కాలంలోని వాడని ఒక వాదం. కాదు రెండవ ప్రతాపరుద్రుని కాలంలోని వాడని మరో వాదం. ఉత్తరోత్తరం బలీయం అని గాక ఉపపత్తులనుబట్టి మొదటివాదంకంటె రెండవది బలీయం. పద్యబసవపురాణకర్త పిడపర్తి బసవన డోకిపట్టు అగ్రహార దానం అపరిహార్యం. అది ఒక్కసారి అగ్రహారంకాదు. రెండుసార్లు అగ్రహారం. మొదట ప్రతాపరుద్రుడు, తరువాత ప్రౌఢదేవరాయలూ దానమిచ్చిన అగ్రహారం. ప్రతాపరుద్రులు ఇద్దరూ ప్రౌఢదేవరాయళ్లు ముగ్గురు నలుగురూ కనుక ఆ యిద్దరుకూడా అనవసరం. మొదట అగ్రహార దానానికి కారణం పాల్కురికి సోమనాథుని శిష్యుడైన ఇందులూరి అన్నయమంత్రి. అన్నయమంత్రి రుద్రమదేవి అల్లుడు. అన్నయమంత్రి శాసనాలు పదమూడవ శతాబ్ది పరార్ధంలోనూ ఉన్నాయి. 1280-1320 మధ్యకాలం అన్నయమంత్రి ప్రాభవకాలం. డోకిపట్టు దానశాసనం అనుపలబ్ధం కనుక పూర్వపక్షానికే అనుగుణంగా ఆ దానకాలం 1290 ప్రాంతం అనుకున్నా పాల్కురికి సోమనాథుడు అప్పటివరకూ జీవించి ఉండాలి. ఉండాలంటే 1200 ప్రాంతంలో పుట్టాలి. మరి 1200 లో పుట్టి 1290 లో దానం ఇప్పించి పరమపదించినట్లు పద్య బసవపురాణకర్త చెప్పలేదుకనుక పాల్కురికి సోమనాథునికాలం 1220-1300 అవుతుంది.

అంటే ప్రసిద్ధమైన రెండవ వాదాన్ని కాదంటే. మరి డోకిపట్టుదానమే అబద్ధమంటే మూలచ్ఛేదమే. ఇచ్చిన అగ్రహారం ఇవ్వలేదని చెప్పుకునే ప్రబుద్ధుడు ఉండవచ్చు కాని ఇవ్వని అగ్రహారం ఇచ్చినట్లు చెప్పుకునే వెర్రివెంగళప్ప ఉండడు. పాల్కురికి సోమనాథుని బసవపురాణం పద్య ప్రబంధం చేసిన పిడపర్తి బసవన అలాంటి వెర్రివెంగళప్ప కాదు. కాక వ్రాసిన ప్రతి శాసనం ఉపలబ్ధం కాదు. ఉపలబ్ధమైన శాసనం ఆ శాసనంలో ఉన్న విషయాని ప్రమాణం కాని ఆ శాసనంలో లేని విషయానికి ప్రమాణం కాదు. కనుక డోకిపట్టుదానం కాదనడం నిరుపపత్తికమేగాక నిలువు దోపిడే. కనుక సర్వార్థ సాధకంగా, ఉభయకుశలోపరిగ పాల్కురికి సోమనాథుని కాలం 1220-1300. సమీక్షకుల రావిపాటి త్రిపురాంతకుని కాలం అలా తప్పు. పాల్కురికి సోమనాథుని కాలం ఇలా తప్పు.

6. "అంతకు ముందే తమిళులలోను, కన్నడంలోను రెండేసి పాదాలున్న ఛందస్సు గుర్తించి అలాంటిది సృష్టిద్దామని (తరువోజ పాదాలు విరిచి చేశాడనుకుందాం) బసవేశ్వరుని రెండు చరణ కమలాల లాగ రెండు పాదాల దేశిచ్ఛందస్సు సృష్టించాడు."

క్రీ.శ. 848 ప్రాంతంలోని శాసనంలో వున్న తరువోజ[1], పాల్కురికి సోమనాథుని తప్పుడు కాలంలో ద్విపద అయితే, మరి క్రీ.శ. 1605 ప్రాంతంలోని శాసనంలో వున్న పెద్ద సీసమాలిక[2] క్రీ.శ. 1075 ప్రాంతంలోని శాసనంలో వున్న చిన్న సీసమాలికాను[3], క్రీ.శ. 1065 ప్రాంతంలోని శాసనంలో వున్న సీసపద్యమూను[4] అవుతుందా?, అది మరి ఛందఃక్రమ వికాసమా? క్రమ వినాశమా? ఉత్పలమాల నుంచి అల్లసాని పెద్దన, రామరాజభూషణుల మాలికలు ఉద్భవించాయా? లేక ఆ మాలికల్ని "విరిచి"తే ఉత్పలమాలలు ఉద్భవించాయా? నాలుగు పాదాల వృత్తం పద్నాలుగు రెండ్ల పాదాల మాలిక అయినట్టే, రెండు పాదాల ద్విపద నాలుగు పాదాల తరువోజ అవుతుంది. అంతేకాని, నాలుగు పాదాల జంతువులోంచి రెండు పాదాల మనిషిలా మధ్యకాలంలో నాలుగు పాదాల తరువోజ నుంచి రెండు పాదాల ద్విపద

1. శాసన పద్యమంజరి పుట 1. 2. శా. ప. మం పుట 108. 3. శా. ప. మం పుట 5. 4. శా. ప. మం పుట 4.

పుట్టుకురాదు. ఉపలబ్ధ శాసనాల్లో ఉండకపోవచ్చు. వ్రాసిన ప్రతి శాసనం ఉపలబ్ధం కాదు. ఇంతకూ ద్విపద నుంచి తరువోజ ఛందః క్రమ వికాసం. తరువోజ నుంచి ద్విపద ఛందః క్రమ వినాశం. అంచేత పాల్కురికి సోమనాథుడు తరువోజని "విరిచి" ద్విపదను చేయవలసిన అవసరంలేదు.

పాల్కురికి సోమనాథుని కాలం 1220 - 1300. బసవ పురాణ రచనా కాలం 1250 ప్రాంతం. రామాయణ రచనా కాలం 1240 ప్రాంతమని సమీక్షకుల గారి అభిప్రాయమే. కాని అంతకంటె పూర్వం. 1200 ప్రాంతమే. పాల్కురికి సోమనాథుని కంటె గోన బుద్ధారెడ్డి పూర్వుడు. గోన బుద్ధారెడ్డి తర్వాత పాల్కురికి సోమనాథుడు కనుక ద్విపద బుద్ధారెడ్డ్యుపజ్ఞం. కాని ద్విపద అంతఃపూర్వ చ్ఛందస్సు. కాని ద్విపదకావ్యం అనితఃపూర్వం. కనుక ద్విపదకావ్యం బుద్ధారెడ్డ్యుపజ్ఞం.

7. తర్వాత రంగనాథుడు ఆ ఫక్కిలోనే రామాయణం రచించాడు. "దీని రచనా కాలం 1240." తర్వాత కాదు, ముందు. రంగనాథుడు కాదు, బుద్ధారెడ్డి. రామాయణం రంగనాథుడు రచిస్తే దాని కాలం 1240 కాదు. కల్పితమైన రంగనాథుడు కల్పితమైన ప్రతాప చరిత్రను బట్టి రెండవ ప్రతాపరుద్రుని కాలంలోనివాడు. కల్పితానికి కల్పితమే ప్రమాణం. నిజానికి నిజమే ప్రమాణం నిన్న గాక మొన్నటి భారతి పత్రికలోనే (ఫిబ్రవరి) ప్రకటించిన "కాకతీయుల నాటి శాసన కవులు" వ్యాసంలోని వర్ధమానపుర శాసనం బట్టి గోన బుద్ధారెడ్డి కాలం 1200 ప్రాంతమని గ్రహింపవచ్చును కదా! 1200 ప్రాంతంలో బుద్ధారెడ్డి రచించినట్టి రామాయణం, 1300 ప్రాంతంలోని రంగనాథుడు రచించిన రామాయణం ఎలా అవుతుంది? కనుక రామాయణం రచించింది బుద్ధారెడ్డే. బుద్ధారెడ్డి రచించిన రామాయణ రచనా కాలమే 1200 ప్రాంతం.

8. "ఈ ఇద్దరి వరవడిని మరొక శ్రీనాథుడెవరో కవిసార్వభౌమ శ్రీనాథునికంటె ముందే ద్విపద ప్రబంధంలో త్రిపురాంతకుని కాలానికే పల్నాటి వీరులను పాడివుంటాడు."

ఇప్పుడు "మరొక శ్రీనాథుడు" వచ్చాడు. ఇందాకటి వైష్ణవ శ్రీనాథుడు ఏమయ్యేడో! - ఏమిటీ వైష్ణవ మాయ? ఇంతకీ ఈ "మరొక శ్రీనాథుడు పల్నాటి వీరులను పాడి"వుంటాడా? వ్రాసిఉండడన్నమాట. సరే. ఆ పాడిం దెప్పుడు? త్రిపురాంతకుని కాలానికేనా? త్రిపురాంతకుని కాలం 1380 ప్రాంతం. అంటే స్థూలంగా 1340-1410. అయితే, మరి అది "కవిసార్వభౌమ శ్రీనాథుని కంటెముందే" అవుతుందా? సమకాలికం కదూ? కనుక పల్నాటి వీరచరిత్రను ద్విపద ప్రబంధంగా వ్రాసే అవకాశం, పాడే అవకాశం కవిసార్వభౌమ శ్రీనాథకాలంలోనే కదా! అందుకు మరి అన్య శ్రీనాథు డెందుకూ? పల్నాటి వీరచరిత్ర వ్రాసిన శ్రీనాథుడు కవిసార్వభౌముడే కదా!

"......భరద్వాజవంశవర్ధనుఁడ
కవిసార్వభౌముఁడ ఘనతఁగన్నట్టి
శ్రీనాథుఁడనువాడ"

మరి అయితే మరొక శ్రీనాథుడికీ కవిసార్వభౌమ బిరుదం కలదా ఏమి? అయితే మరి ఆ మరొక వైష్ణవమాయా శ్రీనాథుని గోత్రమేమిటో! ఇంతకూ ఈ శ్రీనాథుడు వైష్ణవుడు అనే తాతాచార్య ముద్ర ఎందుకూ?

పల్నాటి వీరచరిత్ర వ్రాసిన శ్రీనాథుడు వైష్ణవుడు అనడానికి, తత్రాపి, ఆ మరొక వైష్ణవమాయా శ్రీనాథకృతమనే పల్నాటి వీరచరిత్ర అతఃపూర్వ గ్రంథం అనడానికీ ప్రమాణం వుందా? అయితే మరి ఆఖరి ప్రతిపాదన ఏమిటీ?

9. "కాటమరాజు కథకూడా ఆ శ్రీనాథుడే ద్విపదగా వ్రాసి ఉంటాడేమో!"

ఏ శ్రీనాథుడు? త్రిపురాంతకుని తప్పుడు కాలంలోని మరొక శ్రీనాథుడా? 1260 ప్రాంతంలో జరిగిన కాటమరాజు కథని 1295 ప్రాంతంలోనే మరొక వైష్ణవమాయా శ్రీనాథుడు వ్రాసి ఉంటాడా? కాటమరాజుకథ ప్రతాపరుద్రచరిత్రలా కట్టుకథల పుట్టకాదు; పల్నాటివీరచరిత్రలా పరమ చారిత్రకం. మనుమసిద్ధి కొలువులోని కటిక్కన సోదరుడు ఖడ్గతిక్కనకీ, కణిగిరిప్రాంతంలోని యర్రగడ్డ యాదవనాయకుడు కాటమరాజుకీ జరిగిన యుద్ధం. ఆ యుద్ధకాలం 1260 ప్రాంతం. త్రిపురాంతకుని సరియైనకాలం 1380 ప్రాంతం. త్రిపురాంతకుని కాలంలోని శ్రీనాథుడే కాటమరాజు కథ వ్రాశాడని అంటారు. అంటే కాటమరాజు కథ ఏ శ్రీనాథుడూ వ్రాసిందికాదు. అసలున్న శ్రీనాథుడు ఆనాడు ఒక్కడే. కవిసార్వభౌముడు, శివభక్తిపరుడు, భరద్వాజగోత్రుడూ అయిన ఆ శ్రీనాథుడే పల్నాటివీరచరిత్ర వ్రాసినట్టువుంది. అది సరికాదని పల్నాటి వీరచరిత్ర వ్రాసినది మరొక శ్రీనాథుడనీ. అవ్రాసిన కాలం త్రిపురాంతకుని కాలమనీ కదా! మరి ఆఖరి ప్రతిపాదన—

10. "శ్రీనాథుని కాలానికి ఫారసీపేర్లు, ఖుషీ వంటి పార్సీపదాలు వ్యవహారంలో రావడంనిజమే. కాని ముఖమల్ పదం విజయనగరం తర్వాతనే. కనుక ఈ పదాన్నిబట్టికూడా పల్నాటి వీరచరిత్ర పాతదికాదు."

ఇంతవరకూ పర్యవసానం మరొక వైష్ణవమాయా శ్రీనాథుడు త్రిపురాంతకుని కాలంలో పల్నాటివీరచరిత్ర వ్రాశాడనికదా సమీక్షా వ్యాపారం. ఇప్పుడీ ముఖమల్ "పదాన్నిబట్టి పల్నాటివీర చరిత్ర పాతది కాదు" అనియా సమీక్షా వ్యాపారం. విజయనగరం తర్వాతనే అంటే విజయనగర నిర్మాణం తర్వాతనో విజయనగర సామ్రాజ్యం తర్వాతనో కావాలికదా! మరి శ్రీనాథుని కాలానికి తర్వాత విజయనగర నిర్మాణం జరుగలేదు. కనుక విజయనగర సామ్రాజ్యమే కదా విమర్శక హృదయం. మరి విజయనగరసామ్రాజ్యం తర్వాత అంటే అది పదిహేడవ శతాబ్ది. కనుకనే "పల్నాటిచరిత్ర పాతదికాదు"అనడమా? ఇంతక్రితంవరకూ పల్నాటి చరిత్ర త్రిపురాంతకుని తప్పుడు కాలంలోది-అంటే-పద్నాల్గో శతాబ్దంలోదనికదా పై వాక్యాల పర్యవసానం. ఇప్పుడు పదిహేడవశతాబ్దం తరువాతది అని వాక్యం పరమార్థం. ఇది పూర్వోత్తర విరోధశంకానిరాంతక నిరాఘాటప్రకటనంకాదా?

ఇది ఈసమీక్షలోని ఇతోధిక విశేషం! ఇంతకూ రామరాజుగారి పుస్తకంమీది సమీక్ష ప్రధానంగా పరస్పర విరుద్ధం అనీ, ఆనుషంగికంగా అన్నీ అసందర్భ ప్రతిపాదనలనీ అతిస్పష్టం.

## లావ్ షే* | బాలచంద్రుడు

చల్లగా బంగారు కొడవలిలా ఉన్న బాలచంద్రుణ్ణి నేను మళ్లీ చూచాను. ఇల్లాంటి బాలచంద్రులను ఇదివరకు ఎన్ని సార్లో చూచాను. ఆ చంద్రుడు నాలో వివిధ భావాలను కలిగించాడు. గత దృశ్యాల నెన్నింటినో స్మృతిపథానికి తెచ్చాడు. ఇల్లా కూచొని ఆ చంద్రుని వైపల్లా చూస్తుంటే, ఎన్నెన్నిసార్లు ఆ నీలాకాశంలో వేలాడుతున్న చంద్రుణ్ణి చూచానో గుర్తుకువస్తున్నది. నిద్రకోసం అల్లాడుతూన్న చిన్నారి పూవు రేకుల్ని కదల్చి వాటిని విప్పుతున్న సాయం వాయువులా, ఈ చంద్రుడు నా స్మృతుల్ని తట్టి లేపుతున్నాడు.

మొట్టమొదటిసారి ఈ బాలచంద్రుణ్ణి చూచిన సమయం గుర్తుకు తెచ్చుకుంటే చాలా కష్టంగా ఉన్నది. మొదటిసారి ఈ చంద్రుణ్ణి చూచినప్పుడు నేను చలితో గజగజ వణుకుతున్నాను. నా కనుకొలకుల్లో ఊరిన నీటి బిందువుల్లో మెరసిన వాని బంగారుకిరణాలు నా కిప్పటికీ జ్ఞాపకమున్నవి. నా కప్పుడే డేండ్లు. ఎఱ్ఱని జాకెట్టు తొడుగుకొన్నాను. అమ్మ నా కోసం కుట్టిన నీలిరంగు హ్యాటు నెత్తిన పెట్టుకున్నాను. దాని అంచులకు పూవులు కుట్టింది అమ్మ. నాకు బాగా జ్ఞాపకముంది. మా చిన్నగదిలో తలుపు కానుకని నిలుచున్నాను. గది నిండా మందుల వాసన, పొగ, అమ్మ కన్నీళ్లూ, నాన్న రోగమూ. బాలచంద్రునివైపు చూస్తూ నేనొక్కదాన్నే మెట్లదగ్గర నిలబడ్డాను. నా సంగతి ఎవరూ పట్టించుకోలేదు. నా కన్న మెవ్వరూ పెట్టలేదు. ఆ గది నిండా దుఃఖితులున్నారని నాకూ తెలుసు. ప్రతివారూ అంటూన్నారు నాన్న రోగం చాలా... .. కాని నేను నన్నుగురించే దుఃఖిస్తున్నాను, నాకు చలిపెట్టుతున్నది. ఆకలవుతున్నది. దుప్పటికప్పేవాళ్లు లేరు. అన్నం పెట్టేవాళ్లు లేరు.

ఆ చంద్రుడ దస్తమించేదాకా అక్కడ అల్లాగే నిలబడ్డాను. నే నేమీ తినలేదు. దుఃఖం తరుముకొని తరుముకొని వచ్చింది. కాని అమ్మ పెద్దగా ఏడుస్తూంటే ఆ దుఃఖంలో నా దుఃఖం మునిగిపోయింది. మాట లేకుండా పడుకున్నాడు నాన్న. ముఖం మీద తెల్లని బట్ట కప్పబడి ఉంది. ఆ గుడ్డ ఎత్తి నాన్న ముఖాన్ని చూడాలనిపించింది నాకు. కాని ధైర్యం చాలలేదు. గది చాలా ఇరుకుగా ఉంది. ఆ ఉన్న కాస్తా చోటును నాన్నే ఆక్రమించాడు.

అమ్మ తెల్లని బట్టలు కట్టుకుంది. అవి శోక చిహ్నాలట. నా ఎఱ్ఱని జాకెట్ మీద ఎవరో తెల్లనిగుడ్డ ఏదో తొడిగారు. నాకు బాగా జ్ఞాపకముంది. నే నా గుడ్డలోంచి తెల్లని దారాలు పీకుతూ కూచున్నాను. ఆ నాడు పెద్ద అల్లరి. ఏడ్పులూ అర్పులూ. అక్కడ ఉన్నవాళ్ళందరూ ఏదో ఓ పని చేస్తున్నారు. అంతగా చేయవలసిన పని ఏమీ నాకు కనపడలేదు. అంత అల్లరి చేయవలసిన అవసరం కూడా నాకు కనబడలేదు. నాలుగు సన్నని చెక్కలతో చేసిన పెట్టెలో నాన్నను పడుకోబెట్టారు. ఆ పెట్టెనిండా సందులే. తరువాత ఐదారుగురు మనుషులు నాన్నను బయటి కెత్తుకపోయారు. అమ్మా నేనూ, ఏడుస్తూ వెంటనడిచాము. నాన్న నాకు బాగా జ్ఞాపకమున్నాడు. ఆయన కఱ్ఱపెట్టె కూడా నాకు బాగా జ్ఞాపకముంది. ఆ కఱ్ఱపెట్టె ఆయన అంతాన్ని సూచించింది. ఆ కఱ్ఱపెట్టెను పగులకొట్టేదాకా నాన్న నాకు మళ్ళీ కనబడడని తెలుసు. కాని వాళ్ళు నాన్న నెత్తుకపోయి నగరం వెలుపల ఎక్కడో గోరీల మధ్యన భూమిలోపల లోతున పాతిపెట్టారు. ఆ కఱ్ఱపెట్టె ఎక్కడ ఉన్నదీ నాకు బాగా తెలిసినప్పటికీ ఆ పెట్టెను మళ్ళీ చూడటం అసాధ్యమని నాకూ తెలుసు. వాననీటి బిందువును మింగినట్టు భూమి ఆ పెట్టెను మింగేసింది.

రెండవసారి బాలచంద్రుణ్ణి చూచినపుడు అమ్మా నేనూ ఇద్దరమూ తెల్లనిగౌన్లు తొడుక్కున్నాము. ఆనాడు చలి పెరుగుతున్నది. అమ్మ నన్ను నాన్న గోరీ చూడటానికి తీసుకుపోతున్నది. అమ్మ ఆనాడు కొన్ని వెండి, బంగారు పిండాలు-కాగితాలతో చేసినవి-కొన్నది. వాటిని నాన్నగోరీ దగ్గర కాల్చి మరో ప్రపంచంలో ఉన్న నాన్న కవి పంపిస్తుం

---

* లావ్ ఓ, షూషేయూ యొక్క నామాంతరము. 1899 లో జననము. చైనాలోని అనేక విశ్వవిద్యాలయాలలో చైనీస్ సాహిత్యశాఖలో ఆచార్యులుగా పనిచేసినారు. ఇతని ప్రసిద్ధరచన 'రిక్షాబాయ్' 1940 లో ప్రచురింపబడినది. ప్రస్తుతకథ 1930 ప్రాంతములలో రచింపబడినది.

దట. అమ్మ ఆనాడు నామీద విపరీతంగా ప్రేమచూపించింది నేను అలసిపోయినప్పుడు నన్ను ఎత్తుకున్నది. నగర ద్వారం దగ్గర నాకు కొన్ని వేయించిన చెస్ట్‌నట్‌లు కొని పెట్టింది. ఆ చలిలో ప్రతి వస్తువూ చల్లబడి పోయింది కాని చెస్ట్‌నట్‌లు మాత్రం వేడిగా ఉన్నాయి. నేను వాటిని తినకుండా చేతులను వెచ్చచేసికోటం కోసం వాటిని ఉపయోగించుకున్నాను.

మే మెంతదూరం అట్లా నడిచామో జ్ఞాపకం లేదు. నాన్నశవాన్ని పాతిపెట్టిననాడు ఇంతదూర మనిపించలేదు. మా వెంట ఇంకా చాలామంది ఉండటంచేత కాబోలు ఈ సారికి అమ్మా నేనూ ఇద్దరమే. అమ్మ మాట్లాడలేదు. నాకూ మాట్లాడాలని అనిపించలేదు. అంతా నిశ్శబ్దం. రోడ్డంతా దుమ్ము. చలికాలం. దినాలు చిన్నవి. ఆ గోరీ నా కిప్పటికీ జ్ఞాపకమున్నది-చిన్న మట్టిదిబ్బ. దూరాన కొన్ని పర్వతాలు. సూర్యకాంతి వాని శిఖరాలమీదనే పడుతున్నది అక్కడికు పోగానే అమ్మ నన్ను మఱచిపోయినట్లుంది. నన్ను ఓ ప్రక్కదించి గోరీ తలను కౌగలించుకొని ఏడ్వడం మొదలు పెట్టింది. చెస్ట్‌నట్‌లు చేతిలో పుచ్చుకొని నేను కూచున్నాను. కొంతసేపు ఏడ్చిం తరువాత అమ్మ ఆ కాగితపు ముద్దలను కాల్చింది. బూడిద మొదట చిన్న కుప్పగా నిలబడి తరువాత మెల్లగా భూమిమీద పడిపోయింది. గాలి ఎక్కువగా లేదు. కాని విపరీతమైన చలి. అమ్మ మళ్ళీ ఏడవడం మొదలుపెట్టింది. నేనూ నాన్నను గురించి ఆలోచించటం మొదలుపెట్టాను ఆయనకోసం ఏడువలేదు. అమ్మ అంత దయనీయంగా ఏడుస్తుంటే నాకళ్లకు కూడా నీళ్ళు వచ్చినవి. నేనమ్మచేయి పట్టుకొని 'ఏడువకే, ఏడువకే' అన్నాను. కాని ఆమె మరింత ఏడ్చి నన్ను తన రొమ్ముకదుముకొన్నది.

పొద్దుకూకింది. ఇంకోమనిషి కనబడటంలేదు. నేనూ అమ్మ ఇద్దరమే. అమ్మ కొంత భయపడ్డదేమో. ఏడుస్తూ నన్ను నడిపించటం మొదలుపెట్టింది. కొంతదూరం నడిచాక ఆమె వెనక్కితిరిగి చూచింది. నేనూ చూచాను. మిగతా గోరీలతో నాన్న గోరీ కలిసిపోయి ఎక్కడున్నదో చెప్పటానికి వీల్లేకుండా ఉన్నవి. పర్వతాలవైపు అన్నీ గోరీలే. పర్వతపాదం వరకూ వందలకొలది చిన్నచిన్న దిబ్బలూ. అమ్మ నిట్టూర్చింది.

చాలాదూరం నడచాము. అప్పుడప్పుడు తొందర తొందరగా, అప్పుడప్పుడు మెల్లగా, నగరద్వారానికి చేరుకోక ముందే నేను మళ్లీ బాలచంద్రుణ్ణి చూచాను. చుట్టూరా అంతా చీకటీ నిశ్శబ్దమూ. బాలచంద్రుడు మాత్రం అంతటిచలిలో తాను మరో చల్లని కాంతిరేఖను విరజిమ్ముతున్నాడు. నేను బాగా అలసిపోయాను. అమ్మ నన్నెత్తుకొన్నది. ఇంటి కెట్లా చేరుకున్నామో నాకు తెలియదు. నాకు మసకగా జ్ఞాపకమున్న విషయమొక్కటే. ఆ బాలచంద్రుడు.

* * *

నా కెనిమిదేళ్లు వచ్చేటప్పటికే వస్తువులు అమ్మటానికి పట్టుకుపోవటం తెలిసివచ్చింది. తిరిగి వచ్చేఅపుడు కొంత డబ్బు వెంట పట్టుకరాకపోతే ఆరాత్రికి అమ్మకూ నాకూ తినటానికి ఏమీ ఉండదని నాకు తెలిసింది. మరీ విధిలేనప్పుడుతప్ప అమ్మ నన్ను పంపించేదికాదు. అమ్మచిన్న పొట్లము నాచేతికిచ్చినప్పుడల్లా అన్నపుకుండలో ఆపూట ప్రాగటానికి పలుచటి గంజికూడా లేదని అర్థం.

ఒకనాడు నేనొక అద్దం తీసికొని అమ్మటానికి వెళ్లాను. అమ్మ రోజూ వాడుకొనే వస్తువైనా మేమమ్మగలిగిన వస్తువు అదొక్కటే ననిపించింది. అద్దం పట్టుకొని నేను జాగ్రత్తగా తొందరతొందరగా షాపుదగ్గరకు వెళ్లాను. దుకాణం ఇంకా తెరిచేఉంది. ఆ దుకాణం ఎఱ్ఱని పెద్దద్వారాన్ని చూస్తే నాకు కొంతభయం కలిగేది. అయినా నేను లోపలికి వెళ్ళి పొట్లం వాళ్ల చేతిలో పెట్టి 'నేను దీనిని అమ్మతాను' అనే దాన్ని. నాకు డబ్బు దొరకగానే జాగ్రత్తగా తీసికొని ఇంటికి పరుగెత్తుక పోయేదాన్ని. అక్కడ అమ్మ దిగులుపడుతుంటుందని నాకు తెలుసు.

ఈసారికి వాళ్ళు ఆ అద్దం కొనలేదు. ఆ వస్తువుకేమీ డబ్బురాదనీ, దాంతో కలిపి ఇంకేదన్నా వస్తువు తెస్తే కాని లాభం లేదన్నారు. అద్దాన్ని అంగీలో దాచుకొని నేను వేగంగా ఇంటికిపరుగెత్తాను. అమ్మ ఏడ్చింది. అమ్మటానికి ఇంకోవస్తువేదీ దొరకలేదు. మా చిన్నగదిలో ఇంకా చాలా వస్తువులున్నవని నేననుకొనేదాన్ని. కాని అమ్మ వెదుకుతుంటే తెలిసింది. ఇంకేమీ మిగులలేదని. అమ్మ నన్ను తిరిగి దుకాణానికి పంపదలచుకోలేదు. కాని "ఇవ్వాళ మనమేం తిందామమ్మా" అని నేనడిగినప్పుడు ఆమె ఏడ్చి తన వెండి సిగపిన్ను తీసి నాకిచ్చింది. ఆమె దగ్గరున్న వెండివస్తువదొక్కటే. దాన్ని అమ్మదామని ఇదివరకే చాలాసార్లు అమ్మతీసింది. కాని ఎప్పుడూ ఆపని చేయలేదు. అమ్మ పెళ్ళైనప్పుడు నాన్నమ్మ ఆ పిన్ను ఆమెకిచ్చిందట; ఇప్పుడు దాన్ని ఆమె నాకిచ్చింది అద్దంతో కలిపి అమ్మటానికి. ఆమెదగ్గర మిగిలిన తుది వెండిముక్క అది.

నా చేతనైనంత వేగంగా నేనాదుకాణానికి మళ్ళీ పరుగెత్తాను. కాని ఆ పెద్దద్వారం అదివరకే మూసేశారు.

ఆ సిగపిన్ను చేత్తో పట్టుకొని ఆ మెట్లమీద కూలబడి నేను దాగా ఏడ్చే ధైర్యంలేక మెల్లమెల్లగా ఏడ్చాను. ఆకాశం వైపు చూచాను. అక్కడ బాలచంద్రుడు వెలుగుతున్నాడు. నా కన్నీళ్ళలో మెరుస్తూ. నేనెంతో సేపేడ్చాను. తుదకమ్మ వచ్చి నన్ను లేవదీసి నాచేయి పట్టుకొన్నది. వెచ్చనిహస్తం! నా దుఃఖం, ఆకలి నిరాశ, అంతా మరచిపోయాను. అమ్మ వెచ్చనిహస్తం నాచేయి పట్టుకొని నన్ను నడిపిస్తున్నంత సేపూ నాకేంభయంలేదనిపించింది.

"అమ్మా!" నేను వెక్కుతూ అన్నాను. "ఇంటికి పోయి పడుకుందాం పద. మళ్ళీ రేపుప్రొద్దున నేనిక్కడకు వస్తాను."

అమ్మ మాట్లాడలేదు. కొంతదూరం నడిచింతరువాత నేను మళ్ళీ అమ్మతో అన్నాను. "అమ్మా! ఆ చందమామను చూశావా? నాన్న చనిపోయిననాడుకూడా చందమామ అల్లాగే వంకరగా వేలాడుతూ ఉన్నాడు. చందమామ అల్లా పడిపోతున్నట్టుగా ఎందుకుంటాడమ్మా!"

అమ్మ మాట్లాడలేదు. కాని ఆమెచేయి కొద్దిగా వణికింది.

* * *

అమ్మ దినమంతా వాళ్ళ బట్టలుతుకుతూనే ఉంది. ఆమెకు సహాయం చేయాలని నేననుకొనేదాన్ని. కాని సహాయం చేసే మార్గమేమీ కనబడేది కాదు. నే నామె కోసం ఎదురు చూచేదాన్ని. ఆమె పని అయిపోయే అంత వరకూ నేను నిద్రపోయేదాన్ని కాదు. అప్పుడప్పుడు చంద్రుడు పొడిచిన తరువాత కూడా ఆమె బట్టలు పిండుతూనే ఉండేది. అవు తోలులా లావైన ఆ దుర్వాసన గల గుడ్డలన్నీ నేల్సుమన్లూ, షాపుల్లోని క్లర్కులూ తెచ్చేవారు. ఈ 'అవుతోళ్ళ' నన్నింటినీ కడిగిన, తరువాత అమ్మకు ఆకలంటూ ఉండేది కాదు.

చంద్రుణ్ని చూస్తూ నేనామె ప్రక్కన కూచునేదాన్ని. అమ్మమీద నాకు దయ ఎక్కువైనకొద్దీ ఆ చంద్రుని మీద ప్రేమ ఎక్కువైంది. చంద్రునివైపు చూస్తుంటే మనస్సు కొంత తేలిక పడేది. వేసవిలో ఆ చంద్రుని యందు నాకు మరీ ప్రేమ. ఆ చంద్రుడు కల్పించిన మసకనీడలంటే నాకు చాలా యిష్టం. భూమిని చీకటిలో ముంచి, ఆకాశంలోని చుక్కలను మరీ కాంతిమంతం చేసి, పూలవాసనలను తెగ విరజిమ్మి. మసక మసకగా మెత్త మెత్తగా ఆ నీడలు వచ్చినట్లే వచ్చి మాయమైపోయేవి.

అమ్మ చేతులు గట్టిపడ్డవి. అరచేతుల్లో తోలు లేచి పోవటం మొదలు పెట్టింది. ఆమె నా వెన్ను నిమిరి నప్పుడదొక అద్భుతమైన అనుభూతి కలిగేది. కాని ఆమెను వ్లపెట్టటం నా కిష్టంలేదు. ఎందుకంటే ఆమె చేతులు నీళ్ళలో తడిసి ఉబ్బిపోయినవి. ఆమె చాలా చిక్కిపోయింది. ఆ దుర్వాసన గల గుడ్డలుతికిన తరువాత చాలా సార్లు ఆమె ఏమీ తినజాలకపోయేది ఆమె ఏదో పరిష్కార మార్గానికోసం చూస్తున్నదని నాకు తెలుసు. బాగా తెలుసు. అప్పుడప్పుడు ఆ మైలగుడ్డలన్నీ ఒక వైపు నెట్టి ఆమె ఏదో ఆలోచనలో పడి పోయేది. తనలో తాను మాటాడు కొనేది. ఆమె ఏమాలోచిస్తున్నదో నా కంతుపట్టేది కాదు.

* * *

అమ్మ ఆ కొత్తాయనను 'నాన్న' అని పిలువుమని చెప్పింది. నన్ను మంచిగా ఉండమని చెప్పింది. నాకో కొత్త నాన్నను సంపాదించి ఈ విషయం నాకు చెప్పినప్పుడు అమ్మ నా వైపు చూడలేదు. కన్నీళ్ళతో ఆమె ఇలా అన్నది. 'నిన్ను ఉపవాసముంచలేను తల్లీ' అని.

అయితే నాకు తిండిదొరకటానికి అమ్మ ఇంకో నాన్నను పట్టుకొచ్చిందా? నాకు బాగా తెలియలేదు. కొంత భయం కూడా అయింది. కొంత ఆశ కూడా కల్గింది. నిజంగా ఇక ముందు ఉపవసించవలసిన అవసరంలేదేమో?

మేమా చిన్నగది వదలి వెళుతున్ననాడు కాకతాళీయ న్యాయంగా ఆకాశంలో మళ్ళీ బాలచంద్రుడు ప్రత్యక్షమైనాడు. ఆనాడేమో చంద్రుడు ఎక్కువ కాంతిమంతంగా ఉన్నాడు. భయపెట్టుతున్నట్టున్నాడు. అంతగా అలవాటుపడ్డ ఆ చిన్న గదిని నేను వదలిపెట్టబోతున్నాను. అమ్మ వధూయోగ్యమైన ఎత్తని పల్లకిలో కూర్చున్నది. ముందర కొంతమంది ఏవో జంత్రాలు వాయిస్తూ నడచారు. నేనూ ఆ కొత్తాయనా వెనక నడచాము. ఆయన నన్ను చేత పట్టుకొన్నాడు. బాలచంద్రుని మెత్తని కాంతికిరణాలు చలిగాలికి వణికిపోతున్నవి. వాద్యాలు వాయిస్తున్నవాళ్ళను చూచి అక్కడక్కడ మొరిగే కుక్కలు తప్ప వీధుల్లో ఎవ్వరూలేరు పల్లకి తొందరతొందరగా నడచింది. ఎక్కడికి పోతున్నదా పల్లకి? అమ్మను ఎక్కడికి తీసుకపోతున్నారు? నగరం బయట ఉన్న ఆ శ్మశానానికా? ఆ కొత్తాయన నన్ను వేగంగా గుంజుకపోతున్నాడు. నాకు శ్వాస మరలటంలేదు. నా కేడ్చే వీలుకూడా లేకపోయింది. ఆయన అరచేయి చెమటపట్టి చల్లగా ఉంది. నేను 'అమ్మా' అని పిలుస్తామనుకున్నాను. కాని ధైర్యం చాలలేదు. అర మూతపడిన విశాలనేత్రంలాగా ఉన్నాడు బాలచంద్రుడు. కొంతసేపటికి పల్లకి ఒక చిన్న సందులో దూరింది.

* * *

ఆ మూడువారాలుగేంట్లలో ఎందుకో, నాకు బాలచంద్రు డెప్పుడూ కనబడలేదు.

కొత్త నాన్న నన్ను చాలా బాగా చూచేవాడు. ఆ ఉన్న రెండు గదుల్లో అమ్మా ఆయనా లోపల గదిలో ఉండేవారు. నేను బయటి గదిలో పడుకునేదాన్ని. మొదట నాకు అమ్మ దగ్గర పడుకోంటేనే బాగుండునసిపించింది కాని రానురాను నా చిన్నగది అంటేనే నాకెక్కువ ఇష్టమేర్పడ్డది. నున్నని తెల్లని గోడలూ, ఒక టేబిలూ, కుర్చీ. అవన్నీ నావే అని పించేవి. నా పక్క కూడా మెత్తగా వెచ్చగా ఉండేది.

అమ్మ మెల్లమెల్లగా కొంత లావైంది. ఆమె చెంపలకు కాంతి వచ్చింది. అరచేతుల తోలూడటం ఆగింది. నేను చాలనాళ్ళనుంచీ వస్తువులమ్మే షాపుకి వెళ్ళలేదు. కొత్త నాన్న నన్ను బడికి పంపించేవాడు. అప్పుడపుడు నాతో ఆడు కొనేవాడు కూడా. ఆయనంటే నాకు చాలా ఇష్టం. కాని ఎందుకో ఆయన్ను నాన్న అని పిలువజాలకపోయేదాన్ని. ఆయనక్కూడా అర్థమైనట్టే ఉంది. అలా నవ్వేవాడు నన్ను చూచి. అప్పుడాయన కళ్ళు చాలా మంచివిగా కనపడేవి. అమ్మ చాటుగ చెప్పేది నాకు ఆయనను 'నాన్న' అని పిలువమని. నేను గట్టిగా 'కాదు' అనదలచుకోలేదు. ఆయన మూలంగా అమ్మకూ, నాకూ కూడా గుడ్డలు దొరుకుతున్న వని నాకు తెలుసు. ఆ స్థితిని నేను బాగాఅర్థంచేసుకున్నాను.

ఆ మూడునాలుగేండ్లలో నేను బాలచంద్రుడ్ణెప్పుడూ చూచి నట్టు లేదు. ఏమో! చూచికూడా మరచిపోయానేమో! కాని నాన్న పోయిననాటి రాత్రికానీ, అమ్మ పల్లకి ఎక్కిన నాటి రాత్రికానీ కనబడ్డ బాలచంద్రుడ్ణి నేనెప్పుడూ మరచిపోలేను. మంచులాంటి ఆ చల్లని కాంతి నా హృదయంలో ఎప్పుడూ ఆడుతూఉంటుంది. ఆ చంద్రుణ్ణి గూర్చి ఆలోచించినప్పు డనిపిస్తుంటుంది. నేను చేయిచాపి వాన్ని ముట్టుకోగల్గు తానేమోనని.

* * *

బడికి పోవటం నాకు చాలా ఇష్టం. స్కూలు వాకిలి నిండా పువ్వులే అని నాకు తోస్తుంటుంది. కాని నిజంగా పూవులు లేవక్కడ. కాని స్కూలును గురించి ఆలోచించి నప్పుడల్లా పువ్వులే జ్ఞాపకానికి వస్తవి. నాన్న గోరీని గురించి ఆలోచించి నప్పుడల్లా చేలపై వీస్తున్న గాలిలో వంకరగా వేలాడుతున్న బాలచంద్రుడు జ్ఞాపకం వచ్చినట్లు.

పూలంటే అమ్మకుకూడా చాలా ఇష్టం. కాని ఆమె వాటిని కొనుక్కోలేక పోయేది. ఎవరన్నా ఆమెకు పంపితే అవి ఆమె తలలో తురుముకొనేది. నే నొకనాడు ఆమె కోసం రెండు పువ్వులు కోసుక వచ్చాను. ఆ పువ్వులు తలలో తురుముకున్న అమ్మ వెనుక నుంచి చూస్తే వయసు కత్తెగా కనబడ్డది. ఆమెకు సంతోషంగా ఉన్నది. నేను సంతోషంగా ఉన్నాను. స్కూలుకు పోవడం నాకు చాలా సంతోషం కలిగించేది. బహుశః అందువల్లనేమో స్కూలును గురించి ఆలోచించి నప్పుడల్లా నేను పువ్వుల గురించి ఆలోచిస్తాను.

* * *

ఇక ఆ యేడైతే ప్రాథమిక పాఠశాలలోంచి బయటపడి పై తరగతికి పోతాను. ఆ యేడు అమ్మ నన్ను మళ్ళీ ఆ షాపుకు పంపించింది. కొత్తనాన్న అకస్మాత్తుగా మమ్మెందుకు వదలిపెట్టి వెళ్ళిపోయినాడో నాకు తెలియదు. ఆయన ఎక్కడకు పోయిందీ అమ్మకుకూడా తెలిసినట్లు లేదు. ఆమె నన్ను బడికి పోవటం మానవద్దన్నది. బహుశః ఆయన తొందరగానే తిరిగి వస్తాడని అమ్మ అను కొన్నది. చాలా నాళ్ళు గడచినవి. కాని ఆయన జాడ కన బడలేదు. ఆయన ఉత్తరం కూడా వ్రాయలేదు. అమ్మ మళ్ళీ మైలగుడ్డలు ఉతకటం మొదలు పెడుతుందేమో అని నాకు భయమైంది.

కాని అమ్మ ఆలోచనలే వేరు. ఆమె ఇప్పటికీ అందంగా అలంకరించుకొని తలలో పూలు తురుముకొనేది. ఆమె ఏడ్వటం మానేసింది. అదొక వింత. పైగా ఎప్పుడూ ముసి ముసి నవ్వులు నవ్వుతుండేది. ఎందుకో నా కర్థం కాలేదు. నేను బడినుంచి ఇంటికి వచ్చేసరికి ఆమె ద్వారంలో నిలబడి ఉండటం చాలా సార్లు చూశాను. చాల నాళ్ళు కాకముందే వీధిలో పురుషులు నన్నిలా పలుకరించారు.

"మీ అమ్మతో చెప్పు. తొందరగానే ఆమె దగ్గరకు వస్తానని."

"చిన్నదానా, కోమలీ, ఇవ్వాళ నీ వంతా?"

నా కన్నుల్లో నిప్పులు కురిసి నేను తలవంచు కొన్నాను. నా కప్పుడు తెలిసింది. నే నేమీ చేయలేనంతగా పరిస్థితులు మారిపోయాయని. అమ్మను నే నేమీ అడగలేను. ఆమె నన్నెంత ప్రేమగా చూస్తుంది. 'బాగా చదువుకో, కష్టపడి చదువు.' అని చెపుతుంది. కాని ఆమెకు చదువురాదు. నా చదువును గురించి ఆమె ఇంతగా ఎందుకు విచారిస్తు న్నది? నాకెవో సందేహాలు కలుగసాగాయి. కానిమళ్ళీ ఆలో చించేదాన్ని - ఇంకేమీ చేయటానికి వీలులేక. ఆమె పాపం ఇల్లా చేస్తున్నదని. నా కామె పై అనుమానాలు కలిగి నప్పుడు ఆమెను తిట్టాలన్నంత కోపం వచ్చేది నాకు. ఇంక కొన్నిసార్లు ఆమెను గట్టిగా కౌగిలించుకొని 'అమ్మా' ఇక ముందు ఇలా చేయకు అని చెప్పుదామనిపించేది.

అమ్మకు సహాయం చేయజాలనందుకు నా మీద నాకే రోత పుట్టింది. నా కాంతి చెడ్డది. ఈ ప్రాథమిక విద్య

పూర్తయిం తరువాత మాత్రం నేను చేసేదేమిటి? నా క్లాసులోని పిల్లలనగా విన్నాను. పోయిన సంవత్సరం స్కూలు విడచి వెళ్ళిన ఆడపిల్లలు చాలామంది ఉంపుడు కత్తెలైనారనీ ఇంక కొందరు ఎక్కడో ఏమో చేస్తున్నారనీ. ఆ విషయాలు నాకు బాగా అర్థంకాలేదు కాని వాళ్ళు మాటాడే తరహా చూస్తే అదేదో చెడ్డదనిపించింది. ఆ విషయాలు చెడ్డవని వాళ్ళకూ చాలా బాగా తెలుసు. కాని వాళ్ళు ఆ విషయాలే ఉత్సాహంతో మాట్లాడుకొనేవారు. ఆ విషయాలు మాట్లాడు కొంటున్నప్పుడు వాళ్ళు సిగ్గుపడేవాళ్ళు. దాంతోబాటు అవి వాళ్ళకేదో విపరీతమైన తృప్తిని కలిగించి నట్టనిపించేవి.

అమ్మమీద నాకు అనుమానాలు ఎక్కువైనవి. నా చదువు పూర్తికావాలనే అమ్మ చూస్తున్నదా? తరువాత నన్ను ....వే పిల్లా ఆలోచించినపుడల్లా ఇంటికి పోయే ధైర్యం నాకుండక పోయేది. నేనమ్మముఖం చూడటానికే భయపడేదాన్ని. మధ్యాహ్నం తినుబండారాలు కొనుక్కోవటానికి అమ్మ ఇచ్చిన పెన్నీలు నేను మిగుల్చుకొని వట్టి కడుపుతోనే ఫిజికల్ ట్రైనింగ్ క్లాసులకు వెళ్ళేదాన్ని. ఆ పిల్లలంతా పేస్ట్రీలు నములుతుంటే నేనెంతో ఆశగాచూచేదాన్ని. కాని నేను తప్పనిసరిగా డబ్బు మిగిల్చి తీరాలి. ఆ కొంత డబ్బుతో నేను పారిపోగలను. ఒకవేళ అమ్మ నన్ను బలవంత పెట్టితే—

కాని పది పదిహేను సెంట్లకంటె ఎక్కువ నేనెప్పుడూ మిగిల్చ జాలలేదు. పగలుకూడా నా బాలచంద్రుని కోసం నే నాకాశంవైపు చూచేదాన్ని. నా హృదయ దుఃఖానికి ఏ భౌతిక పదార్థమైనా పోలికగా నిలువగలిగితే అది ఆ బాలచంద్రుడు. నీలాకాశంలో నిస్సహాయంగా, నిరాధారంగా వ్రేలాడుతూన్న బాలచంద్రుడు. మరుక్షణంలో గాఢాంధకారంచేత గ్రసితమయ్యే కిరణాలుగల బాలచంద్రుడు.

అన్నిటికంటె ఎక్కువగా నాకు బాధ కలిగించిందేమంటే నేను మెల్లమెల్లగా అమ్మను ద్వేషించటం మొదలుపెట్టాను. కాని ఆమెపై ద్వేషం బొడసూపినప్పుడల్లా నాన్న గోరీ చూడటానికి ఆమె నన్ను మోసుకుపోయిన దృశ్యం జ్ఞాపకం వచ్చేది. అప్పుడు ఆమెను ద్వేషించజాలక పోయేదాన్ని. కాని మళ్లీ ఆ ద్వేషభావం తలయెత్తేది. నా హృదయం కూడా కొంచెంసేపు వెలిగి మాయమైపోయే ఆ బాలచంద్రుని లాంటిదే. అనంతమైన నల్లని అంధకారంచేత అవృతుడు కాబోయే బాలచంద్రుని లాంటిది.

అమ్మ గదికి పురుషులు ఎడతెగకుండా రావటం మొదలు పెట్టారు. ఆ విషయాన్నిక ఆమె నాదగ్గర దాచటానికి ప్రయత్నించలేదు. వాళ్లు నావైపు కుక్కలవలె, నాలుక వ్రేలాడవేసిన కుక్కలవలె, చూచేవారు. వాళ్ళదృష్టిలో నేను అమ్మకంటెకూడా రుచికరమైన పదార్థాన్ని. వాళ్ల ఉద్దేశాలను నేను చదివేదాన్ని.

కొద్దికాలంలోనే, హఠాత్తుగా చాలావిషయాలు నాకు తెలిసినవి. నన్ను నేను రక్షించుకోవాలని నాకు తెలిసింది. ఏదో వెలగలది నా శరీరంలో ఉన్నదని నాకు తోచింది. నా లోని పురుషోన్మాదకారి లక్షణం నాకు తెలిసి వచ్చింది. చెడ్డసిగ్గు కలిగింది నాకు. అనేక భావాలు నన్నుక్కిరి బిక్కిరి చేయటం మొదలుపెట్టినవి. నన్ను రక్షించుకోటానికైనా, నన్ను నాశనం చేసికోటానికైనా నాలో శక్తి ఉన్నదని నాకు తోచసాగింది. అప్పుడప్పుడు నాలో ఎక్కడలేనిశక్తి కలిగేది. మరొకపుడు నేను శక్తిహీననై, నిస్సహాయనై గడగడలాడి పోయేదాన్ని.

నేను అమ్మను ప్రేమించదలచుకొన్నాను. ఎన్నో విషయాలు ఆమెను అడుగదలచుకొన్నాను. ఆమె ఓదార్పు నాకెంతో అవసరమైంది. కాని అదే సమయంలో నాకామెను ద్వేషించవలసి వచ్చింది. అయితే ఆమెకు వ్యతిరేకినైనా కావాలి, లేకపోతే నా అస్తిత్వాన్నైనా కోల్పోవాలి.

నిదురపట్టక, పక్కమీద పడుకొని, ఉద్యోగం లేకుండా విషయాలన్నీ ఆలోచించినప్పుడు అమ్మ పరిస్థితి ఎంత దయనీయమైందో నాకు తెలిసివచ్చేది. మా ఇద్దరికోసం సంపాదించవలసింది ఆమె ఒక్కతే. అప్పుడు నా కనిపించేది - ఆమె ఆ మార్గాన సంపాదించిన అన్నం నే నెట్లాతింటున్నానని.

ఈ క్షణం ఆగి, మరుక్షణం అతిభయంకరంగా వీచిన చలికాలపు గాలిలా, నా మనస్సు చంచలంగా ఉన్నది. రోజురోజుకూ నాలో క్రోధాగ్ని ప్రజ్వరిల్లింది. దాన్ని ఆర్పే శక్తి నాకు లేకపోయింది.

* * *

పరిష్కారమార్గం ఆలోచించుకోకముందే పరిస్థితులు మరీ విషమించాయి. అమ్మ అడగనేఅడిగింది. 'ఆ సంగతేమిటి?' అని. నాకు సిజంగా తనమీద ప్రేమఉన్నట్టయితే తనకు సహాయం చేయమన్నది. లేకపోతే నన్నిలా తాను పోషించజాలనన్నది. ఇవి అమ్మ మాటల వలె అనిపించవు కాని ఆమె ఈ మాటలన్నమాట మాత్రం నిజం. ఇంకా స్పష్టంగా చెప్పటానికని ఇల్లా అన్నది.

"నేను పెద్దదాన్నైపోతున్నాను. ఇంకో ఏడాది రెండేళ్లలో నేమారకే ఒప్పుకొన్నా నన్ను కోరే మగవాడుండడు."

ఆమె మాట నిజమే. ఆమె ఎంతగా పౌడర్ రుద్దుకున్నా ఆమె ముఖంమీద ముడుతలు కనబడుతునే ఉన్నాయి. చాలా

మందిని వినోదపరచే శక్తి ఆమెలో నశించింది. ఎవడినో ఒకడిని పట్టుకుందామని ఆమె చూస్తూఉంది. రొట్టెల షాపు నడపేవాడొకడుండేవాడు. ఆమె చక్కగా వాడి దగ్గరకు పోగలిగేది. కాని నేనిప్పుడు పెద్దపిల్లను. ఇదివరకామె పల్లకి వెంట పోయినట్టుగా ఇప్పుడు పోవటానికి వీల్లేదు. నా సంగతి నేనే చూచుకోవలసిఉంటుంది. నేను అమ్మకు "సహాయ" పడటానికి ఒప్పుకొనే అట్లయితే ఆమెకు వాని దగ్గరకు పోవలసిన అవసరంలేదు. నే నొక్కతెను ఇద్దరికి చాలే అంత సంపాదించగలను.

ధనం సంపాదించటానికి నేను సిద్ధమే. కాని ఆమె చెప్పిన మార్గాన్ని గురించి ఆలోచిస్తేనే గుండె గుబగుబలాడి పోయేది. నాకేమీ తెలియదే! నడీదు ఆడవాళ్ళవలె నేనెట్లా ప్రవర్తించగలను. అమ్మ గుండె కఠోరమైంది. ధనావసరం కఠోరతరమైంది. ఆమె నన్నే మార్గం పట్టమనీ బలవంత పెట్టలేదు. నా యిష్టానికే వదలేసింది. అయితే ఆమె చెప్పినట్లు వినటమో, లేకపోతే ఇద్దరమూ ఎవరిదారి వారు చూచుకోవటమో. అమ్మ ఏడ్వలేదు. ఆమె కన్నుల్లో నీరింకి పోయి చాల నాళ్ళైంది.

ఏం చేయాలి నేను?

మా పాతశాల ప్రిన్సిపాల్‌తో మాట్లాడాను. నాకు నిజంగా మతిపోయిందని చెప్పాలి; లేకపోతే అమ్మనుగురించి ఆమె కెట్లా చెప్పగలను? ఆ ప్రిన్సిపాల్ నాకు బాగా తెలియదు. నేను మాట్లాడిన ప్రతిమాటా అగ్గి ఉండవలె నా కంఠాన్ని కాల్చివేసింది. ఆ నాలుగు మాటలు తడబడుతూ చెప్పటానికి నాకు చాలా సేపు పట్టింది.

ప్రిన్సిపాల్ నాకు సహాయం చేస్తాననే చెప్పింది. డబ్బు కానివ్వజాలదు కాని రెండుపూటలు అన్నమూ, ఉండటానికి కొంతచోటూ చూపగలనన్నది. నేను వ్రాయసకాళ్లకు సహాయం చేయాలి. స్కూల్లో నౌకరుగాఉన్న ఒక వృద్ధ స్త్రీదగ్గర ఉండాలి - ఇదీ ఏర్పాటు. కాని వెంటనే నేను పని మొదలు పెట్టటానికి వీల్లేదు. నా వ్రాత బాగుపడటానికి కొంత ప్రాక్టీసు అవసరం కనుక.

రెండుపూటలు అన్నం, ఉండటానికిచోటు, అన్నింటికన్న పెద్దసమస్య పరిష్కారమైంది. ఇంక నాకు అమ్మమీద ఆధారపడవలసిన అవసరంలేదు.

ఈ సారికి అమ్మ పల్లకి ఎక్కపోలేదు. ఊరకే ఒక రిక్షా తీసికొని రాత్రి చీకట్లో కలిసిపోయింది. నా పక్క నాకే వదలిపెట్టి వెళ్ళింది. అమ్మ పోతున్నప్పుడు ఏడువ కూడదని చాలా ప్రయత్నించింది. కాని హృదయంలోని దుఃఖం పై తెగదన్ని కన్నీటి ప్రవాహంలా రానే వచ్చింది. నేను ఆమె కూతురను. ఆమెను చూడటానికి కూడా రాజాలనని ఆమెకు తెలుసు. ఇక నేనైతే వెక్కివెక్కి ఏడ్చాను. కన్నీరు ముఖంనిండా వరదలు కట్టింది. నే నామె కూతురను. ఆమె మైత్రిని. ఆమె కాంతిని. కాని ఆమెకు సహాయం చేయలేకపోయాను; చేయజాలని పనిని చేయటానికి అంగీకరిస్తే తప్ప.

ఆమె వెళ్ళిపోయిన తరువాత నే నాలోచించసాగాను. మేము తల్లీ బిడ్డల మిద్దరమూ, తుక్కలజంటవంటి వాళ్ళము. ఈ కడుపుకోసం ఇతర సర్వబాధలనూ భరించవలసి వస్తున్నది. ఈ కడుపే ముఖ్యమా? శరీరంలోని ఇతర అంగాలకు ప్రాముఖ్యం లేనే లేదా? ఈ కడుపు నింపుకోటానికి ఇతరమైన సర్వస్వాన్నీ అమ్మకోవలసిందేనా?

అమ్మను నేనింక ద్వేషించలేదు. నాకర్థమైంది. ఆమె తప్పేమీలేదు. కడు పుండటం ఆమె దోషం కాదే. దోషం ఇంకెక్కడో ఉంది. దోషం అన్నసంపాదనలో ఉంది. ఎందుకు నిరాకరించబడ్డది మాకి అన్నం?

గత కష్టాల స్మృతులు వెల్లువగా ఉబికి వచ్చినవి. కాని నా కన్నీళ్ళకు అంత దగ్గరివాడైన బాలచంద్రుడు ఈ సారి కనబడలేదు. మిణుగురు పురుగుల మెరపు కూడా లేని ఘోర అంధకారం. అమ్మ ఆ అంధకారంలో కలిసి పోయింది భూతంలా, మాటాడకుండా, నీడైనా కనబడకుండా. రేపామె చచ్చిపోతే బహుశః నాన్న ప్రక్కన పాతి పెట్టటానిక్కూడా వీల్లేదు కాబోలు. నే నామె గోరీని కూడా గుర్తుపట్టలేను కాబోలు. ఆమె నా ఏకమాత్ర జనని. ఒకేఒక చెలి. ఎంత ఏకాకి నైపోయాను ప్రపంచంలో!

* * *

తరువాత అమ్మను చూడజాలనేలేదు. శీతవాతాహతమైన చిన్ని పుష్పంలా, ప్రేమభావం నాలో చచ్చిపోయింది. నా దస్తూరి బాగుపరచుకోటానికి నేను చాలా ప్రయత్నం చేశాను. నే నెట్లాగో ఉపయోగపడాలి — ఇతరుల అన్నం తింటున్నాను. క్లాసులోని ఇతర విద్యార్థినులవలె, తా మేమీ చేయకుండా, వాళ్ళు పీ ళ్ళంచేస్తున్నారనీ, ఏం తింటున్నారనీ, ఏం కట్టుకుంటున్నారనీ, చూస్తూ నేను కూర్చోలేకపోయాను. నా ఆలోచనలకు కేంద్రం నేనే అయ్యాను. నా ఛాయయే నా సఖి. నా మనస్సులో ఎప్పుడూ "నేను" ఉన్నది. ఎందుకంటే ఇతరు లెవ్వరూ నన్ను ప్రేమించలేదు. నన్ను నేనే ప్రేమించుకున్నాను. నా మీద నేనే దయ దలచాను. నన్ను నేనే ఉత్సాహపరచుకున్నాను. తిట్టుకున్నాను. వేరే మనిషిని ఎరిగినట్టు నన్ను నే నెరుగుదును.

నా శరీరంలో కలుగుతున్న మార్పు నన్ను భయపెట్టింది. సంతోషపరచింది.

వర్తమానమే నా సర్వస్వం. భవిష్యత్తు ప్రసక్తి నాకు లేదు. ముందును గురించి ఆలోచించే ధైర్యం నాకు లేదు. నేను వరుల అన్నం తినేదాన్ని కనుక మధ్యాహ్న మెప్పుడో సాయంకాల మెప్పుడో అవసరంగా తెలిసికోవలసివచ్చేది. లేకపోతే నేను వేళను గురించి ఆలోచించకయుందును. ఆశ నశించినచోట కాలానికి విలువలేదు. ఏదో ఒక చోట కొరతవేయబడ్డదానిలా నే నప్పుడు ఉన్నాను. అక్కడ దినాల, నెలల, లెక్కలేదు. అమ్మతో గడచిన జీవితం జ్ఞాపకం వస్తే పదిహేనేండ్లో పదహారేండ్లో ఆమెతో కలిసి బతికినా ననిపిస్తుంది. తోడి విద్యార్థినులు సెలవుల కోసం, పండుగలకోసం, నవసంవత్సరాగమనం కోసం ఎదురు చూచేవారు. వీటి ప్రసక్తి నాకెందుకు?

కాని నా శరీరం వికసిస్తూనే ఉంది. ఆ వికాసాన్ని నే ననుభవించేదాన్ని. అది నాలో తోచవితనాన్ని ప్రవేశ పెట్టింది. నన్ను నేను నమ్మలేకపోయాను. రోజురోజూ అందవతిగా తయారు ఔతున్నాను. సౌందర్యం నా సాంఘిక స్థాయిని పెంచింది. అదొక శాంతి నిచ్చింది. నేను అందవతినన్న గర్వం కలిగింది. దరిద్రురాలనే కాని అంద వతిని. హఠాత్తుగా ఒక భయానకమైన భావం న న్నావహించింది— అమ్మకూడా అందంగానే ఉండేది.

* * *

చాలానాళ్ళైంది బాలచంద్రుని చూచి. వానిని చూడదలచి నప్పటికీ చూచేధైర్యం కలుగలేదు. చదువు పూర్తైనా ఇంకా స్కూల్లోనే ఉన్నాను. సాయంకాలాల్లో నే నొక్కదాన్నే ఇద్దరు వృద్ధసేవకులతో కాలంగడపేదాన్ని-ఒకరుపురుషుడు, ఇంకొకతె స్త్రీ. నాతో ఎల్లా ప్రవర్తించాలో వాళ్లకు సరిగా తెలియలేదు. నేను విద్యార్థినినికాదు. టీచర్నికాదు. నౌకర్ని కాదు. కాని కొన్ని విధాలుగా చూస్తే నౌకరులాంటిదాన్నే.

రాత్రులు ఒక్కతెనే వాకిట్లో తిరిగేదాన్ని. ఎప్పుడన్నా బాలచంద్రుడు కనబడితే లోపలికి పరుగెత్తుకు పోయేదాన్ని. వానివైపు చూచేధైర్యం నాకు లేదు. కాని నా గదిలోకి ఆ బాల చంద్రుని చిత్రించుకొనేదాన్ని. ఎప్పుడన్నా సన్ననిగాలి వీచినప్పుడు తప్పకుండా చిత్రించుకొనేదాన్ని. గతస్మృతులను త్రవ్వుతూ, భవిష్యద్దుఃఖాలను తీవ్రతరంచేసే, ఆ పారిపోతున్న చంద్రకిరణాలను ఆగాలి చక్కగా నా హృదయం వరకూ వీస్తున్నట్లనిపించేది అప్పటి నా హృదయం వెన్నెలలో లేస్తున్న గబ్బిలం లాంటిది; వెలుగులోకూడా వల్లనిది, పైకి లేస్తున్నప్పుడుకూడా వల్లనిది. అన్ని ఆశలూ అడియాస లైన నాకింక ఆశమాత్రం ఎక్కడిది? కాని నే నేడ్వలేదు. ముఖం ముడుచుకున్నాను. అంతే.

* * *

విద్యార్థినులకోసం అవీ ఇవీ కుట్టి నేను కొద్దిగా డబ్బు సంపాదించాను. ప్రిన్సిపాలు న న్నాపని చేయనిచ్చేది. కుట్టటం వాళ్లకుకూడా తెలుసును కనుక నాకెక్కువ డబ్బు రాలేదు. వాళ్లకు వేరే ఏదో పనుండి ఆపని చేయటానికి వీల్లేనప్పుడు మాత్రమే వాళ్లు నాదగ్గరకు వచ్చేవారు. అయినా, నా హృదయం కొంత తేలికపడ్డది. అమ్మ తిరిగివస్తే నే నామెను సాదగలను అనికూడా అనుకొన్నాను. కాని నాడబ్బు లెక్క పెట్టుకొన్నప్పుడు తెలిసింది. అదికేవలం కలలోనివార్త అని. ఏదో, మనస్సుకు కొంత బాగానేఉంది. అమ్మను చూస్తే బాగుండు ననిపించింది. ఆమె నన్ను చూస్తే చాలు. నా వెంటపడి వస్తుంది. ఎల్లాగో ఒకలాగు కాలంగడపవచ్చు నను కొన్నాను. ఎప్పుడూ అమ్మను గురించే ఆలోచన. ఆమె చాలాసార్లు కలలో కనపడ్డది.

ఒకసారి విద్యార్థినులంతా షికారుగా నగరం వెలుపలికి పోతే నేనూ వాళ్లతో వెళ్లాను. ఆలస్యం కావటం మూలంగా తిరిగివచ్చేటపుడు దగ్గరిత్రోవపట్టి, ఒకచిన్న వీధిలోంచి వచ్చాం. అక్కడ కనపడ్డది అమ్మ రొట్టెలషాపులో. గోడకు కూచొని పొయ్యిలో అగ్గి రాజెయ్యటానికి తిత్తితో గాలివింపు తున్నది అమ్మ. అమ్మను నేను దూరంనుంచే చూచాను. ఆమెను నేను వెనుకనుంచే గుర్తుపట్టాను. ఆమె దగ్గరికి పరుగెత్తి ఆమెను కౌగలించుకొందా మనిపించింది. కాని తోటివాళ్లంతా నవ్వుతారేమో అని భయమైంది. నా కల్లాంటి తల్లి ఉండకూడదని వాళ్ల అభిప్రాయం. మేము మరీదగ్గరగా వచ్చాం. నేను తలవంచుకొని కన్నీళ్లను ఛేదించుకొని ఓరగా ఆమెవైపు చూచాను. తనపనిలో నిమగ్నమై ఆమె నన్ను చూడలేదు దూరంగా వెళ్లిన తరువాత నేను వెనక్కితిరిగి చూచాను. ఆమె అల్లాగే తిత్తిలో గాలి నింపుతున్నది నే నామె ముఖం సరిగా చూడజాలలేదు. ఆ వీథిపేరు మనస్సులో దాచుకున్నాను.

* * *

హృదయంలో నల్లులు ప్రాకుతున్నట్టుగా ఉన్నది. అమ్మను చూస్తే తప్ప మనస్సుకు శాంతి కలిగేటట్టు లేదు.

ఆ సమయానికే స్కూలుకు కొత్త ప్రిన్సిపాలు వచ్చింది. వదలిపోతున్న ప్రిన్సిపాలు ఇంకేమైనా దారిచూచుకోమని చెప్పింది. నా మన్నంతపేవు కాదు, గుడ్డ ఇవ్వగలదు కాని కొత్తప్రిన్సిపాలు అల్లాగే చేస్తుందన్న నమ్మకం లేదన్నది.

నేను నా డబ్బు లెక్కపెట్టుకున్నాను. అంతాకలిసి రెండు డాలర్ల డెబ్బయి సెంట్ల పైచిల్లర. ఈ డబ్బుతో కొన్నాళ్లదాకా పస్తుండవలసిన అవసరం లేకుండా బ్రతుకవచ్చు. కాని ఎక్కడికి పోవాలన్నది ప్రశ్న.

ఊరకే కూచోని ఆలోచిస్తే లాభంలేదు. ఏదో ఒకటి చేయాలి.

పోయి అమ్మను చూస్తామని మొట్టమొదట తోచింది. కాని ఆమె నన్ను తనదగ్గరఉంచుకోగలదా? ఒకవేళ ఉంచుకోలేకపోతే ఆ రొట్టెలమ్ముకొనేవానికి ఆమెకూ పోట్లాట కావచ్చు. ఆమె కది మరోకష్టం. ఆమె నా అమ్మయే కాని కాదు. దారిద్ర్యమనే ఇనుపగోడ మాకిద్దరిమధ్యా అడ్డుతగిలి మమ్మల్ని వేరుచేసింది.

తుదకు అమ్మదగ్గరకు పోగూడదనే నిశ్చయించుకొన్నాను. ఏదో నా బరువు నేనే మోసుకొంటాను. కాని ఎల్లా? నాకు తెలియలేదు. ప్రపంచం కుంచించుకొని చిన్నదైపోయినట్లనిపించింది. నాకూ నా చిన్న పక్కచుట్టకూ చోటుదొరుకలేదు. కుక్కకూడా నాకంటె నయం. అది ఎక్కడనో ఒకచోట పడుకొని నిదురపోతుంది. నన్ను వీధిలో పడుకొని నిద్రపోనివ్వరు. నేను మనిషిని కనుక -

నేనిక్కడనుంచి వెళ్లనంటే ఏమౌతుంది? బలవంతంగా వెళ్లకొడుతారా? ఏమో! అంతదూరం రానివ్వను. నే నేడ్వ దలచుకోలేదు. కాని కన్నీళ్లు వాటంతట అవే వచ్చినవి.

* * *

ఉద్యోగాన్వేషణ మొదలుపెట్టాను. అమ్మదగ్గరికిపోను ఎవ్వరిమీదా ఆధారపడను. నాక్కావలసింది నేనే సంపాదించుకుంటాను.

గంపెడాసతో రెండురోజులూ వెదికాను. నాకు మిగిలింది దుమ్మూ, కన్నీళ్లూ. నేను చేయదగినపని ఏదీ కనబడలేదు. అమ్మ నప్పుడు బాగా అర్థంచేసుకున్నాను. ఆమెను క్షమించాను. ఆమె వాసనకొడుతున్న బట్టలన్నీ ఉతికింది. నా కదీ చేతకాదు కదా. ఇక మిగిలిన ఒకేఒక మార్గం అమ్మ పట్టింది. నాకు స్కూల్లో నేర్పిన విద్యా, చెప్పిన నీతిపాఠాలూ కేవలం హాస్యప్రాయాలు. అవి కేవలం కడుపునిండిన వాళ్లకు, సమయమున్నవాళ్లకు ఆటవస్తువులుగా ఉపయోగించేవి మాత్రమే. తమనుతాము అమ్ముకొనే ఆడవాళ్లను చూచి వారు మూతులు విరుస్తారు. వాళ్లదృష్టితో చూస్తే అది నిజమే. వాళ్లకేం? భోజనం సమయానికి దొరుకుతుంది.

నేను నిశ్చయించుకున్నాను. ఏమైనా చేస్తాను. నా కెవ్వడైనా అన్నం పెడితే చాలు. అమ్మను మెచ్చుకోవలసిందే. చస్తానని అనుకున్నప్పటికీ నేను చావను. నాకు బ్రతకాలని ఉంది. నేను యౌవనవతిని. అందవతిని. నాకు బ్రతకాలని ఉంది. సిగ్గుతో నాకు ప్రసక్తిలేదు.

* * *

ఇల్లా ఆలోచిస్తుంటే ఉద్యోగం లభించినట్టే అనిపించింది. నేను వాకిట్లో నడుస్తున్నాను. వాకిట వెన్నెల. వసంతరాత్రి— బాలచంద్రుడు ఆకాశంలో వ్రేలాడుతున్నాడు. వాన్ని చూస్తే అందగాడనిపించింది. నల్లని ఆకాశం మీద మబ్బుతునకైనా లేదు. వెచ్చని బాలచంద్రుడు వృక్షశాఖలను తన మెత్తని కిరణాల్తో స్నానం చేయిస్తున్నాడు.

గాలి సనసన్నగా వీచింది. ఏదో మగత కమ్మినట్లు ప్రతి వస్తువూ వెచ్చగా, కొంచెంగా కదులుతూ ఉన్నది.

ఈ బాలచంద్రుడు నాలో ఆశలు చిగిర్చటానికి చిహ్నం అనుకున్నాను.

* * *

ప్రిన్సిపాలును మళ్ళీ చూడటానికి వెళ్ళాను. ఆమె ఇంట్లో లేదు. ఎవరో యువకుడు తలుపు తీశాడు. చాలా అందంగా ఉన్నాడు. చాలా స్నేహం చూపాడు. పురుషులంటే నాకు సాధారణంగా భయం. కాని ఈ యువకుడంటే నాకు భయం కాలేదు. ఆయన అడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పకుండా ఉండలేకపోయాను - అంత మనస్సు నాహరించేట్టుగా ఉన్నది ఆయన చిరునవ్వు. నే నెందుకు ప్రిన్సిపాల్‌ను చూడటానికి వచ్చానో చెప్పాను. ఆయన చాలా శ్రద్ధ చూపించాడు. సహాయం చేస్తానని వాగ్దానం చేశాడు.

ఆ రాత్రే ఆయన వచ్చి నాకు రెండు డాలర్లిచ్చాడు. నేను తీసుకోకపోతే అవి తన పిన్ని - ప్రిన్సిపాలు - పంపించిందని చెప్పాడు. నే నుండటానికి ఆమె అదివరకే ఏదో చోటు చూచి పెట్టిందనీ, నేను రేపు అక్కడికి మారవచ్చుననీ చెప్పాడు. నాకు మొదట కొంత అనుమానం కలిగింది కాని ఆయన చిరునవ్వు నా హృదయానికి తాకింది. ఇంత దయగలవాన్ని, ఇంత మనోహరంగ ఉన్నవాన్ని అనుమానించటం తప్పని అనుకున్నాను.

* * *

నవ్వుతున్న ఆయన పెదవులు నా చెంపను తాకాయి. ఆయన శిరోజాలమీదుగా నవ్వుతున్న బాలచంద్రుణ్ణి నేను చూచాను. మత్తిల్లిన వసంతవాయువు మబ్బులను విచ్చి బాలచంద్రునీ, చుక్కల జంటనూ వెలువరచింది. కమ్మని వాసనలు రాత్రిని ఆవరించుకొన్నాయి. మెత్తని వెచ్చని నేలలో అంకురాలు మొలకెత్తుతున్నవి. వసంతర్తుసృజనశక్తి

ప్రతి వస్తువుమీ ఆవరించి కమ్మని వాసనలు దిగంతాల్లో విరజిమ్ముతున్నది.

నన్ను నేను మఱచిపోయాను. నా కాత్మ లేదు. మాదక శీలమైన ఆ గాలిలో, ఆ చల్లని చంద్ర కిరణాల్లో కరగి పోతున్నట్టనిపించింది నాకు. మేఘం హఠాత్తుగా చంద్రుణ్ణి కప్పివేసింది. బాలచంద్రుని పోగొట్టుకొన్నాను. నన్ను నేను పోగొట్టుకొన్నాను. నేనూ అమ్మవలెనే అయినాను.

విచారపడుతున్నాను. కాని బరువు దిగిన ట్టనిపించింది. ఏడుస్తామనుకొన్నాను కాని చాలా సంతోషంగా ఉన్నాను. ఆ అనుభూతి ఏమిటో చెప్పలేను. ఆయన నింకెప్పుడూ చూడకూడ దనిపించింది. కాని ఆయన ఎప్పుడూ నామనస్సు మీద కూచునేవాడు. ఆయన వినా నేను ఏకాకి ననిపించింది.

నేనొక్కతెనే ఒక్క చిన్న గదిలో ఉన్నాను. ఆయన ప్రతిరాత్రి నావద్దకు వస్తుండేవాడు. ఎప్పుడు చూచినా అందంగా నాజూగ్గా ఉండేవాడు. భోజనం ఏర్పాట్లు చేశాడు. గుడ్డలు కొనిపెట్టాడు. కొత్తగాను తొడుక్కున్నప్పుడల్లా నే నందంగా ఉన్నా నన్న సంగతి నాకు బాగా తెలిసేది. ఆ బట్టలను ద్వేషించేదాన్ని, కాని వాటిని వదల్లేను.

ఆలోచించే సాహసంలేదు. మరీ సోమరినై పోయాను. ఆలోచించటం చేతకానంతగా - చెంపలకు పౌడర్ రుద్దుకొని అలాగే కూర్చొనేదాన్ని. అలంకరించుకో బుద్ధిపుట్టేదికాదు. కాని అలంకరించుకోటం తప్పేదికాదు కాలం గడపటానికి ఇంకో మార్గమేదీ కనపడలేదు. అలంకరించుకొన్నంత సేపూ అద్దంలో నా ప్రతిబింబం చూచికొని మురిసిపోయే దాన్ని. అలంకరించుకోటం అయిపోయిం తరువాత నన్ను నేను ద్వేషించుకొనేదాన్ని.

కష్టపడి ఏడుపు నరికట్టేదాన్ని కాని కన్నీళ్ళు తేలికగా వచ్చేవి. తడితడిగా మెరుస్తూ ఉన్న నా కళ్ళు చాలా ముద్దుగా కనపడేవి.

ఒక్కొకప్పుడు గాఢమైన వాంఛతో అతన్ని ముద్దు పెట్టుకొనేదాన్ని. కాని వెంటనే అతన్ని దూరంగా నెట్టివేసే దాన్ని. తిట్టేదాన్నికూడా- ఏమన్నా ఆ చిరునవ్వు మానేవాడు కాదు.

* * *

నాకు మొదటినుంచే తెలుసు- ఏమీ లాభంలే దని. ఏ మబ్బుతునకైనా బాలచంద్రుణ్ణి కప్పేయవచ్చు. నా భవిష్యత్తులో ఉన్నది అంధకారం. అనుకున్నట్టుగానే, చాలా కాలం గడువకముందే, వసంతం గ్రీష్మంగా మారుతున్నప్పుడే నా వసంతస్వప్నం అంతమైంది.

ఒకనాటి మధ్యాహ్నం ఒక యువతి నన్ను చూట్టానికి వచ్చింది. చాలా అందంగా ఉంది కాని నిరుత్సాహంగా ఉంది. బొమ్మలాంటి ముఖం. ఆమె నా గదిలోనికి రాగానే ఏడ్వటం మొదలుపెట్టింది. ఆమె ఏమీ చెప్పవలసిన అవసరం లేకుండానే నే నంతా తెలిసికొన్నాను. ఆమె నన్నల్లరిపెట్ట టానికి రాలేదు. నేనూ ఆమెతో పోరాడదలచుకోలేదు. ఏడుస్తూ ఆమె నా చేయి పట్టుకొని అన్నది "మన లిద్దర్నీ మోసగించాడు" అని. ఆమెకూడా ఒక ప్రియురాలేమో అనుకున్నానుకాని కాదు. ఆమె అతని భార్య యట. ఆమె న న్నొక్కమాటైనా అనలేదు. తేపతేపకూ ఇదే అనటం మొదలుపెట్టింది "అతన్ని వదలు, అతన్ని వదలు" అని. నా కేమిచేయవలెనో తోచలేదు. ఆమెస్థితి నాకు చాలా విచారాన్ని కలిగించింది. తుదకు నే నొప్పుకున్నాను. ఆమె చాలా సంతోషపడ్డది. పాపం, కల్లా కపటం లేని మనిషి. ఆమెకు తెలిసిందల్లా ఒక్కటే. తనభర్త తనకు కావాలి.

* * *

గంటలకొద్ది వీధులవెంట తిరిగాను. ఆమె చెప్పిన విషయం ఒప్పుకోవటం తేలికగానే జరిగింది కాని ముందు గతేమిటి? ఆయనిచ్చిన వస్తువులు నాకక్కఱలేదు. ఎల్లాగూ విడిపోతున్నాం గనుక సంబంధం పూర్తిగా తెంచుకుందామనిపించింది. కాని నాకున్న సర్వస్వమదే. ఎక్కడికి పోవాలి? ఈనాడు తినటాని కన్నమైనా దొరుకుతుందా? ఆయన ఇచ్చిన వస్తువులవల్ల కొంత డబ్బైనా రావచ్చు. సరే. ఉంచుకుంటాను వాటిని. వేరేమార్గం కనపడలేదు.

అల్లరిలేకుండా అక్కడనుంచి వెళ్లిపోయాను. వెళ్లినందుకు విచారం లేదుకాని హృదయంలో ఏదో శూన్యత. ఆకాశంలో సంచరిస్తున్న ఒక్కగానొక్క మబ్బులాంటి దాన్ని నేను. ఒక చిన్నగది అద్దెకు తీసుకున్నాను. పడుకొని ఒక్కటేనిద్ర.

చిన్నప్పటినుంచీ డబ్బువెల ఏమిటో నాకు తెలుసు. అందుచేత పొదుపులో నేర్పరిని. ఇంకా రెండు డాలర్లు మిగిలి ఉన్నాయి కాని వెంటనేవెళ్లి ఉద్యోగం వెదకాలని నిశ్చయించుకొన్నాను. దొరుకుతుందన్న పెద్ద ఆశలేమీ లేవుగాని అంతకంటె చేయదగిందేమీ కనపడలేదు. నేనో రెండేళ్లు వయస్సులో పెరిగితే ఉద్యోగాన్వేషణ కిందటిసారి కంటె సులభమౌతుందా? నేను ప్రయత్నిస్తూనే ఉన్నాను. పొట్ట పోసికోటానికి డబ్బు సంపాదించటం ఆడదాని కెంత కష్టం? అమ్మ నిజం చెప్పింది. ఆడదానికి మిగిలిన ఏకైక మార్గాన్నే ఆమె పట్టింది. ఆమార్గం నాకోసం ఎదురు

చూస్తున్నదని తెలుసు. చాల దూరం లేదనికూడా తెలుసు. కాని అప్పుడే నేనామార్గం పట్టదలచుకోలేదు.

నేను ప్రయత్నించినకొద్దీ భయమెక్కువైంది. నా ఆశ క్రొత్త చంద్రుని వెలుగు లాంటిది. కొన్ని క్షణాల్లో మాయమై పోతుంది.

రెండు వారాల తరువాత ఇక ఈ ప్రయత్నం మానేద్దామనుకుంటూ ఒక చిన్న హోటల్ ముందు ఆడపిల్లల లైనులో నేనూ నిలబడ్డాను. యజమాని నన్నెన్నుకొన్నాడు.

*  *  *

ఆ హోటల్ నేను సెకండ్ హోస్టెస్ని. టేబుల్స్‌వద్ద వేట్‌చేసే విద్య నాకేమీ తెలియదు. అంచేత నేను కొంత భయపడ్డాను. ఫస్టు హోస్టెస్ చెప్పింది ఏమీ బాధపడకని. వేటర్ వాడే చూచుకుంటాడని. హోస్టెస్ చేయవలసినపని ఏమంటే టీ సర్వుచేయడం. ముఖం తుడుచుకోవడానికి గుడ్డ అందివ్వటమూ, భోజనానంతరం బిల్లు అందివ్వటమూ.

ఫస్ట్ హోస్టెస్ ఎప్పుడూ తన ముఖానికి పౌడరద్దుతూ ఉండేది. హోటల్‌కు వచ్చినవాళ్ళకుసిగరెట్ ముట్టిస్తున్నప్పుడు ఆమె తనమోకాలితో అతనికాలును నొక్కేది. వాళ్ళగ్లాసుల్లో సారాయి పోస్తుండేది. అప్పుడప్పుడు తానూ కొద్దిగా చప్పరించేది. కొంతమందిని ఆమె చాలా శ్రద్ధగా చూసేది. ఇతరులను అసలే లెక్కచేయక పోయేది. ఆమె అల్లా వదలిన వాళ్ళను నేను చూడవలసి వచ్చేది.

నాకు పురుషులంటే భయం. నా కొద్ది అనుభవంతో తెలుసుకున్నాను ప్రేమ ఉండనీ లేకపోనీ మగవాళ్ళు పిరికివాళ్ళు. మా హోటల్‌కు మరీ తక్కువరకం వాళ్ళు వచ్చేవారు. బాగా తాగి తెగ అల్లరి చేసేవాళ్ళు. పందులవలె తినేవాళ్లు. చిన్న చిన్న విషయాలమీద తప్పులు పట్టి తిట్టేవారు.

తుడుచుకోవటానికి గుడ్డ ఇచ్చినా, టీ సర్వు చేసినా నేను ముఖం వంచుకొని సిగ్గుపడేదాన్ని. వాళ్ళు నాతో మాటాడి నన్ను నవ్వించే ప్రయత్నం చేసేవాళ్ళు. రాత్రి తొమ్మిది గంటలకు మొదటిరోజు పని ఐపోయేవరకు నా తలప్రాణం తోకకు వచ్చింది.

మూడు రోజులైన తరువాత యజమాని నన్ను హెచ్చరించాడు. ఉద్యోగం కాపాడుకోవాలంటే నేనూ ఫస్ట్ హోస్టెస్‌లాగే ప్రవర్తించాలని. నా కింకా రెండు రోజులు గడువిచ్చాడు.

తుదకు నేనా ఉద్యోగం వదలుకొన్నాను. నాకు రావలసిన డబ్బు పుచ్చుకొని — ఒకడాలర్ ఐదు సెంట్లు — వెళ్ళిపోయాను.

*  *  *

నెల దాటింది. నా కెక్కడా కొత్త ఉద్యోగందొరకలేదు.

నేను నా తోటి విద్యార్థినుల దగ్గరకు వెళ్ళాను. కొందరు మిడిల్‌స్కూల్‌కు వెళ్ళారు. కొందరు ఊరికే ఇంట్లో ఉంటున్నారు. వాళ్లతో మాట్లాడుతుంటే నేను వాళ్ళకంటె ఎక్కువ తెలివికలదా నన్నిపించింది. స్కూల్లో వాళ్లు తెలివికల వాళ్లుగా కనిపించేవారు. ఇప్పుడు వ్యవహారం కిందుమీదైంది. వాళ్ళు ఏదో స్వప్నజగత్తులో బ్రతుకుతున్న ట్లనిపించింది. తోటి యువకులను చూచినపుడు వారి కన్నులు తళుక్కుమని మెరిసేవి. వారి హృదయాలు ఊహాజగత్తులో కరగిపోయేవి.

ఆ పిల్లలను చూస్తే నాకు నవ్వువచ్చింది. కాని వాళ్ళంతే అనుకుని తృప్తిపడ్డాను. కూటి సమస్య వాళ్ళకు లేదు. కడుపు నిండివున్నప్పుడు ప్రేమను గురించి ఆలోచించటం చాలా తేలిక. స్త్రీ పురుషు లిద్దరూ ఒకరి నిరికించటానికి ఒకరు వలలు పన్నుతారు. బాగా డబ్బున్నవాళ్ళు పెద్ద పెద్ద వలలు వేస్తారు నాకు డబ్బులేదు. వల అల్లుకోటానికైనా నాకోమూల చోటులేదు. కాని నేనూ ఎవరినో ఇరికించాలి లేక నేనే ఇరుక్కుపోవాలి. ఈ విషయాలపై నేను నా తోటి విద్యార్థినులకంటె స్పష్టంగా ఆలోచించగలిగేదాన్ని.

ఒకనాడు నాకా బొమ్మలాంటి ముఖం గల యువతిమళ్ళీ కనిపించింది. నా చేతిలోనుంచి తన భర్తను విడిపించుకొన్న భార్య. ఆమెకు చాలా ప్రియమైన స్నేహితురాలితో వలెనే నాతో మాట్లాడింది. కాని కొంత దిగులుగా ఉన్నది.

"నీవు మంచిదానవు" ఆమె తడబడుతూ అన్నది. "అతన్ని వదలమన్నందుకు విచారంగా ఉన్నది. నీతోనన్నా ఉంటే బాగుండేది. ఇప్పుడింకొకర్తెను పట్టుకొన్నాడు. ఆమెతో కలిసి వెళ్ళిపోయాడు. ఇంతవరకూ కనపడలేదు."

ఆమెనడిగి తెలిసికొన్నాను. వాళ్లిద్దరూ ప్రేమవివాహం చేసికొన్నారట. ఆమె ఇప్పటికీ అతన్ని ప్రేమిస్తున్నది. నా కామెను చూస్తే విచారం కల్గింది. ఆమె ఇప్పటికీ కలలు గంటూనే ఉన్నది. ప్రేమ పవిత్రమైంది అని ఇప్పటికీ విశ్వసిస్తున్నది.

ఇప్పుడేం చేస్తావని ఆమె నడిగాను. అతన్ని ఎక్కడైనా పట్టుకుంటా నని చెప్పింది. జీవితాంతం తామిద్దరం భార్యాభర్తలమే నన్నది. ఒకవేళ ఆయన దొరక్కపోతే ఏంచేస్తావన్నాను ఆమె పెదవులు కరచుకొన్నది. ఆమెకు తలి

దండ్రులూ అత్తమామలూ ఉన్నారు. ఆమె వాళ్ళకు వశ వర్తిని. నా స్వేచ్ఛయం ఈర్ష్య వహించింది.

అయితే నాయం దీర్ష్యపడేవాళ్ళుకూడా ఉన్నారా? నాకు నవ్వాలనిపించింది. నా స్వేచ్ఛ— ఇంతకంటే హాస్య మింకే ముంటుంది? ఆమెకు తిండి ఉన్నది. నాకు స్వేచ్ఛ ఉన్నది. ఆమెకు స్వేచ్ఛ లేదు. నాకు తినటాని కేమీలేదు. మే మిద్దరమూ ఖైదీలమే. నిరాశకెందిన ఖైదీలము.

* * *

ఆమెను కలిసినతరువాత ఎవరికో ఒక్కరికే నన్ను అమ్ముకోవాలన్న భావం వదలేకాను. అన్నసంపాదనకై "ప్రేమ" నుపయోగించాలని నేను నిశ్చయించుకున్నాను. కడుపులో కాలుతున్నంతసేపూ నైతిక బాధ్యతలనుగురించి ఆలోచించవలసిన అవసరం నాకు లేదు.

నాలోనూ, నా తోటి విద్యార్థినులలోనూ ఎక్కువ భేదం లేదు. వాళ్ల కింకా కొన్ని భ్రాంతు లున్నాయి. భ్రాంతులు చెవరి ముక్కుకు సూటిగా నడచేదాన్ని నేను. కాలుతున్న కడుపుకంటె శక్తిమంతమైన సత్యం ఇంకోటి లేదు.

నా దగ్గర ఉన్న కొన్ని వస్తువు లమ్మి నే నో కొత్తడ్రెస్ కొనుక్కొన్నాను. ఇక బజారుమీద పడ్డాను.

* * *

ఈ ఆట నే నాడగలుగుతా ననుకొన్నాను. కాని పొరబడ్డాను. ప్రపంచాన్నిగురించి నే ననుకొన్నంతగా నాకు తెలియదు. మగవాళ్ళు అంతతేలికగా వలలో చిక్కలేదు. నేను కొంత సభ్యుల్లాంటివాళ్లకోసమే చూచేదాన్ని. ఒకటి రెండు ముద్దు లిస్తే తృప్తిపడేరకంకోసం చూచేదాన్ని. కాని వా ళ్లంతతేలికగా వలలో చిక్కుకునేవాళ్ళు కాదు. వాళ్ళు కేవలం నన్ను సినిమా చూడటానికే వెంటపెట్టుకుపోయే వారు. కొంతమంది వాహ్యాళికిమాత్రం వెంటతీసుకపోయే వారు. లేకపోతే ఐస్క్రీమ్ తినిపించి పంపించేశేవారు. ఇంటికి ఇంకా సగం కడుపుతోనే తిరిగి వస్తున్నాను.

ఈ సభ్యు లనబడే వాళ్లందరూ నన్ను తప్పకుండా అడిగే వాళ్ళు "ఏ స్కూల్లో చదివావనీ, నా తల్లిదండ్రు లేంచేశేవాళ్ళనీ". వాళ్ళ అర్థం స్పష్టంగానే బోధపడేది.— మా కివ్వటానికి నీదగ్గర ఏమీ లేకపోతే నీవు మా కక్కరలేదనే అర్థం. వాళ్ళకేమీ లాభం చేయటానికి సిద్ధంగా లేకపోతే వాళ్ళు మహా అయితే ఓ పదిపెంట్లు విలువగల ఐస్క్రీము ఇప్పించే వాళ్ళు. అదికూడా ఓముద్దుకు బదులుగా.

వస్తువు చేతబడ్డ తరువాత డబ్బు చేతపెట్టేవిధిగా ఈవ్యవహారం సాగగల్గుతుంది. ఆ బొమ్మ ముఖాలకు ఈ పరిస్థితి ఎలా అర్థమవుతుంది. అమ్మా నేనూ, ఇద్దరం ఈస్థితిని బాగా అర్థం చేసుకొన్నాము. అమ్మనుగురించి చాలా ఆలోచించాను.

* * *

"ప్రేమ ఆట" అది ఆడపిల్లలు డబ్బు సంపాదించవచ్చని అంతా అంటారు. కాని నా దగ్గఱ దానికి కావలసిన పెట్టుబడి లేకపోయింది. ఆ ఊహ వదిలేశాను. చేస్తే చక్కగా వృత్తి చేయాలి. నాకు గత్యంతరం కవపడలేదు. ఇంటి యజమాని వెళ్ళిపొమ్మంటున్నాడు. తాను పెద్దమనిషి వనీ, గౌరవంగా బ్రతికేవాడననీ అన్నాడు. నేను వాడివైపు తిరిగి చూడలేదు. అమ్మా, కొత్త నాన్నా, నేనూ మొదట ఉన్న గదుల్లోకి వెళ్ళాను. ఈ యింటి యజమాని గౌరవాదుల సంగతేమీ మాట్లాడలేదు. ఈయన వాడికంటే మంచివాడూ, సత్యవంతుడూ.

వ్యవహారం బాగా సాగుతున్నది. సభ్యుల్లాంటివాళ్ళు కూడా వస్తున్నారు. నేను అమ్మకానికి సిద్ధంగా ఉన్నానని తెలియగానే వాళ్లు కొనడానికి సిద్ధమైనారు. ఈ ఏర్పాటు వాళ్ళకు నచ్చింది. తమ సాంఘిక స్థాయికి ఏమీ భంగం కలుగకుండానే వాళ్ళు తమ డబ్బుకు సరియైన విలువ నాదగ్గర గ్రహించేవాళ్ళు.

మొదట ఈ వ్యవహారం మొదలు పెట్టినపుడు నాకు చాలాభయమైంది. నాకిరవైఏస్ళు కూడా రాలేదు. కాని రెండు రోజులు గడిచేవరకే భయం మాయమైంది. తడి ఇసుక కుప్పలను కూల్చినంత తేలికగా నేను వాళ్ళను దీల్వరచే దాన్ని. సంతోషించి, తృప్తిపడి వాళ్ళు తమ మిత్రులకు నన్ను అడ్వర్టయిజ్ చేసేవాళ్ళు.

కొన్ని నెలలు గడచే అప్పటికి నాకు చాలా తెలిసి వచ్చింది. మొదటిసారి చూడగానే మనిషిని లెక్కగట్ట గలిగేదాన్ని. నా దగ్గరకువచ్చే ధనవంతులు నా పూర్వ పరిస్థితులను అడిగి నన్నుంచుకొనేశక్తి తమదగ్గర ఉన్నదని స్పష్టం చేసేవాళ్ళు. ఈర్ష్యతో వస్తూ, నేను కేవలం తమ ఒక్కరి కోసమే ఉండాలని కోరేవారు. భోగం వాడల్లో కూడా గుత్తా వారికే కావాలిట, తనకు డబ్బుంది కనుక.

అల్లాంటి మనిషిని నేననలు లెక్కచేసేదాన్నికాదు. వాడికి కోపంవచ్చినా నాకు లెక్కలేదు. మరీ మాటాడితే వాడిభార్య దగ్గరకువెళ్ళి సంగతి ఆమెతో చెబుతానని బెదిరించేదాన్ని. స్కూల్లో చదివిన ఆ కొన్ని రోజులూ వ్యర్థంగా పోలేదు. నేను తొందరగా భయపడేదాన్ని కాదు. విద్యకు దాని ప్రయోజనం దాని కున్నది ఆ సంగతి నాకు బాగా తెలిసివచ్చింది.

మోసానికి భయపడి కొంతమంది కేవలం ఒక్క డాలర్ మాత్రమే వెంటతెచ్చేవారు. ఇట్లాంటి వాళ్ళకు వ్యాపారం షరతులన్నీ నేను చాలా స్పష్టంగా, విపులంగా చెప్పేదాన్ని. అప్పుడు వాళ్ళు మెల్లగా ఇంటికి పోయి ఇంక కొంత డబ్బు తెచ్చేవారు. అల్లాంటివాళ్ళు నిజంగా కడుపుబ్బ నవ్వు పుట్టించేవారు.

ఈ అందరికన్నా దుర్భరులైన పోరగాళ్ళు కొందరు వచ్చేవారు. డబ్బివ్వకపోవటం అల్లాఉంచి సిగరెట్‌పాకెట్ దొంగిలించటం, క్రీమ్‌సీసా మాయం చేయటం ఇల్లాంటి పనులు చేస్తుండేవాళ్ళు. వాళ్ళను కాదనటానికి వీల్లేదు. వాళ్ళ కెవరితో సంబంధా లున్నవో నాకు తెలుసు. వాళ్ళతో పోరాడా మంటే పోలీసులు వెంటపడ్డా రన్నమాటే. నేను వాళ్ళనేమీ అనలేదు. ఒక పోలీసు ఆఫీసరు బాగా తెలిసేదాకా వాళ్ళతో అల్లాగే ఆటాడాను. తరువాత ఒకిది తరువాత ఒకన్నిగా విదల్చుకొన్నాను. ఇది చిన్నచేపను పెద్దచేప మ్రింగే ప్రపంచం. ఎంత పెద్దవాళ్ళమైతే అంత లాభం.

అందరిలో దయనీయులైనవాళ్ళు యువక విద్యార్థులరకం. ఒకే ఒక డాలరూ కొంత పై చిల్లరా జేబులో కిణకిణ లాడుతుంటే నా దగ్గరకు వచ్చేవాళ్ళు. భయపడుతూ భయపడుతూ. ఆవేగంవల్ల చెమటబిందువులు వాళ్ళ ముక్కుకొనలమీద కూడుగట్టేవి. వాళ్ళంటే నాకు దయకలిగేది. అయినా అందరి దగ్గఱ తీసుకున్నట్లే వాళ్ళదగ్గరా డబ్బు తీసుకునేదాన్ని. నేను మాత్ర మేం చేయను?

ఇక కొంతమంది పెద్దమనుష్యులు కూడా వచ్చేవాళ్ళు— అంతా గౌరవనీయులు. వారిలో కొందరు తాతలైనవాళ్ళా. వాళ్ళతో ఎట్లా ప్రవర్తించాలో నాకు తెలియకపోయేది. కాని వాళ్ళదగ్గర డబ్బున్నసంగతి నాకు తెలుసు. చచ్చిపోకముందు ఏదో కొంత ఆనందాన్ని కొనుక్కోవాలని వాళ్లు నా దగ్గరకు వచ్చేవారు. వాళ్ళు కోరింది వారి కిచ్చేదాన్ని.

ఈ అనుభవాలవల్ల మగవారియొక్క నిజస్వరూపం, డబ్బు యొక్క నిజస్వరూపం, నేను గుర్తించాను. ఈ రెంటిలో ఎక్కువ శక్తిగలది డబ్బు. మగవాడు పశువైతే డబ్బు వాని కొవ్వు.

* * *

నాకు రోగం తగిలిందని తెలుసుకున్నాను. దానివల్ల నాకు చచ్చిపోదా మన్నంత కష్టంగా ఉండేది. విశ్రాంతి తీసుకున్నాను. వీధులవెంట తిరిగాను. అమ్మను చూడా లనిపించింది. ఆమె నాకు కొంత సుఖం కలిగించ గలదేమో! ఎందుకో చాలానాళ్ళు బ్రతుక ననిపించింది.

ఆనాడు తిక్తతో గాలిదింపుతూన్న అమ్మను చూచిన చోటికి వెళ్ళాను. కాని ఆ దుకాణం మూసేశారు. వాళ్ళెక్కడికి పోయినారో ఎవ్వరికీ తెలియదు. కాని నేను వెంట పడ్డాను. వెదకటం మానలేదు. ఎల్లాగైనా ఆమెను పట్టుకోవాలి. చాలానాళ్ళు ఆమెకోసం పిశాచంలా తిరిగాను. లాభం కనబడలేదు. ఆమె చచ్చిపోయిందేమో! ఆ షాపువాడు నగరం విడిచి చాలాదూరం వెళ్ళిపోయాడేమో!

ఇల్లాంటి విషాదకరమైన మానసికపరిస్థితికి తట్టుకోలేక నే వేడ్చాను. నాకున్నగుడ్డల్లో మంచివి కట్టుకొని, ముఖానికి రంగు రుద్దుకొని నా పక్కమీద పడుకొని మృత్యువుకోసం ఎదురు చూడసాగాను. నాకు తెలుసు చాలారోజులు బ్రతుకనని.

కాని నేను చావలేదు. ఎవరో తలుపు తట్టారు. ఎవడో నాకోసం వచ్చాడు. సరే మంచిది. రా. నాకున్న సర్వశక్తితో నా అంటురోగం వానికి 'పంప్' జేశాను. నేను తప్పుచేస్తున్నానని నే ననుకోలేదు. నా దోషం లేదే. ఈ రోగం నాతో మొదలు కాలేదే!

కొంత నయమనిపించింది. నేను సిగరెట్లు త్రాగుతున్నాను. సారాయి త్రాగుతున్నాను. బాగా అనుభవంకలిగిన ముప్పయి నలుభై ఏండ్లమనిషివలె నేను ప్రవర్తించటం మొదలు పెట్టాను. నా కన్నులకింద నల్లనిరేఖ లేర్పడ్డవి. చేతులు ఎప్పుడూ కాలుతున్న ట్లుండేవి. నేను లెక్కచేయలేదు. డబ్బే సర్వం. కడుపు నింపుకోటం మొదటి పని. మిగిలినవన్నీ తరువాత.

నా ఆహారంకూడా పేదదాని ఆహారం కాదు. ఎల్లాగూ డబ్బుదొరుకుతుంది కదా! మంచి ఆహారం ఎందుకు తిన కూడదు. సరియైన ఆహారం తిని మంచిబట్టలు కట్టుకోవాలె. అల్లాగే నాకు కొంత న్యాయం జరుగుతుంది.

* * *

పొదుగాటి పదులు గౌను తొడుక్కొని ఆ నాడు పది గంటల దాకా అల్లాగే కూచున్నాను. వాకిటిలో పదధ్వనులు వినిపించాయి. నేనప్పుడే లేచాను. అప్పుడప్పుడు మధ్యాహ్నమయ్యేదాకా బట్టలు మార్చుకొనేదాన్ని కాదు. దాదాపు చాలా సోమరినయ్యాను. అల్లాగే ఊరకే ఒక గంట సేపటి వరకూ కూచునేదాన్ని. అప్పుడప్పుడు రెండుగంటల వరకూ. ఏమీ ఆలోచించకుండా. అసలు ఆలోచించాలన్న కోరికే లేదు.

పదధ్వనులు నా తలుపును సమీపించాయి. తేలికగా, మెల్లగా. ఏవో రెండుకన్నులు తలుపుసందులోంచి నా వైపు చూస్తున్నాయని గ్రహించాను. ఒక క్షణం తరువాత ఆ కన్ను లక్కడ లేవు. నే నల్లాగే బద్ధకంగా కూర్చు

న్నాను కదిలే ఓపిక లేక. కొన్ని నిముషాల తరువాత ఆ కన్నులు మళ్ళీ ప్రత్యక్షమైనవి. ఈ సారి నేనా కన్నులను గుర్తించాను. గుర్తించటమే తడవుగా లేచి తలుపు తీశాను. "అమ్మా!"

* * *

తరువాత జరిగిన సంగతి నేను బాగా చెప్పలేను. మే మిద్దరం కలిసి ఎంతసేపేడ్చామో నాకు జ్ఞాపకం లేదు. అమ్మ మరీ పెద్దదైపోయింది. ఒక్క పెంటైనా వదలక. ఒక్క మాటైనా చెప్పకుండా ఆమె మగడు తన దారికి వెళ్ళిపోయాడట. షాపులోని ఆ కొన్నివస్తువులమ్మి ఇల్లు ఎవరికి వారికప్పగించి ఆమె పదిహేనురోజులనుంచీ నాకోసం వెదకుతున్నదట. తుదకు తానిదివరకున్నచోటికివస్తే నేనక్కడ కనబడతానేమో అనే ఆశతో ఇక్కడకు వచ్చింది. అనుకున్నట్టుగానే నేనక్కడ ఉన్నాను. ఆమెకు నాతో మాట్లాడే అంత ధైర్యం లేకపోయింది. నేను తలుపు తీయకపోతే బహుశః ఆమె తిరిగిపోయేది.

ఎప్పుడో ఏడ్పుమాసిన తరువాత నేను ఒక్కటే నవ్వు మొదలుపెట్టాను పిచ్చిగా. ఏమిటీచిత్రం. అమ్మవట్ప తుదకు కూతురును పట్టుకున్నది. కాని కూతురు వేశ్య. నన్ను పోషించటానికి అమ్మకు అవృత్తి విధిలేక చేయవలసి వచ్చింది. ఇప్పుడామెను పోషించటం నావంతు. కనుక నేను వేశ్యగా ఉండితీరాలి.

పరమసనాతనమైన ఈ వృత్తి నాకు వారసత్వంలో లభించింది. ఆడదానికై ప్రత్యేకించబడిన వృత్తి!

* * *

ఔదార్య వాక్యాలు కేవలం గాలిమాటలని నాకు తెలుసు. కాని అవి అమ్మనోట వినాలని నా కుతూహలం. ఇతరులను మూర్ఖులను చేయటం అమ్మకుబాగా తెలుసు. ఆమె మెత్తని మాటలు నాకు శాంతి నిస్తున్నవని నేననుకొనేదాన్ని. కాని అమ్మ ఇప్పుడు ఆమాటలు మరచిపోయింది. ఆకలివల్ల ఆమె శుష్కపత్రంలా అయిపోయింది. అందుచేత నా నామెను దూషించలేను.

ఆమె నా వస్తువులను లెక్కడటం మొదలుపెట్టింది. ఆదాయ వ్యయాలను గూర్చి అడగటం మొదలుపెట్టింది. నేను చేస్తున్న పనిని గురించిన చింత ఆమెకేమీ లేనట్టుంది. నేనంటురోగంతో బాధపడుతున్నానని ఆమెకు చెప్పాను. నన్ను కొన్నాళ్ళు విశ్రాంతి తీసుకొమ్మని చెప్పుతుందేమో అనుకున్నాను. అలాంటిదేమీలేదు. ఆమె ఏదో మందు కొనిపెడతానని మాత్రం చెప్పింది.

"మనమెప్పటికీ ఇదే వృత్తిలో ఉందామా?" అని నేనడిగాను అమ్మను. ఆమె జవాబు చెప్పలేదు.

అయినా అదొకవిధంగా ఆమె నన్ను ప్రేమించలేదని చెప్పటానికి వీల్లేదు. ఆమె నన్ను రక్షించదలచుకున్నది కూడా. ఆమె నాకన్నంపెట్టి నా ఆరోగ్యాన్ని గురించి ఆమె ఎప్పుడూ నా వైపు చూస్తుండేది. శ్రద్ధగైకొనేది. నిద్రిస్తున్న శిశువువైపు తల్లి చూస్తున్నట్టుగా.

ఆమె నాకు చెప్పనిమాట ఒక్కటే. ఈ వృత్తి వదలమని. నాకూ బాగాతెలుసు. ఇదితప్పు చేయటాని కింకేమీ లేదని. అమ్మకునాకూ కూడూగుడ్డ కావాలి. ఇంతేం? తుది నిర్ణయం వాటిదే. తల్లీ బిడ్డలైనా కాకపోయినా. గౌరవనీయులైనా కాకపోయినా నిత్యావసరాలకు దయలేదు.

* * *

అమ్మ నన్ను రక్షించాలనుకుంది. కాని నా ప్రక్కనే ఉండి నా నాశనాన్ని ఆమెకు చూడవలసి వచ్చింది: నే నామెతో ఎంత మంచిగ ఉందామని ప్రవర్తించినా అప్పుడప్పుడు నాకామె చాలావిసుగు కలిగించేది. ప్రత్యేకంగా డబ్బువిషయంలో సర్వాధికారం తానే వహించాలని అమ్మ ప్రయత్నించేది. ఆమె కన్నుల్లో యౌవనపు కాంతి బొత్తిగా నశించింది. కాని డబ్బు చూచి అప్పుడప్పుడా కాంతి ఆమె కన్నుల్లో మెరసేది. ఎవరైనా వచ్చినప్పుడు ఆమె కేవలం నౌకరులాగా ప్రవర్తించేది. కాని ఎవరైనా ఒప్పుకొన్న దానికంటె తక్కువ డబ్బిస్తే ఆమె వా[illegible] నానా తిట్లూ తిట్టేది.

అందువల్ల నాకు కొంత ఇబ్బంది కలుగసాగింది. ఈ వృత్తిలో నేను డబ్బుకోసం చేరినమాట వాస్తవమే. కాని అంతమాత్రంచేత వచ్చినవాళ్ళను తిట్టాలనిలేదు. నా విటులతో కఠినంగా ప్రవర్తించటం నాకూ తెలుసు. కాని నా మార్గం వేరు. నేను వారిని తేలికగా ఒప్పించేదాన్ని. అమ్మ మొద్దుగా ప్రవర్తించి వాళ్ళకు కోపం రప్పించేది డబ్బు రావాలంటే అల్లా చేయకూడదు.

నేను చిన్నదాన్ని కావటం మూలంగా నాకు తెలియదేమో. అమ్మ కేవలం డబ్బుకోసమే చూచేది. ఆమె పెద్దది కనుక అల్లా చేసేదేమో. మనిషి శరీరంతో పాటు హృదయానికి కూడా వయసు వస్తుంది. క్రమంగా మనం కఠినులమూ, దయాహీనులమూ అయిపోతాము - వెండి నాణాల్లాగా.

అమ్మ యుక్తాయుక్తాలన్నీ వదలేసింది. ఎవరన్నా డబ్బు పూర్తిగా ఇవ్వకపోతే ఆమె వారి వస్తువులు అవుకోటం మొదలుపెట్టింది. అల్లరి కావడమంటే నా కిష్టం లేదు. కాని అమ్మ చెప్పినమాట నిజమే అనిపించింది.

ఆమె అన్నది. "సంపాదించగలిగిన ప్రతి డాలరూ ఇప్పుడే సంపాదించుకోవాలి. ఈ వృత్తిలో ఒక యేడు గడిచిందంటే పదేళ్ళు పై బడ్డాయని అర్థం. నువ్వు డెబ్బయి, ఎనభయి ఏండ్ల దానివలె బనప్పుడు నీ దగ్గరకు ఎవడు వస్తాడు?" అని

ఎవడన్నా తప్పతాగినప్పుడు అమ్మ వాన్ని ఏదో మూలకు తీసుకపోయి వాని సర్వస్వమూ, బట్టల దగ్గరనుంచీ దోచుకొనేది. వింతఏమిటంటే ఆమనిషి దానిని గురించి తరువాత ఏమీ అల్లరి చేయక పోయేవాడు. వాడి కసలేమి జరిగింది తెలియనే తెలియదో. లేక బట్టల్లేకుండా చలిలో వదలి పెట్టటం వలన వాడికి నిమోనియా అయ్యేదో లేక ఆ స్థితి తన కెల్లా వచ్చిందో జ్ఞాపకం వచ్చి చెప్పుకోటానికి సిగ్గుపడి ఊరకుండేవాడో.

* * *

అమ్మచెప్పింది నిజమే. ఈ వృత్తిలో ఒకసంవత్సరం గడిపితే పదిసంవత్సరాలు పైబడుతవని. రెండు మూడేండ్ల తరువాత నేను చాలామారానని తెలియవచ్చింది. నా చర్మం నిగనిగ మాయమైంది. పెదవులు పగిలినవి. కళ్ళు ఎఱ్ఱబడ్డవి. నేను చాలా పొద్దెక్కి లేచేదాన్ని. అయినా, అలసిపోయినట్టుండేదాన్ని.

గుడ్డివాళ్ళు కాదుకనుక నా దగ్గరకు వచ్చేవాళ్ళుకూడా నాలో ఈ మార్పును కనిబెట్టారు. పాతవాళ్ళు క్రమంగా రావటం మానుకున్నారు. కొత్తవాళ్లను నేను సంతోషపెట్టటానికి ఎంత ప్రయత్నించినా అప్పుడప్పుడు నాఓర్పు నశించిపోయేది. పిచ్చిగా వదరేదాన్ని. కోపంతో ఏమేమో అనేదాన్ని. నన్ను నేను మఱచిపోయేదాన్ని. అర్థం లేకుండా మాట్లాడటం నాకలవాటైంది.

నా 'చిన్నారి చిలక' తనం నాలోంచి పోయింది కనుక నాదగ్గరకు వచ్చే సభ్యజనులు రావటం మానుకున్నారు. మరి వీధుల్లో తిరిగే దానిలా ప్రవర్తించటం నాకు నేర్చుకోవలసివచ్చింది. వేషగాళ్లవలె అనాగరకంగా రంగుపూసుకుని మూర్ఖులను కొందరి నాకర్షించాను. లిప్‌స్టిక్ పెదవులకు మరీదట్టంగా పట్టించేదాన్ని. వాళ్ళు సంతోషపడేవాళ్ళు.

మెల్లమెల్లగా చచ్చిపోతున్నానని తెలుస్తూనేఉంది. నేను సంపాదించిన ప్రతిడాలరూ నన్ను మృత్యుముఖానికి దగ్గరగా తీసుకపోతున్నది. డబ్బు జీవితాన్ని రక్షిస్తుందనే అందరనుకొంటారు. కాని నేను సంపాదించిన విధానంలో అది వ్యతిరేక ప్రభావం చూపించటం మొదలుపెట్టింది. చస్తున్నానని తెలుస్తూనేఉంది. నేను చావుకోసం ఎదురు చూడసాగాను.

ఈ మనః పరిస్థితిలో దేన్నిగురించీ ఆలోచించ దలచుకోలేదు. ఆలోచించవలసిన అవసరమూ కనపడలేదు. ఏనాటి కానాడు బ్రతుక దలచుకున్నాను— అంతే.

నా భవిష్యద్రూపానికి అమ్మ ప్రతిబింబం. కొన్ని సంవత్సరాలు శరీరం అమ్ముకొన్నతరువాత ఆమెకు మిగిలినవి తెల్లని వెంట్రుకలూ, నల్లని ముడుతలుబడ్డ చర్మమూ. అదీ జీవితం.

* * *

బలవంతంగా నవ్వేదాన్ని. కొంత కన్నీరు కారిస్తే మాత్రం నాలో ఉన్న విషం క్షీణమవుతుందా? నాజీవన మార్గంపై నా కేమీ ప్రేమలేదు. కాని ఎంతైనా ప్రాణంకిదా దాన్ని నేను పోగొట్టుకో దలచలేదు. కాకుండా ఈ వృత్తి నవలంబించటంలో నా దోషమేమీలేదు. ఈ బ్రతుకుమీద ఇంతప్రేమ ఉండటంచేతనే మృత్యువుఅంటే అంత భయపడ్డాను మరణబాధఅంటే నాకు భయంలేదు. ఎంత కష్టపు మరణమైనా ఈ నా జీవితంకంటె సుఖంగానే ఉంటుంది. నేను ప్రేమించింది బ్రదుకునూ, జీవితాన్నీ, నాజీవన మార్గాన్నికాదు.

ఒక లక్ష్యభూతమైన జీవితాన్ని చిత్రించ మొదలు పెట్టాను. అది కలలా తోచసాగింది. కాని మళ్లీ వాస్తవానికి రాగానే అకల మాయమై నేను మునుపటికంటే ఎక్కువగా బాధపడేదాన్ని. ఈ ప్రపంచం స్వప్నం కాదుకదా— ఇదో ప్రత్యక్ష నరకం.

అమ్మ నా బాధను పసికట్టింది; నన్ను పెళ్ళిచేసుకోమని చెప్పింది. మగడు దొరికితే నన్ను పోషిస్తాడు. ఆమెకూ ఏదో కొంత దొరుకుతుంది. ఆమె ఏకమాత్ర ఆశాభావాన్ని నేనే. కాని నన్నెవడు పెళ్లాడతాడు?

నే నంతమంది పురుషులతో సంబంధం పెట్టుకున్న దాన్ని కాబట్టి, ప్రేమ అంటే ఏమిటో బొత్తిగా మరచిపోయాను. ఎవడిని మాత్రం నే నెందుకు ప్రేమించాలి? అయినప్పటికీ నన్నెవడైనా పెళ్ళి చేసుకునే వాడంటూ ఉంటే వాన్ని ప్రేమించినట్టు ప్రవర్తించాలి. శేషజీవితమంతా వానితో కలిసి గడుపుతానని చెప్పాలి.

ఆ మాటే నే నిదివరకు చాలామందికి చెప్పాను. ఒట్టు పెట్టుకొని చెప్పాను. కాని ఎవ్వడూ నన్ను పెళ్లాడకోరలేదు. ధనం యొక్క స్వామ్యం పురుషులను చాలా తీక్ష్ణులను చేస్తుంది. నాతో వ్యభిచరించడం వాళ్ళకిష్టమే. భోగమిండ్లకు వెళ్ళటం కన్నా ఇందులో వాళ్ళకు డబ్బు ఖర్చు తక్కువ.

నేను పందెం వేసి చెపుతున్నాను. వాళ్ళకేమీ ఋద్ధి లేక పోతే ప్రపంచంలోని మగాళ్ళంతా చెప్పకలరు, నన్ను ప్రేమిస్తున్నామని.

* * *

సరిగ్గా ఆ సమయానికి నే నరెస్టయ్యాను. మా నగరానికి వచ్చిన క్రొత్త పోలీస్ కమీషనర్ నీతి పథాన్ని తప్పేవాడు కాదని వాడుక. రిజిస్టర్ కాని బోగమిండ్లన్నీ తొలగించాలని ఆయన పట్టుదల లైసెన్సున్న ఆడవాళ్ళు వృత్తి కొనసాగించవచ్చు. ఎందుకంటే వాళ్ళు పన్ను కట్టుతారు.

నన్ను పట్టుకొన్న తరువాత నన్ను రిఫర్మేటరీకి పంపించారు. అక్కడ నాకు బట్టలుతకటం, వండటం, కుట్టటం నేర్పారు. ఈ పనులన్నీ నా కిదివరకే వచ్చు. ఈ పనులు చేసి నేను నా పొట్ట పోసికోగలిగితే ఆ దిక్కుమాలిన వృత్తి ఎన్నడో వదలిపెట్టేదాన్ని. ఈ సంగతి నేను రిఫర్మేటరీ వాళ్ళకు చెప్పాను. కాని వాళ్ళు నమ్మలేదు. నేను లోఫర్ ననీ, నీతిలేని దానినని వాళ్ళంతా అన్నారు. పని చేయటం నేర్చుకోవటమే కాకుండా. పనిలో ఇష్టం కనబరుస్తే నన్ను నేను పోషించుకోవచ్చుననీ, భర్తను కూడా సంపాదించుకోవచ్చుననీ వాళ్ళన్నారు.

వాళ్ళందరికీ అదో ఆశ. వాళ్ళకున్న విశ్వాసం నాకులేదు. పది పన్నెండు మందిని "సంస్కరించా"మనీ. వాళ్ళకు భర్తను సంపాదించి పెట్టామనీ రిఫర్మేటరీ వాళ్ళకు గర్వంగా ఉండేది. రెండుడాలర్ల లైసెన్సు డబ్బు చెల్లించిన వాడెవడైనా వచ్చి రిఫర్మేటరీలోంచి భార్యను ఏరుకొనిపోవచ్చు.

నాకది బాలా హాస్యంగా ధ్వనించింది. నేను "సంస్కరింప" బడటానికి నిరాకరించాను. ఎవడో పెద్ద అధికారి మమ్మల్ని చూడవచ్చినపుడు నేను వాని ముఖంమీద ఉమ్మి వేశాను. వాళ్ళు నన్ను వదలిపెట్టలేదు. నేను అపాయంచేసే వ్యక్తినన్నారు. నన్ను వాళ్ళ సంస్కరించతాలలేదు. కనుక ఇంకోచోటికి పంపించారు. దానిపేరు జైలు—

* * *

ఈ జైలు చాలామంచిచోటు. మానవులకు మోక్షంలేదని ఇది మనలో అచంచల విశ్వాసం కల్పిస్తుంది. ఇల్లాంటి కలుగు ఒకటుంటుందని నేను కలలోకూడా ఊహించలేదు.

కాని ఇక్కడ ఓసారి చేరుకున్న తరువాత బయటికి పోయే ఊహలన్నీ వదిలేశాను. నా అనుభవంవల్ల తెలుసుకున్నాను, బయటి ప్రపంచం ఇంతకన్న మంచిదేం కాదని.

ఇంతకంటె మంచిచోటు దొరికితే ఇక్కడ చావాలని నాకులేదు, కాని బయట ఎట్లా ఉంటుందో నాకుతెలుసు. ఎక్కడచచ్చినా ఒక్కటే.

ఇక్కడ మళ్ళీ నాపాత స్నేహితుణ్ణి చూశాను. వాడే ఆ బాలచంద్రుడు. చాలనా[illegible]ంది వాన్నిచూచి.

అమ్మ ఏంచేస్తున్నదో!

నిద్రకోసం అల్లాడుతున్న చిన్నారి పూరేకుల్ని కదల్చి వాటిని విప్పుతున్న సాయంవాయువులా ఈ చంద్రుడు నా స్మృతుల్ని తట్టి లేపుతున్నాడు.

— అనువాదం: బువ్వాడి గౌతమరావు

## గురజాడ అకవి

పై శీర్షిక క్రింద నిప్పటికే వాద ప్రతివాదములు కొన్ని జరిగినవి. వాని నన్నింటిని మొదటినుండి చదువుచున్నవారిలో నేనొకఁడను. మార్చి.ఏప్రిల్ జయంతి సంచికలలో "హాసజ"గారు వ్రాసిన వ్యాసములలో నాకు కొన్ని అసహజములు కన్పించుట వలన నే నీ వ్యాసమును వ్రాయవలసి వచ్చినది. "హాసజ"గారు శ్రీ సీతారామరావుగారిని సరిగా నర్థము చేసికొనకుండుట, కవిత్వ నిర్వచనము సమగ్రముగా నీకుండుట న న్నీ వ్యాసమునకు బురికొల్పినవి. దర్శనము. ప్రకటనము కవిత్వమున కవసరములని యంద అంగీకరింతురు. రెండును ముఖ్యములనుచు దర్శనముపై "హాసజ"గారు మొగ్గుఁజూపిరి. ప్రకటనపై సీతారామరావుగారు మొగ్గుఁజూపిరనుకొనిరి. తాటిచెట్టు నెందు కెక్కితివన దూడమేత కన్నట్లుండును. ఎందులకో యెక్కితిని. నీ కేమి యన్నచో తిరిగి యెవరును ప్రశ్నింప వీలుండదు, దూడమేత కనఁగనే అది యక్కడ నెట్లు లభ్యమగునని ప్రశ్నింప వీలుండునుగదా! ఒక వ్యక్తియొక్క కవితా విమర్శన సమయమున మన మనస్సునం దుంచవలసినది వారి కవితా విషయమేగాని వారివ్యక్తిగతమైన మంచి చెడ్డలు కావు. అందుండు గుణాగుణములబట్టి అది కవిత్వ మగునో కాదో నిర్ణయింపవలెనుగాని కర్త సుగుణములు కావ్యమున లేకున్నను నున్నటుల విమర్శకులు భావింపరాదు.

అప్పారావు గారి కవిత్వ పద్ధతిని విమర్శించిన వారు శ్రీ పొట్లపల్లి సీతారామరావుగారు. వారిని విమర్శింపఁబూనినవారు శ్రీ 'హాసజ' గారు. ఇందు గల్గిన సందేహములుమాత్రము బయటపెట్టువాడను నేను. ఇప్పుడు సామాన్య మానవుడు కవిగా నెట్లు మార్పుబొందునో యీ క్రింది పట్టిక వలనఁ దెలియును.

వేదమ్ముల్ నృపశాసనమ్ములు, సుహృ ద్విజ్ఞాపనంబుల్ పురా
ణాది గ్రంథము లంగనా జన విలాసాలాప లీలా సము
ప్రాదుర్భావము లౌర కావ్యములు, కర్తవ్యోపదేశ క్రియా
వాదప్రక్రియ నెన్న, కావ్య మహిమల్ వర్ణింపగా శక్యమే!

| | వ్యక్తి | ఉద్దేశము | దర్శనము | సమాధి | ప్రకటనాసాధనము | కృతి | కర్త |
|---|---|---|---|---|---|---|---|
| I | సామాన్య మానవుడు (అ) | కర్తవ్యోపదేశము (ఆ) | సత్య. జ్ఞాన సంపాదనము విషయ పరిజ్ఞానము (వ్యుత్పత్తి) (ఇ) | లేదు (ఈ) | శాసనముల వంటి రచన (ఉ) | శాస్త్రము (ఊ) | శాస్త్రకర్త (ఋ) |
| II | సామాన్య మానవుడు (అ) | కర్తవ్యోపదేశము (ఆ) | సత్య జ్ఞాన సంపాదనము చిం— (ఇ) | లేదు (ఈ) | సుహృద్విజ్ఞాపనము వంటి రచన (ఉ) | పురాణము (ఊ) | పురాణకర్త (ఋ) |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| III | సామాన్య మానవుడు | కర్తవ్యోపదేశము | సత్య జ్ఞాన సంపాదనము (ఇదే 'హాసజ' గారు చెప్పిన దర్శనము) | దీనిని కాన్సెంట్రేషన్ అని క్లైవ్‌బెల్ అన్నారు. ఇచ్చట సత్య జ్ఞానములు, భావనా మయములై రమ్యములై కావ్య వస్తువులుగా మారుట కర్హత సంపాదించును. అనగా నిచ్చట కవితాముద్ర పడును. ఇచ్చట మానవుఁడు సమర్థుఁడయ్యును కవిగా బయటపడడు. | కాంతా సమ్మితమగుటచే రమణీయార్థ ప్రతిపాదక శబ్దములతోడి రచన. ఈ ప్రకటనతో మానవుడు కవి యని లోకముచే గుర్తింపబడును. | కావ్యము | కవి |
| | (అ) | (ఆ) | (ఇ) | (ఈ) | (ఉ) | (ఊ) | (ఋ) |

ఇందువలన సామాన్య మానవునికి కవి యనిపించుకొనగల శక్తి సామర్థ్యములు సమాధ్యవస్థ యందు గల్గును. కొన్నిచోట్ల సమాధి యుండకపోవచ్చును. అట్టిచో ప్రకటనయందే కవిగా మానవుడు బయటపడును. కేవల కర్తవ్యోపదేశముననే కవిగాడు. అట్లయినచో కర్తవ్యోపదేశము రాజకీయ వాదులకును ప్రధానమే! వారిని కవులనముగదా! ఈ సందర్భమున శ్రీ సీతారామరావుగారి వ్యాసములో (మొదటిపేరా) "లోకములో రచయితలు పేరు ప్రతిష్ఠలు పొందుటకు కారణములనేకములుగా నుండును.... కవులుగా చలామణిగా ప్రయత్నించెడి కీర్తికాములు" మున్నగు విషయములు సమంజసములైనవి. సీతారామరావుగారి వ్యాసములో పరస్పర విరుద్ధములుగానున్న భావములు గోచరమగుచున్నవని శ్రీ "హాసజ"గారిట్లు వ్రాసిరి. "ఒకప్రక్క కవితా శక్తియే అనగా ప్రకటనాశక్తి, వర్ణనాశక్తియే విమర్శకుల కొలబద్దయని చెప్పుతూ, మరో ప్రక్కన కవయః క్రాంత దర్శినః, నానృషిః కురుతే కావ్యం" అని యంటారన్నారు. ఇవి అనవసరమన్నారు. పైగా దోషమన్నారు. కవిలక్షణములు రెండుగా వారును విభజించిరి. (దర్శనశక్తి వర్ణనశక్తి యని). వర్ణనశక్తినే ఆధారముగా తీసికొని సీతారామరావుగారు వాదించిరని చెప్పిరి. దర్శనశక్తి కవయః క్రాంతదర్శినః, నానృషిః కురుతేకావ్యం అన్నవాని సారాంశమేయని వారే యనిరి. వాని సారాంశము దర్శన శక్తికి సంబంధించినదేకదా! అట్టిచో రెండును ముఖ్యములనియే కదా వారి యభిప్రాయము! వారు కేవలము ప్రకటనాశక్తి యనియే చెప్పిరా! వీ రూహించిరి. ఇది సమ్యక్పరిశీలనా లోపము. అయినను దర్శనశక్తివలన సమాధ్యవస్థలో కవితా సామర్థ్యము కల్గును. దానిని ప్రకటించుట బట్టియే అతడు కవిగా లోకమున వ్యవహరింపబడును. దర్శనశక్తితరువాత సమాధ్యవస్థయున్నది. దర్శనశక్తి, శాస్త్రకర్తకు, పురాణకర్తకు, కవికి సమములే. 'దృశ్' అను ధాతువునుండి పుట్టిన దర్శనమునకు చూపనియే కదా అర్థము. దానిని బట్టి కవిగా గుర్తింపలేము. ప్రకటనకు సహాయభూతమగునదే దర్శనము. దర్శనము లేని ప్రకటన కవితాపుష్టి కల్గియుండదు. ప్రకటనా సాధనముమ బట్టియే అతడు కవియని మన మూహింపగలము. అనఁగా నొక వస్తువునుజూచి దాని యనంతత్వము నాంతర్యము గోచరింపఁ జేసికొనుటయే దర్శనశక్తి. దానిని పఠితలకు విదితము చేయుట ప్రకటనాశక్తి. వా రుపయోగించెడి సాధనమునుబట్టి ప్రకటనాశక్తియు ముత్తెఱంగులు. సమ్యగ్దర్శిత

వస్తుసౌందర్యమును పాఠకున కెట్లు తెలియఁజేయ వలెను? సామాన్యులు వస్తువు నీక్షించు పద్ధతి వేఱు. కవులు వస్తువును పరీక్షించు పద్ధతి వేఱు. కవికి వస్తుదర్శనానంతరము సమాధ్యవస్థలో నా భావములు రమణీయముగా మారి దానిని వ్యక్తీక రించుటకు గూడ పదలాలిత్యము, భాషాసౌకుమా ర్యము కావలసివచ్చినది. రమణీయమైన బంగరు వస్తువులను మొరటు చెక్కపెట్టెలో దాఁతురు గదా! దానికి ప్రత్యేకమైన పెట్టెయుండి యందు మెత్తదనమునకై తగు నేర్పాట్లుండును అదియు నింతే.

ఇచ్చట కవిని నటునితోఁ బోల్పవచ్చును. నటుడు పాత్ర శీలస్వభావాదులను గుర్తెఱిఁగి ఓహో!ఇది యిట్టిదా యనుకొని దానినతడు వ్యక్తీక రించుటకు నభినయాదుల సహాయ మపేక్షించును. పాత్ర నర్థముచేసికొనుట కవికి దర్శనములభించుట వంటిది. దాని నభినయాదులద్వారా ప్రకటించుట కవి భాషాసౌకుమార్యముచేతను పదలాలిత్యాది విశేషములచేతను వెల్లడించుటవంటిది. కేవలము పాత్రలో నైక్యమయిన నటుడు నటించలేడు. అప్పు డా పాత్రలో తన్మయుడై పూనినవానివలె స్తబ్ధుడుగా నుండుటయో, లేక వెఱ్ఱివానివలె పిచ్చి కేకలు వేయుటయో జరుగును. అందుచే నటునికి పాత్రలో లీనమగుట యెంతముఖ్యమో, దానినినటించి అభినయాదులచేత ప్రేక్షకలోకమును మెప్పించుటయు నంతముఖ్యమే! కవి కటులనే దర్శన మెంతముఖ్యమో, భావములను రమణీయ ములుగా మార్చుకొనుట యెంతముఖ్యమో, ప్రకటనాశక్తికూడ నంతముఖ్యమే! దర్శనశక్తి వలన కవి కానందము గల్గినను నతఁడెట్టి యానం దము నెంతగా పొందుచున్నాడో మనకు తెలియదు. అందువలన నత డే మహాత్ముడనియో చెప్పవలెను. కవియని చెప్ప వలను పడదుగదా! ముమ్మిడివరములో నొక యోగి సర్వమునందు ననుభూతి గాంచుచుండునట. అందుచే నతని కవి యనగలమా!

"ఈ సైక్యానుభూతి కవికి హృదయస్పందంలో సిద్ధించింది. కవి యీ సత్యాన్ని భావాలద్వారా గోచరంచేస్తాడు. అనగా మానవహృదయాలను స్పందింపజేస్తున్నది యథార్థమే కాబట్టి దానిని హృదయస్పందాలద్వారానే భావాలద్వారానే కవి గోచరం చేస్తాడు." అన్నారు "హంసజ"గారు హృదయస్పందాలుగాని, భావాలుగాని, భాష ద్వారానే వ్యక్తంచేయాలికదా! అది ప్రకటనా శక్తికి సంబంధించినదేకదా! కాబట్టి యెవరు కొల్చినా, కవిని కొల్చుటకు దర్శనశక్తి ప్రకటన శక్తి రెండును కొలబద్దలే. ఈ రెండు కొలబద్దలకు తక్కువైన కుబ్జుడు మహాకవినామార్హుడు కాడు గదా! ఈ రెండును నుండవలెనని పేర్కొనుచు ప్రథమ విమర్శకులీ రెంటిని పేర్కొన్నప్పుడు దోష మన్నారు. పైన పట్టిని పరీక్షించినచో దర్శనశక్తి వలననే కవియనిపించు కొనడనియును, ప్రకటనా శక్తికి దర్శనశక్తి ఆధారమనియును తేలును. "హంసజ"గారి విమర్శనము స్వవచనవ్యాఘాతము నకు దారితీసినది.

శబ్దవిన్యాస తీవ్రతకు "హంసజ"గా రిచ్చిన ఉదా హరణములను కొందఱికవుల రచనలతో పోల్చి చూచిన పేలవముగా నుండును. వస్తువు భావనా మయమైనదని చెప్పుటకు యీ పద్యమును జూపిరి.

"పళ్ళను మీరిన తీపులనడలను*
పువ్వులమీరిన పోడుములన్
అంగములందున నమరెను పూర్ణకు
సౌరులు మించెను నానాటన్."

ఇందు మొదటిపాదములో నడకలకు తీపియాపా దింపబడినది. అదియైనను మధురములైన ఫలము లను మించిన తీపి. నడకలకు తీపియుండునా? నడచునప్పుడు నడకలకున్న తీపి యెట్లనుభవ యోగ్యము? ఇది భావించినకొలది జుగుప్సావహ

* అచ్చులో నడలని పడినది.

ముగానున్నది. ''హనజ''గారు సీతారామరావుగారు వ్రేలెత్తిచూపిన వానిసంగతి వ్రాయుదుమనిరి. కాని వారి యుదాహరణలు వేఱు. వీరుచూపినవి వేఱు. ఒకవస్తువును కొనుటకుపోగా, అమ్మువాడు దాని సుగుణములనే ప్రకటించును. అందుగల దోషములు జూపినను మరియొక విధముగా సమర్థింపఁజూచును. అంతమాత్రముచేత నా వస్తువును వీరు కొననూ కొనరు. అది వస్తువునూ కాకపోదు. దాని ఉత్తమ మధ్యమాధమత్వములు దాని గుణబాహుళ్యమునుబట్టియే యుండును.

—కావూరి పూర్ణచంద్రరావు

# గురజాడ, వేమన, శ్రీశ్రీ

శ్రీ పొట్లపల్లి సీతారామరావుగారు గురజాడను 'అకవి'గా నిరూపించేందుకు సల్పిన కృషి సుడిగాడ్పువలెవీచి, కొంతదుమారంలేపి, అణగిపోయినా, వారి కోవకుచెందిన మహాశయులు కొందరు తమను తామింకా నిమ్మళపరచుకోలేక, కొసవిసుర్లు విసురుతున్నారు. యుక్తియుక్తంగా ఎన్నివాదనలు చేసినా, ఒకసత్యం అబద్ధంకాబోదు. వేళ్లుతన్ని గట్టినేలపై నిలిచినచెట్టు యీకొసగాడ్పులకు కూలి పడబోదు.

ఎవ్వరి కవిత్వమేగాని దోషరహితమైనంతనే గొప్పదికాదని, గుణమహితమైతేనే గొప్పదని శ్రీ జువ్వాడి రామేశ్వరరావుగారు "జయంతి" పడవసంచికలో వ్రాసినమాటలతో నే నేకీభవిస్తాను. శ్రీ సీతారామరావుగారు గురజాడ కవిత్వము గుణరహితము, దోషభూయిష్ఠముగా సిద్ధాంతీకరించినారు; గురజాడను సమర్థించేవారు చేయవలసినపని, అది దోషరహితమని నిరూపించడంకాక, గుణమహితమని స్థిరీకరించడమేనని వారంటున్నారు. శ్రీ సీతారామరావుగారు ఎత్తిచూపిన దోషాలు దోషాలుకావని నాబోటివారు "అభ్యుదయ", "స్వతంత్ర" పత్రికలలో చూపబూనినారు. దోషముకానిది గుణమేకదా అవుతుంది? ఇంతకూ సీతారామరావుగారు దోషాలను చూపితే చూడడము, మరొకరు గుణాలనుచూపితే చూడడము-యింతేకాని, సహృదయులు తమంత తాముగా గుణదోష నిర్ణయం చేసుకోలేరా? శ్రీ రామేశ్వరరావుగారు యింకొకవిషయంమరిచారు విమర్శకుని పని దోషాన్వేషణ ఒక్కటేకాదని వారు నాతో అంగీకరించకపోరు. శ్రీ సీతారామరావుగారికి కనిపించినవి దోషాలే. పురోభాగిత్వాన్ని శ్రీ రామేశ్వరరావు బోంట్లు సమర్థిస్తారా?

ఏదో రాజకీయపక్షం పనికట్టుకొని గురజాడను మిన్నుల కెత్తిందని శ్రీ రామేశ్వరరావుగారు చెప్పుచున్నారు. కొంతవరకు ఇది నిజమనే చెప్పవచ్చు. కాని ఆ రాజకీయపక్షమే బుర్రకథలకు, జముకులకథలకు, వీథిభాగవతాలకు, గొల్లసుద్దులకు ప్రాణంపోసి, నాటకకళలో ఒక విప్లవాన్ని తెచ్చిందని వారు మరచిపోరాదు. ఇది ఒక రాజకీయపు ఎత్తుగడ అంటే, అది ఆత్మవంచన కాక తప్పదు. జాతియొక్క రాజకీయ పునరుజ్జీవనానికి యీ దేశికళారూప పునరుద్ధరణం ఒక సోపానం, ఒక సాధనం. ఈ దేశిపునర్వికసనంలోనే గురజాడవారి స్థానం. ఇతర రాజకీయపక్షాలలో లోపించిన, లేదా తృణీకరింపబడిన యీ సంస్కృతీ పిపాస ఆ రాజకీయ పక్షంలో మెండైనదంటే, దాని నభినందించేందుకు మారు, తప్పు పట్టడం భావ్యమా?

ప్రచారం చేయడం, తమ వుద్యమానికి అభ్యుదయ మని పేరుపెట్టుకొన్నవారిలో ఒక ప్రబలమైన "వ్యాధి" అని శ్రీ రామేశ్వరరావుగారు అంటున్నారు. తాము చేసే దొక్కటే సత్యప్రకటన అని భావించే దృక్పథం తమ మానసికారోగ్యానికే గొప్పముప్పు కలిగిస్తుంది. లోకాన్ని సరిగా చూడనివ్వదు; చూచినదాన్ని సరిగా బోధపరచుకోనివ్వదు. ఫలితం, ఆత్మసంతృప్తి. సహృదయతానష్టి.

ఇక 'సాహిత్యధార' అనే శీర్షిక క్రింద శ్రీ 'సమవర్తి', 'అభ్యుదయ' సంచికలో వేమన గురించి శ్రీశ్రీ చూపిన ఒక చిత్రమైన విమర్శాదృక్పథం పట్ల తమ అపహాస్యాన్ని ప్రకటించారు. ఇది శ్రీశ్రీ గారి "అవ్యవస్థిత మనస్కత" కు నిదర్శనంగా చూపినారు. వ్యవస్థ, వ్యవస్థ అని యీ నడుమ "జయంతి" పత్రికలో తరచు వినబడుతుంది. విమర్శాసంప్రదాయమొకే ఒకటి, ఏకశిల (monolith) వలె, యీ తెలుగునాట ఒకటి లేదని, యిది అవ్యవస్థకు దారి తీస్తుందంటున్నారు. వీరి దృష్టిలో "వ్యవస్థ" అంటే, ఎదుగుబొదుగు, మార్పుచేర్పు, వృద్ధి వైపుల్యాలు లేని జడపదార్థమన్నమాట. గురజాడను సమర్థించేందుకని, చరిత్రను త్రవ్వి, వేమన్నను యెత్తి పట్టుతున్నారని 'సమవర్తి' పొరబడినారు. ఒకటి, వేమన్న మట్టిక్రింద పూడిపోయి విస్మృతిపాలు గాలేదు. రెండు, వేమన్నద్వారా గురజాడను సమర్థించవలసిన పనిలేదు. గురజాడలో వేమన్న యొక్క కొన్ని కవితాగుణాలను దర్శించబట్టే శ్రీ.శ్రీ.గారు ఇరువురిని ప్రస్తావించారు. నొవ్వించనిదీ, ప్రయోజనమున్నదీ వారిద్దరి హాస్యము. విమర్శ వారిద్దరిది, సమకాలీన మౌఢ్యాలను, కాపట్యాలను వెలికీడ్చి, ముసుగులను చీల్చి, నిష్ఠురమైన నిజాన్ని లోకానికి చూపినట్టిది. ఒకరు ఆటవెలదిని, మరొకరు ముత్యాల సరాన్ని చేబూని, విషయజాటిల్యానికి భాషా జాటిల్యం జతచేయకుండా, సామాన్యుల నుద్దేశించి, సూటిగా తేటగా చెప్పినవారు. అట్లాగే కన్యాశుల్కమూ, మృచ్ఛకటికము ఒకే మొక్కట్లుగల నాటకాలు. కాని వేమన్న, గురజాడలు మాత్రమే మహాకవులని, మృచ్ఛకటికము, కన్యాశుల్కము మాత్రమే గొప్పనాటకాలని ఎవడైనా మూర్ఖుడే భావిస్తాడు.

శ్రీ "సమవర్తి" రామాయణం నడుమ పిడకల వేటకు బయలుదేరి మాస్కోను దర్శించి వచ్చారు. మృచ్ఛకటికాన్ని ప్రదర్శించవలసిందని శ్రీ.శ్రీ. గారు కాని, "సమవర్తి" కాని, మాస్కోకు సలహా యివ్వవలసిన అవసరంలేకుండా, యీ ఉభయులు తమ తమ వ్యాసాలు వ్రాయడాని కెంతో ముందు, బోల్షాయి థియేటరువారు దానిని ప్రదర్శించారు. పతితజాతులైన వసంతసేనా మధుర వాణులకు మాస్కోలో కలుగగల అధికతర ప్రాముఖ్యం "సమవర్తి" గారు సరిగా గుర్తించారు. స్త్రీలను కొందరిని సామూహిక పశుతృష్ణకు లోనుగావించి, రొక్కంతో రోగాలను, రోతలను వారి కర్పించి గర్వించే మన సమాజంలోకంటె, వేశ్యను 'కామ్రేడ్!' అని చేరబిలిచి కలుపుకోగల మానవత్వం గలిగిన గోర్కీ వంటి మహనీయుల పురిటిగడ్డలో ఎక్కువ ఆదరణ తప్పక లభిస్తుంది. అందుచేతనే ఒక పాల్ రోబ్సన్ అక్కడ గౌరవింపబడడం! అందుచేతనే, జన్మస్థానమైన అమెరికాలో సన్నగిల్లిన 'హాయవాతా' కావ్యప్రశస్తి మాస్కోలో యినుమడించడం! అందుచేతనే దక్షిణ ఆఫ్రికా భారతీయుల సమస్యకు మాస్కోలో ఎక్కువ మద్దతు రావడం! వీరేశలింగం, రఘుపతి వెంకటరత్నంవంటి ఆంధ్రామరుల సంస్కరణోద్యమాలను మట్టిపాల్జేసిన వారి భావాలకు వారసత్వం తీసికొన్న కొందరు యీ విషయాల్ని ఎట్లా గమనించగలరు?

వ్యవస్థ, విమర్శ, సంప్రదాయం అంటూ బరువు మాటలు నోటబెట్టి చాల తేలికైన అప్రస్తుతమైన కువిమర్శలకు పాల్పడి, కొందరు విమర్శకులు, విమర్శలో విషాన్ని, ద్వేషాన్ని, పాక్షిక దృక్పథాన్ని పూర్వ మాత్ర ప్రశంసను దూర్చి, హేతుబుద్ధిని పిడకలలో కాల్చుతున్నారు. ఈ బడా చోటా "గంద్రగొడ్డళ్ళు" సాహిత్యవిమర్శలో అనవసరంగా ప్రచ్ఛన్న యుద్ధ భాషను, వర్గ విద్వేష భాషను చొప్పిస్తున్నారు. ఏదో సాంఘిక, మత విషయిక, రాజకీయ ప్రయోజనాన్ని ఆశించి, ప్రస్తుత సంఘ వ్యవస్థతో విడదీయ లేనంత బాంధవ్యం కలిగిన పండిత వ్యవస్థ పన్నిన దుస్తంత్రంగా దీని నెందుకు భావించకూడదు?

—కె. వి. రమణారెడ్డి

## సింహబలి

లోగడ నా 'సింహబలి' వ్యాసంపై జయంతిలో విమర్శ ప్రకటింపబడ్డది. అందు కొన్నిటితో నేను ఏకీభవిస్తాను. కొన్ని చోట్ల మాత్రం సమీక్షకుల ఆక్షేపణలు సరియైనవి కావని భావిస్తాను. నేను ఎన్నడూ నిఘంటువు దగ్గర పెట్టుకొని పదాలు ఏరి కూర్చలేదు. నేను వాడిన శబ్దజాలమంతా పూర్వ ప్రబంధాలలో ప్రయోగించినదే.

ఉద్యానం అన్న పదం నెమలి అనే అర్థంలో నేను వాడినానని విమర్శకులు తెలిపారు. అది తప్పు ఆ అర్థంలో నేను వాడలేదు. 'ఉత్ + యానం' అనగా ప్రయాణం అనే అర్థంలో వాడినాను. ఇంకొక విషయం. 'స్త్రీ ఘోషం' అనే పదం దానికున్న ఒక్క అర్థంలోనే వాడినాను. 'స్త్రీ ఘోషం' అంటే ప్రభాతమే. మరొక్క అర్థంరాదు. కాని శ్రీ సంపత్కుమారన్నట్లు స్త్రీలఘోష అనే ధ్వని కూడా అందులో వుంది. ఎట్లనగా మరునాడు స్త్రీ ఘోషంకాగా సింహగడం ముట్టడి జరుపుతానని శివాజీ అంటాడు. ముట్టడి జరిగితే శత్రు వర్గానికి చెందిన స్త్రీలు ఘోషపెడతారని అర్థం. అనగా శత్రునాశం జరుగుతుందని ధ్వని సంక్షిప్తమైంది.

ఇక కథాగమనంలో మూడుచోట్ల కుంటుదనం వుందని విమర్శకులు సెలవిచ్చారు. మొదటి దానితోనూ రెండవ దానితోనూ కొంత వరకు ఏకీభవిస్తాను. ఉచితరీతిని మలిముద్రణలో సవరించుకొనుటకు ప్రయత్నిస్తాను. కాని మూడవ అంశంతో నేను ఏకీభవించను. ప్రభాత రేఖలు తూర్పులో తల చూపుతున్నవి. అప్పుడు శివాజీ సింహగడం చేరుకున్నాడు. ఆ మసక మసక వెలుగులో భట బృందం, వీరనాదం, జయోత్సాహం మాత్రమే అగమించేవానికి అగపడతవి. సునిశితంగా దగ్గఱలో పరిశీలిస్తేనే తప్ప ఆసైనికుల ముఖాల్లో అంతర్గతమైవున్న విషాదరేఖలు కనిపించవు, అదీకాక విజయం సాధించిన సైనికులు కార్యశూరులు. ముందు కర్తవ్యం. తరువాత అభిమానం. అయినను శివాజీ గడం చేరీ చేరడంతోనే తానాజీ ఏడని ప్రశ్న వేయడం, దానికి జవాబుగా సైనికులు తలలువాల్చి కన్నీరు కార్చడమూ వ్యక్తీకరింపబడింది. ఈ విషయం వారు సరిగ్గా పరిశీలించలేదను కొంటాను.

మొత్తంమీద శ్రీ సంపత్కుమార చక్కని విమర్శ చేసారు. వారికి నా అభివందనములు.

— మోటూరి వెంకటరావు.

## పుస్తక సమీక్ష

### దూతమత్తేభము

*రచన : రాయప్రోలు*

**పేజీలు 33** **వెల : రూపాయి**

కాళిదాసుని మేఘసందేశమునకు నింతవరకు తెలుగుభాషయందు ననేకానువాదములు వచ్చినవి. పై పేరుతో రాయప్రోలు సుబ్బారావుగారు మరియొక యనువాదమును మనకు ప్రసాదించినారు. కాళిదాసు కవిత్వము, తత్రాపి మేఘసందేశమును గురించి వేరుగా చెప్పనక్కరలేదు. మల్లినాథసూరి వంటి మహాపండితుడు 'మాఘే మేఘే గతం వయః' అన్నాడు. అట్టి సందర్భములో నెంత పండితునకైనను దానిని తెలుగుసేతకు తీసికొని నిర్వహింపబూనుట సాహసమనక తప్పదు.

అసలు సంస్కృత కావ్యములను గాని, నాటకములను గాని, తెనుగుసేయుట మిక్కిలి కష్టమైన విషయము. ఇంతవరకు తెనుగులో వచ్చిన ఏ సంస్కృత గ్రంథమును మూలాసేతు లేకుండ నర్థమగు స్థితిలో లేదన్నచో నతిశయోక్తిగాదు. బహు సందర్భములయందు ననూదితగ్రంథ మయోమయముగా నుండుటయు, నంతకంటె మూలగ్రంథమే సుబోధముగా నుండుటయు గళాశాలలయందు నున్నత పాఠశాలలయందు నాంధ్రభాషోపాధ్యాయులుగా నున్నవారికి సుపరిచితమైన విషయమే. కీర్తిశేషులు, శతావధానులు, తిరుపతి వేంకటకవుల యనువాదములకే ఇట్టి స్థితి తప్పనప్పుడు, తక్కిన వారి మాట చెప్పనవసరము లేదు. ఇది కేవలము నర్థమును గురించినంతవరకే. తక్కిన విశేషముల మాట దేవుని కెఱుక.

అనువాదకర్తయొక్క ప్రధానమైన ధర్మము మూలగ్రంథకర్తయొక్క యభిప్రాయమును, ఉద్దిష్టార్థమును స్పష్టముగా చెప్పుట. ఇది నిర్వహించినచో నూటికి తొంబది పాళ్ళు కర్తవ్యమును నిర్వహించినట్లే. మరి యీ యనువాదకర్తలలో కొంతమంది మూలగ్రంథమునందు 'అకాలమరణం చాపమరణంచ' అన్న వాక్యమునకు 'అకాలమరణమును చాపమరణమును' నన్న ధోరణిలో తెనుగు సేయువారు కూడ నుందురు. కాలమహిమవల్ల నట్టి యనువాదములు విశ్వవిద్యాలయములందు పాఠ్యగ్రంథములుగాకూడ నిర్ణీతములగుచుండును. ఇది పాఠమును చెప్పవలసివచ్చిన వారిబాధ దైవమున కెఱుక. ఆ పాఠము చెప్పువారికి సంస్కృతమునందు ప్రవేశము తావన్మాత్రమే యైనచో చాపమరణము చాపమరణముగనే ప్రసిద్ధిలోనికివచ్చును.

రాయప్రోలు సుబ్బారావుగారు సుప్రసిద్ధులు. బహు గ్రంథకర్తలు. వారీ మహాకార్యమునకు పూనుకొనుట మిక్కిలి సంతోషింపదగిన విషయము. రాయప్రోలు సుబ్బారావుగారి రచనలో ననంతమైన అక్షరరమణీయత యున్నది. మధురమైన శబ్దముల కూర్పు సుబ్బారావుగారి సొమ్ము. ఈ గ్రంథమునం దంతటను ఈ గుణము కొట్టవచ్చినట్లు కనిపించుచున్నది. మరియొక గుణము పద్యముయొక్క ఎత్తుగడ. ఇదికూడ వీరియందు ఉన్నతదశలో నున్నదని చెప్పవచ్చును. మెత్తని తెలుగు పలుకుబడులకు సుబ్బారావుగారు నిధియని చెప్పవచ్చును. "పసి గోరంటలు", "చుక్కలు పూలుచల్లు" "తరితీపుంజూపులం జిమ్మగా", "చేతికందు పువుగుత్తులు" "జిగురుం గాటుక", "తెలిముత్యాలు పెనంగు ముంగురుల ముద్దుంగుమ్మ చందంబునన్" "సూదిసందిదని పెంజీకట్లు" మొదలైన వెన్నో కలవు. ఈ పైన చెప్పిన మూడు గుణములు సుబ్బారావుగారి సహజమైన కవితాత్మను పట్టి యిచ్చుచున్నవి. ఆయన పలుకుబడి మెత్తగను మధురముగను నుండును. అర్థముతో సంబంధము లేకుండ వట్టి మాటల కూర్పుతోనే హృదయమాకర్షించు నేర్పాయన కున్నది. "కేవల శబ్దనిష్పీడనేనైవ తచ్చర్వణా దృశ్యతే" అన్న వాక్యమున కాయన రచన యుదాహరణము. నేటి కాలమున పలుమంది యందున్న అనవీకరణమను దోషము ఆయన వాక్కులందు లేదు. ఇది కవికి ప్రధాన

మైన గుణము. జన్మాంతరమునుండి సంక్రమించునది. ఇది సుబ్బారావుగారి ఈ పుస్తకమునందే కాదు, తక్కిన యన్ని గ్రంథములందును ముద్రితమై యున్నది.

అర్థముతో సంబంధము లేకుండ చూచినంత వరకు, అనగా వట్టి రచనము, శబ్దముల కూర్పు, పద్యముల యెత్తుగడలు, వలుకుబడులు వీనిని మాత్రమే చూచినపుడు సుబ్బారావుగారి కవిత్వము చల్లగాలి వీచినట్లుండును. దీనిని వదలి పద్యము నందలి యభిప్రాయ మేమి? ఈ వాక్యమున కర్థ మేమి? ఈసమాసమునకు విగ్రహ మేమి? ఈశబ్దము యొక్క సాధుత్వమేమి? మొదలైనవి విచారించితిమా, అడుగు త్వరగా ముందుకు పడుననిచెప్పుటకు వీలులేదు. వారి తక్కినగ్రంథములమాట ఎట్లున్నను ప్రస్తుతగ్రంథమునందు మాత్రము దాదాపు ప్రతి పద్యమునందు నేదియో తగాదా లేకుండ లేదు. పరవాలేదు అని చెప్పదగిన పద్యములు గ్రంథము నందుపదికంటె ఎక్కువ లేవని చెప్పుటకు చింతించుచున్నాను.మరియొక పెద్దబెడదయేమన, మొత్తము గ్రంథమం దంతటను నస్పష్టత యలముకొని యున్నది. ఈ గ్రంథమును మొదటినుండి తుది దాక మిక్కిలి జాగ్రతగా చదివితిని. రెండుమూడు పర్యాయములు చదివితిని. నాకేమనిపించిన దనగా, సుబ్బారావుగారికి ముద్దుముద్దు పదములను సంతరించుటలో నున్న శ్రద్ధ శ్లోకగతాభిప్రాయము స్పష్టము చేయుటలో లేదని. చాలచోట్ల శ్లోకార్థమునకు దూరముగా జరుగుటకూడ తటస్థించినది. "వర్షభోగ్యేణ" అనుదానికి "భోగ్యమగు వర్షాంతంబు" అని తెలుగు. ఇక్కడ ఆగకుండ పద్యమును చదువుకొనుచు బోయితిమా, సరేసరి. పద్యమున కేమి? మిక్కిలి గక్కగా నున్నది. భోగ్యమగు వర్షాంత మేమిటి? ఇక్కడ అంతమా భోగ్యము వర్షమా? కాళిదాసుని దృష్టిలో రెండును కాదే! శాపేన అనుదానికి వర్షభోగ్యేణఅనునది విశేషణము గదా! మరి శబ్దములను తబ్దీలు చేసి భోగ్యమగు వర్షాంతమని వ్రాయుటలోని యభిప్రాయ మేమి? దుర్బోధముగా నున్నది. "అస్తంగమిత మహిమా" అనుదానికి "ప్రజ్ఞలు గ్రుంక" అని తెలుగు. ప్రజ్ఞా శబ్దమునకు మహిమ యను అర్థము లేదుగదా! కాని ఇట్టివట్టుల ఏదో దూరముగా సరిపెట్టుకొన వచ్చును.

మూడవ శ్లోకములో ఉత్తరార్థము యక్షు డనుకొన్నట్లుగా అనువాదకులు తలంచినట్లున్నది. అది కవి వాక్యముగాని యక్షుని తలంపుగాదు. 'దధ్యౌ' అను దానికి 'చింతయామాస' అని మల్లినాథుని యర్థము. దాని వెనుక 'చిరం' అని యున్నది. అందుచేతనే 'మనోవికారోపశమన పర్యంతమితి శేషః' అని మల్లినాథసూరి వ్రాసెను. బహుశః అనువాదకులు మల్లినాథసూరి వ్యాఖ్యానమును గమనించియుండరు. అందుచేతనే యక్షుడిటు చింతించెన్ "సహప్రేయసీ సుఖులే......" ఇత్యాదిగా వ్రాసినారు.

ఏడవ శ్లోకమునందలి "బాహ్యోద్యానస్థిత హర శిరశ్చంద్రికా ధౌతహర్మ్యా" అను దానికి తెలుగు "శివచూడా శశిచంద్రికల్ తఘపు బాహ్యోద్యాన హర్మ్యంబులన్". బాహ్యోద్యానమునం దున్నది శివుడు కాని హర్మ్యములు కావు దీనికి మల్లినాథుని వ్యాఖ్య చూడవలసిన యవసరము కూడ లేదు. అర్థము వదలితిమా, పద్యము పాదముమూడు డెంత బాగుగా నున్నదో! అట్లుండుట గుణము కాదనగలమా! అర్థము మాత్రము తప్పు అని చెప్పక తప్పదు.

'భ్రూవికారానభిజ్ఞైః' అనుదానికి 'అనభిజ్ఞ భ్రూవిలాసంబులన్' అని తెలుగు. అనభిజ్ఞ భ్రూవిలాసము లనగా అనభిజ్ఞులయొక్క భ్రూవిలాసములు. అనభిజ్ఞు లనగా తెలియనివారు. ఏమి తెలియని వారు? 'భ్రూవికారానభిజ్ఞైః' 'అన్నపుడు భ్రూవికారాణాం అనభిజ్ఞైః' - భ్రూవికారములను తెలియని వారని అర్థముచేసికొనగలము. ఇక్కడ శబ్దము

అను తారుమారు చేసినందువలన ఆ యర్థము రాక పోగా, విపరీతార్థము సంఘటించినది.

'రిక్తస్సర్వో భవతి హి లఘుః పూర్ణతా గౌర వాయ' దీనికి తెలుగు 'రిక్తుడు సర్వలాఘువుడు స్థేయస్స్వామి పూర్ణుండగున్'. సంస్కృతములో నైన అర్థము సుబోధముగానేయున్నది. తెలుగులో, దీనికి సంస్కృతమది అని జ్ఞాపకము తెచ్చుకొని అర్థము చేసుకొనవలసినదే కాని వేరుగతికన్పించుటలేదు. 'సర్వలాఘువుడు' అనగా అర్థమేమి? సర్వమైన లాఘవము కలవాడని చెప్పుకొనవలసినదే కదా! 'స్థేయస్స్వామి పూర్ణుండగున్' అన్నది మరియు ఘోరముగా నున్నది. స్థేయస్స్వామి కర్థమేమి? ఈ వాక్యమునకును 'పూర్ణతా గౌరవాయ' యను వాక్యమునకు సంబంధ మేమి? 'కతిపయదిన స్థాయి హంసా దశార్ణాః' 'వాసము లింతంత త్యజింపనున్నయెడలై యొప్పున్ దశార్ణాంతముల్' వాసములు త్యజింపనున్నవి యేవి? హంసలు. సంస్కృత శ్లోకములోనివి తెనుగులోని కన్వయార్థము తెచ్చుకొనవలయును కాబోలు!

'పణ్యస్త్రీ రతిపరిమళోద్గారిభిః' అన్నదానికి 'వేశ్యా సుఖతల్పగుంఫిత సుగంధంబుల్' అని తెలుగు. ఇది కాళిదాసునకు మెరుగుపెట్టుట కాదు కదా!

'విద్యుద్దామస్ఫురితచకితై ర్యత్ర పౌరాంగ నానాం లోలాపాంగై ర్యది నరమసే లోచనై ర్వంచితస్స్యాః' 'జన్మమే విఫలంబౌను నటత్తటిచ్చకిత లోలాపాంగ మాంగళ్యమాల్యముతో పౌరని తంబినీనయన సాంగత్యం బుపేక్షించినన్'. అని తెలుగు. ఏక దేశాన్వయము మాట యట్లుంచి ఈ మాంగళ్యమాల్యము లేమిటి'

'వీచీక్షోభ స్తనిత విహగశ్రేణి కాంచీగుణాయాః సంసర్పన్త్యాః స్ఖలితసుభగం దర్శితావర్తనాభేః నిర్వింధ్యాయాః పథి భవ రసాభ్యంతర స్సన్నిపత్య స్త్రీణా మాద్యం ప్రణయవచనం విభ్రమోహి ప్రియేషు'

దీనికి తెలుగిది.

"తరగల్ త్రుళ్ళగ కూజితంబులగు
హంసల్ మేఖలామాలగా
సుడిబొడ్డేర్పడ జారుచున్ సుభగయై
నిర్వింధ్య నీ దారిలో
కలియన్ వచ్చు రమింపు మింపుగ
రసాంతర్భోగివై చేష్టితం
బులెగా నెచ్చెలు లిష్టవల్లభుల
పట్లంజూపు భావార్థమున్."

శ్లోకమునకు పద్యమున కెన్ని క్రోశముల దూర మున్నదో చెప్పజాలము. "దర్శితావర్తనాభేః" ఇచ్చట దర్శిత అన్న పదముచేత నిర్వింధ్యయందు ప్రౌఢనాయికాత్వము గమ్యమగుచున్నది. దానికి "సుడిబొడ్డేర్పడ" అని తెలుగు. "రసాభ్యంతరో భవ" "రమింపు మింపుగ రసాంతర్భోగివై" అని తెలుగు. 'రసాంతర్భోగి' వనగా అర్థమేమి? మూలమునందలి రసాభ్యంతరః అనుటలోనున్న శృంగార వ్యంగ్యము రమింపు మింపుగ అనుటలో వాచ్యమైనది. మరి చివరి పాదమునకు తెలుగునకు సంబంధమే లేదు. ఈ ఒక్క పద్యము చాలును అనువాదములో నున్న బండారమును బయటపెట్టుటకు. ఇంచు మించు గ్రంథమంతయు నిట్లే సాగినది. "కుందక్షేపానుగమధుకరశ్రీముషా మాత్మబింబం పాత్రీకుర్వన్ దశపురవధూనేత్రకౌతూహలానాం" "మల్లికల సయ్యాడించు ఇందిందిర ద్యుతులన్ దోచిన వారిచూపు తమికిన్ పాత్రంబవై పోవుమీ" కుందక్షేపానుగ మధుకరశ్రీ—మల్లికల సయ్యాడించు ఇందిందిరద్యుతి. మల్లెపూవుయొక్క కదలికల ననుసరించు తుమ్మెదలయొక్క కాంతులు అను యర్థము తెనుగు వాక్యమునందు వచ్చుచున్నదా. కాని మల్లికల సయ్యాడించు అను పదము మాత్రము బాగున్నది.

'కమలామోద మైత్రీ కషాయః' తామరల పుప్పొళ్ళు సుగంధంబులై' సంబంధము లేదు.

'యత్రస్త్రీణాం హరతి సురతగ్లాని మఙ్గానుకూలః
శిప్రావాతః ప్రియతమఇవ ప్రార్థనా చాటుకారః.

'రమలన్ సోక్కిన' ఇత్యాది తెలుగుసేత మిక్కిలి యనుచితముగా నున్నది. శిప్రావాతమునకు పోలిక ప్రియునితోగాని చాటుకారముతోకాదు. అపుడు పైనుండి తెచ్చినసారసకూజితములు, కమలామోద మైత్రీకషాయము వ్యర్థములైపోవును.

ఇట్లు పోల్చుకొనుచు పోయినచో గ్రంథము పెరిగిపోవును. అనువాద లక్షణమును చూపించుటకు మాత్రము ఈపై యుదాహరణము తీయక తప్పలేదు.

మరి సమాసములను గురించి విమర్శింపవలసిన పనిలేదు. నూటికి తొంబది సమాసములకు విగ్రహవాక్యములు కుదురవు. ప్రథమోదాహరణము గ్రంథనామమే. ఈగ్రంథమునకు 'దూతమత్తేభ'మని నామముంచుటలో కవిగారి సమాసగ్రథన నైపుణ్యము వెల్లడి యగుచున్నది. గ్రంథమునందున్న పద్యములన్నియు మత్తేభములు కాబట్టి దీనికినామముంచుట యుచితమని కవిగారి యుద్దేశము. ఇంతకుతప్ప యెంత తల బ్రద్దలుకొట్టుకొన్నను, ఈ పేరునకు అర్థము కుదురుటలేదు. ఈయర్థమునందా సమాసము కుదురదు. 'గజమాద్యద్గంధ తిక్తంబు' 'ఊర్మిమతీ వేత్రవతీ' 'దండహ్యోగ్ని' 'పటహోవాద్యము' 'అనావృతాంబర నితంబ' 'భ్రుభంగి' 'గంగా జాతకాపావనంబు' 'శ్యామాయామము' 'విభ్రాజ వీధులు' 'గుప్పిళ్ళాదిగా' 'యామమాత్రగతగర్జాళాళి.'

ఇట్టి సమాసములు సమాసరచనమును గురించి ప్రాథమిక జ్ఞానము కలవాడైనను చేయగూడనివి. కాని యిట్టివి గ్రంథమందంతటను కొల్లలుగా నున్నవి. 'రమణించి' 'స్నేహప్రీతి' 'కూజితంబులగు హంసల్' 'చినుకుల్ రాలను తీతితో' ఇత్యాది దోషములు సహింపరానివి.

మరి కవిగారు 'విరహధ్యానము'లో మునిగి పోయినారు కాబట్టి యతిప్రాసల సంగతి మరచి పోయినారు.

గణయతిప్రాసలు మూడును ద్వంద్వసమాసము. అందు మొదటిదానిని కూడ మఱచిపోయినచో తెనుగుసేత యింతకంటె కొంచెము మెరుగుగా నుండెడిదేమో! సంస్కృత గణమునకు తెనుగు గణమునకు నున్న నామసాదృశ్యము వలన దీనిని గట్టిగా గుర్తుపెట్టుకొని యుందురేమో! ఎంత గట్టిగా గుర్తుపెట్టుకొనిరనగా, 'యమునా గంగల సంగమోత్సవము అస్థానంబునందైనటుల్' ఇచ్చట సంధిచేసినచో గణ భంగమగునన్నంత జాగ్రత్త కలుగునంత. గణము కుదురుపాటగుటకు సంధి యవసరమైన వీరు తప్పక పాటింతురని ఈ పై చరణమే ఋజువు.

సుబ్బారావుగారు మిక్కిలి సుప్రసిద్ధులైన కవులగుటవల్లను, విశేషించి రెండు విశ్వవిద్యాలయములలో ఆంధ్ర శాఖాధ్యక్షులుగా నుండి ఎం. ఏ. విద్యార్థులకు బోధకులుగా నుండుటచేతను వారికి మిక్కిలి ప్రాముఖ్య మున్నదని వేరుగా చెప్పనక్కరలేదు. వారి స్థితినిబట్టి చూచినచో వారు గొప్ప పండితులని యనికొందుము గదా! అట్లను కొనుటలో తప్పులేదు. కాని వారి గ్రంథము మాత్రము దానికి వ్యతిరేక సాక్ష్య మిచ్చుచున్నది. వారి ప్రసిద్ధి విననివా రెవరైన ఈ గ్రంథము చదివినచో రచయిత పాండిత్య మెంత దుస్థితిలో నున్నదని యనుకొనక మానరు. వారి తెలుగుసేతకు బూనుకొనుటకు ముందు దానికి కావలసిన సామగ్రి నంతయు సమకూర్చుకొన్నచో బాగుండెడిది.

ఉపాధ్యాయుల నరసింహమూర్తి

వచ్చే సంచికలో

బుచ్చిబాబు

పి. శ్రీదేవి

వాడ్రేవు పతంజలి

కోటగిరి విశ్వనాథరావు

బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

సుప్రసన్న

సంపత్కుమార

విశ్వనాథ సత్యనారాయణ

౩౧౭, సుల్తాన్ బజార్, హైదరాబాదునుండి జువ్వాది గౌతమరావుచే ప్రకటితము. ఫోన్ : ౪౬౦౮
అజంతా ప్రింటర్సు, సికింద్రాబాదు.